జాతీయ జీవిత గ్రంథమాల

# నేతాజీ సుభాసు చంద్ర బోస్

శిశిర్ కుమార్ బోస్

అనువాదం

అట్లూరి పురుషోత్తం




నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

ఈ పుస్తకం మొదట ఇంగ్లీషులో సెప్టెంబరు 1986లో సత్యదేవ్ చక్రవర్తి ద్వారా లిబర్టీ పబ్లిషర్స్ కోసం ప్రచురించబడినది.

ISBN 81-237-2150-1

ప్రథమ ముద్రణ 1997 (శక 1919)

*Original title*: The Flaming Sword Forever Unseathed: A Concise Biography of Netaji Subhas Chandra Bose.
*Telugu translation:* Netaji Subhas Chandra Bose

రూ. **40.00**

డైరెక్టర్, నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా,
ఎ-5, గ్రీన్‌పార్క్, న్యూఢిల్లీ-110 016 ద్వారా ప్రచురింపబడినది.

## ప్రాస్తావిక

ఇండియన్ నేషనల్ కాంగ్రెసు శతవార్షికోత్సవాల కాలంలో ప్రచురించే నిమిత్తం, కాంగ్రెసు శత వార్షికోత్సవాల నిర్వహణా సంఘం కేంద్ర కమిటీ వనువున మొదట యీ సంక్షిప్త నేతాజీ సుభాసు చంద్రబోసు జీవితచరిత్ర రాయబడింది. కాని ఆ కమిటీ యీ పుస్తకాన్ని ప్రచురించకుండా, దీని రాత ప్రతిని చివరకు రచయితకు తిప్పిపంపించింది.

ఈ జీవిత చరిత్ర భారత జాతీయోద్యమం చరిత్రను తెలుసుకొనగోరే వారికోసం, ముఖ్యంగా ఆ ఉద్యమంలో పాల్గొననివారికోసం, ఆ ఉద్యమాన్ని గురించి ఏమీ తెలియని వారికోసం సరళమైన ఇంగ్లీషులో రాయబడింది. సమకాలిక భారతదేశ చరిత్రలో అద్వితీయమైన వ్యక్తిగా వెలుగొందిన ఒక గొప్ప మనిషి జీవితాన్ని, స్వభావాన్ని, యీ చిన్న పుస్తకం రేఖామాత్రంగా తెలియజేస్తుంది. ఈ రచయిత వ్యక్తులను గురించి, సంఘటనలను గురించి తనకు గల అభిప్రాయాలను లేదా తనకు నచ్చిన వ్యాఖ్యలను పాఠకుల మీద రుద్దకుండా ఉండటానికి ప్రయత్నించాడు. చారిత్రక సంఘటనలను యథాతథంగా చిత్రించటానికీ, నాటి సంఘటనలకు నేతాజీ ఏ విధంగా స్పందించినదీ, వీలైనంతవరకు ఆయన మాటలలోనే వివరించటానికి యీ రచయిత ప్రయత్నించాడు.

కొందరు అధికారంలో ఉన్నవాళ్లు, విద్యా విషయిక ప్రపంచంలో నిర్ణయాలు చేయగలవాళ్లు, సిగ్గులేకుండా, మొండిగా, కఠోరంగా భారత జాతీయోద్యమం చరిత్రను తమ స్వంతం చేసికొని, గుత్తకు తీసికొని, వక్రీంచుతున్నందున, కొన్ని చారిత్రక సత్యాలను, వాటికి నేతాజీ యిచ్చిన వ్యాఖ్యలను, భారతదేశంలోనూ, వెలుపలా గల సాధారణ పాఠకుల దృష్టికి తొందరగా తేవలసిన అవసరం ఏర్పడింది.

నవీన భారతదేశ చరిత్రలో ఎంతో అద్భుతమైన, సంక్లిష్టమైన, వివాదాస్పదమైన వ్యక్తిగా పేరుపొందిన ఒక గొప్ప మనిషి జీవితచరిత్ర అయిన యీ చిన్న పుస్తకం, దీనిలో ప్రస్తావనకు వచ్చిన విషయాలను

అనుసరించి 32 భాగములుగా విభజింపబడింది. ఈ పుస్తకం చివర ఉన్న పుస్తకాల పట్టీ, చిన్నదే అయినా, సుభాసుచంద్రుని గురించి ఇంకా తెలుసుకొనగోరే వారికి ఇది బాగా ఉపయోగపడుతుంది.

ఈ పుస్తకం బెంగాలీ, హిందీ, తదితర భాషల కూర్పులను సాధ్యమైనంత త్వరగా ప్రచురించటానికి కావలసిన కృషి జరుగుతుంది. ఈ పుస్తకం రాతప్రతిని తయారుచేయటంలో నాకు ఎంతో తోడ్పడిన శ్రీ అరుణకుమార్ చటర్జీ, శ్రీ సుధీర్ రంజన్ దాస్‌లకు, ఇంకా నా బిడ్డలకు నా కృతజ్ఞతలను తెలియజేస్తున్నాను.

ఈ పుస్తకానికి సమర్ధవంతంగా రూపురేఖలను యిచ్చి సాధ్యమైనంత తక్కువ కాలంలో దీని ప్రచురణకు తోడ్పడిన శ్రీ శంకర మజుందార్, మరియు సెంట్రల్ కలకత్తా ప్రింటింగ్ వర్క్సువారికి నా అభినందనలు.

జైహింద్!

వసుంధం
90, శరత్ చంద్ర బోస్ రోడ్
కలకత్తా - 700026
6 సెప్టంబరు, 1986.

**శిశిర్ కుమార్ బోస్**

# 1

1757వ సంవత్సరం భారతదేశ చరిత్రలో చాలా ముఖ్యమైనది. ఆ సంవత్సరం ఇండియాపై దండెత్తి వచ్చిన బ్రిటిష్‌వాళ్ళతో పోరాడి, మొదటిసారి ఓడిపోయిన తరువాత భారతీయులు, పోయిన స్వాతంత్ర్యాన్ని తిరిగి సంపాదించటానికి ఒక శతాబ్దం కంటే ఎక్కువ కాలం ఎన్నో చేదు అనుభవాలను మిగిల్చిన యుద్ధాలను చేశారు. ఎన్నో కష్టాలకు లోనయ్యారు. ఆ యుద్ధాలన్నింటిలో స్వతంత్ర పౌరులుగా భారతీయులు చేసిన చివరి యుద్ధం, 1857లో జరిగింది. అప్పుడు మొగల్ సామ్రాట్టులలో ఆఖరివాడైన బహదూర్‌షా దానికి నాయకుడు. అయితే అప్పుడు ఈ యుద్ధంలో మనవాళ్ళ పరాక్రమం, స్వార్థత్యాగం నిరుపయోగమయ్యాయి. దురదృష్టం, భ్రష్టుపట్టిన నాయకత్వం వాళ్ళ ఓటమికి, లొంగుబాటుకు దారితీశాయి. ఆ ప్రథమ స్వాతంత్ర్య సమరంలో మనవాళ్ళు ఓడిపోయిన తరువాత, అనగా 1858లో, మనదేశ పరిపాలనను తూర్పు ఇండియా కంపెనీ నుండి తొలగించి బ్రిటిష్ రాణీకి అప్పగించారు. అప్పటినుంచే ఆమె బ్రిటన్‌కు రాణీ, ఇండియాకు సామ్రాజ్ఞి అయింది. అప్పుడే బ్రిటిష్ సామ్రాజ్యవాదం ఇండియాను తన గుప్పెట్లో పెట్టుకొని, ఒక పథకం ప్రకారం, శాశ్వతంగా సడలని పట్టును సంపాదించటానికి ఉపక్రమించింది. తత్ఫలితంగా, ఇండియా సమకాలిక చరిత్రలో తొంభై సంవత్సరాలపాటు కొనసాగిన ఒక నూతనాధ్యాయం ప్రారంభమైంది. ఇది భారతదేశ చరిత్రలో చాలా క్లిష్టమైన దశ. ఆ దశకంలో 1897కు ఒక ప్రత్యేకత వుంది. అదే సుభాసు చంద్రబోసు జన్మించిన సంవత్సరం. దానికి నలభై సంవత్సరాల ముందు ప్రథమ స్వాతంత్ర్య పోరాటం జరిగింది. దానికి నలభై ఐదు సంవత్సరాల తరువాత ఇండియా స్వాతంత్ర్యం కోసం జరిగిన సాయుధ పోరాటానికి ఆ సుభాసు చంద్ర బోసు నాయకత్వం వహించారు. 1897లో బ్రిటిష్ సామ్రాజ్యం విక్టోరియా మహారాణి పాలన రజతోత్సవాన్ని జరుపుకుంటూ వుంది. అదే సమయంలో బ్రిటిష్ సామ్రాజ్యం సైద్ధాంతిక

పునాదులను సవాలు చేయనున్న సాహసోపేతుడుగా, నవ భారత స్వాతంత్ర్య సమరయోధుల నాయకుడుగా, ప్రపంచదృష్టిని ఆకర్షించనున్న సుభాను చంద్రబోసు ఒరిస్సాలో, ఒక చిన్న పట్టణంలో జన్మించాడు. ఆ సంవత్సరం రెండు స్వాతంత్ర్య సమరకాలాలకు దాదాపు మధ్య కాలం కావటం విశేషం.

సుభానుబోసు తండ్రిపేరు జానకీనాథ్ బోసు. ఆయన బెంగాలులోని 24 పరగణాల జిల్లానుండి, న్యాయవాద వృత్తిలో స్థిరపడటానికి కటక్ వెళ్ళాడు. కాని ఆ పట్టణం అనాడు అవిభక్త బెంగాలు రాష్ట్రంగావున్న బెంగాలు ప్రెసిడెన్సీలో, ఎక్కడో ఒక మూలనవున్న ఓ చిన్న పట్టణం. అప్పుడు దానికి కలకత్తాతో రైలుమార్గం కూడా లేదు. ఆ పరిస్థితులలో జానకీనాథ్ బోసు జీవనోపాధికోసం కటక్‌కు ప్రయాణం కట్టటమే ఒక గొప్ప సాహసకృత్యం. ధైర్యవంతుల్ని లక్ష్మి వరిస్తుందన్నట్లు, సుభాను జన్మించేనాటికే జానకీనాథ్ కటక్ న్యాయవాదులలో అత్యున్నత స్థాయికి ఎదిగాడు, గవర్నమెంటు ప్లీడరు అయ్యాడు కూడా. కటక్ పురపాలక సంఘానికి అధ్యక్షుడయ్యాడు. 1912లో ఆయన బెంగాలు లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యుడు కూడా. ఆయన గవర్నమెంటు ప్లీడరుగా వుంటూ, అఖిల భారత జాతీయ కాంగ్రెస్, మహాసభలకు హాజరవుతూండడం వలన అధికారుల అనుగ్రహానికి దూరమయ్యాడు.

1930లో మహాత్ముడు సహాయ నిరాకరణోద్యమాన్ని ప్రారంభించినప్పుడు, బ్రిటిష్ ప్రభుత్వం మన స్వాతంత్ర్య సమరయోధుల మీద క్రూరంగా విరుచుకుపడింది. అప్పుడు జానకీనాథ్‌బోస్ బ్రిటిష్ ప్రభుత్వానికి తన అసమ్మతిని తెలియజేస్తూ తన 'రావు బహదూర్' బిరుదును వదులుకున్నాడు. ఆయన గొప్ప దాత, దేశ భక్తి పరాయణుడు. ఖాదీ అన్నా, స్వదేశీ వస్తువులన్నా ఎంతో అభిమానం కలవాడు. ఎన్నో జాతీయ విద్యా సంస్థల నిర్మాత, పోషకుడు కూడా. ఆయన కుమారులైన శరత్, సుభానులు, కాంగ్రెస్‌కు, జాతీయ కార్యక్రమాలకు తమ జీవితాలను అంకితం చేసినప్పుడు, ఆయన వాళ్ళను హృదయపూర్వకంగా బలపర్చాడు.

సుభాను తల్లిపేరు ప్రభావతి. ఆమె కన్న వారిది ఉత్తర కలకత్తాలో హాథ్‌కోలా ప్రాంతం. వారిది సాంప్రదాయబద్ధమైన దత్తుకుటుంబం.

ఆమెకు ఎనిమిదిమంది మగ పిల్లలు అరుగురు ఆడపిల్లలు. వారిలో

సుభాసు తొమ్మిదవ బిడ్డ. ఆమె మంచి సంకల్పబలంతోపాటు, సున్నితమైన వాస్తవ దృష్టి, నిశితమైన లోకజ్ఞానంగల స్త్రీ. కాగా ఆమె ఆదర్శప్రాయమైన పద్ధతిలో తన యావత్తు కుటుంబ వ్యవహారాలను ఎంతో సమర్థంగా నిర్వహిస్తూ వుండేది. శరత్, సుభాసులు, మనదేశం స్వాతంత్ర్యంకోసం చేసిన పోరాటంలో అనుభవించిన బాధలనూ, చేసిన త్యాగాలనూ, ఆమోదించటంలో, ఆమె, ఆమె భర్త ఎంతో ధీరోదాత్తతను ప్రదర్శించారు. 1921 డిసెంబరులో సుభాసు చంద్రుని మొదటిసారిగా నిర్బంధించినప్పుడు, శరత్‌కు ఒక ఉత్తరం రాస్తూ, 'బాబూ! సుభాసుకూ, నిన్నూ చూసి మేం గర్విస్తున్నాం' అన్నాడు జానకీనాథ్. మహాత్మాగాంధీ ప్రజాసేవ సిద్ధాంతం ఎప్పటికైనా భారతదేశానికి స్వరాజ్యాన్ని తెస్తుందని ప్రభావతి నమ్మింది. అదే సమయంలో తన కుమారుని ఏదో ఒక రోజున ప్రభుత్వం నిర్బంధించుతుందని కూడా ఊహించింది. ఈ విషయాన్ని ఆమెయే బయటపెట్టింది. బోసు వంశీయుల చరిత్రలో సుమారు ఇరువది ఏడు తరాలవరకు మాత్రం వెనక్కి వెళ్ళగలం. దశరథబోసు వారి మూల పురుషుడు. ఆయన వంశస్థులు కలకత్తాకు దక్షిణంగా పదునాలుగు మైళ్ళదూరంలో వున్న మాహి నగర్‌లో ఉంటూండేవారు. అందుకే వారికి మాహినగర్ బోసులు అనే పేరు సార్థకమైంది.

బోసుల వంశవృక్షంలో 11వ శాఖకు చెందిన మహాపతి బోసు చాలా అసాధారణమైన ప్రజ్ఞ కలవాడు. కాగా ఆయన నాటి బెంగాలు నవాబుదృష్టిని ఆకర్షించి, ఆయన దగ్గర ఆర్థిక, యుద్ధ శాఖల మంత్రిగా నియమితుడయ్యాడు. ఆయనకు 'సుబుద్ధిఖాన్' అనే బిరుదు లభించింది. ఆయన శక్తి, సామర్థ్యాలను పాలకులు గుర్తించి ఆయనకొక జాగీరును కూడా యిచ్చారు. ఆయన నివసించిన గ్రామాన్ని ఇప్పటికీ సుబుద్ధీన్‌పురం అని పిలుస్తుంటారు.

మహాపతి మునిమనుమడైన గోపీనాథ్ బోసు కూడ అసాధారణమైన ప్రజ్ఞా, శక్తి, కలవాడు. ఆయన పదిహేనవ శతాబ్దం చివరి సంవత్సరాలలో సుల్తాన్ హుస్సేన్‌షా ఆర్థికమంత్రిగాను, నావికాదళాధిపతిగాను రాణించాడు. 'పురందర్ ఖాన్' ఆయన గౌరవబిరుదు. ఆయన జాగీరును ఇప్పటికీ పురందరపురం అంటారు. అది మాహినగర్‌కు ఎంతో దూరంలో లేదు. పురందర్, ఇంకా ఆయన తాత, ముత్తాతలు, తరాలతరబడి

మంత్రులుగా పనిచేసినందున, వారి కుటుంబానికి ఎంతో పలుకుబడి, పరువుప్రతిష్టలు ఉండేవి. ఇంతేకాదు. పురందర్ మాహినగర వాస్తవ్యుడు కాబట్టి, ఆ ప్రాంతం దక్షిణ వంగదేశం కాయస్థుల కేంద్రం అయింది.

పురందర్ గొప్ప సాంఘిక సంస్కర్త కూడా. కాయస్థుల పురాతన ఆచారాలను గురించి చర్చించటానికి, వాటిని అవసరమైనంత వరకు సరిదిద్దటానికి, ఇంకా కాయస్థులనందరినీ ఒక త్రాటి మీదకు తేవటానికి, పురందర్ ఒకసారి ఓ లక్షమంది కాయస్థులు హాజరైన మహాసభను నిర్వహించాడు. ఆ జనం అందరికీ త్రాగేందుకు నీటిని అందించటానికి ఓ పెద్ద చెరువును త్రవ్వించాడు. ఆ పనిలో నిమగ్నులైన కార్మికులు, వారి పారలను మాహినగర్ దగ్గరలో ఒకే ఒకచోట ఉంచేవారు. పారను బెంగాలీ భాషలో 'కోడల్' అంటారు. కాగా అక్కడ 'కొడాలియా' అనే గ్రామం వెలిసింది. అదే జానకీనాథ్ పుట్టిన గ్రామం. ఆయనా, ఆయన బిడ్డలూ, ఆ గ్రామం పేరు చెప్పితేనే పులకించిపోయేవారు. జానకీనాథ్ తన జీవితాంతం వరకు ఆ గ్రామంతో సన్నిహిత సంబంధాలను ఉంచుకున్నాడు. దాని సాంఘిక అభివృద్ధి కోసం పాటుపడ్డాడు. ప్రతి సంవత్సరం దుర్గ పూజలు జరిగే రోజులలో, జానకీనాథ్ తన స్వగ్రామానికి వెళ్ళి, తన గ్రామస్తులనందరినీ తిరగవేసేవాడు. ఆయన పిల్లలు ఆ పూజా కార్యక్రమాలలో పాల్గొనేవారు. సుభానుచంద్రుడూ ఆ కార్యక్రమాలలో పాల్గొన్నాడు. పదిహేను సంవత్సరాల బాలుడుగా ఉన్నప్పుడు సుభానుచంద్రుడు తనతల్లికి ఉద్రేకపూరితమైన ఉత్తరాలను రాస్తూ, ఆ గ్రామంలో తను పొందిన అనుభూతిని వర్ణించేవాడు.

ఆ గ్రామాన్ని సాంఘికంగా అభివృద్ధి చెయ్యటంలో శరత్ తన తండ్రి అడుగు జాడలలో నడిచేవాడు. ఒక్కొక్కసారి కొడాలియా అభివృద్ధి కోసం శరత్ చట్టాన్ని పక్కనపెట్టి కూడా పనిచేసే వాడు. చిన్న గ్రామం అయిన కొడాలియా బోసులకే కాకుండా, భారతదేశ స్వాతంత్ర్యంకోసం తమ సర్వస్వాన్నీ అర్పించి, అంకితభావంతో కృషిచేసిన మరెందరో దేశభక్తులకు, విప్లవకారులకు జన్మను యిచ్చింది. వారిలో మానవేంద్రనాథ్ రాయ్ (యమ్.యన్.రాయ్) ఒకరు.

# 2

"నేను ఎందుకూ పనికిరాని అప్రయోజకుడుననే భావం నాకు కలగటం నా చిన్నతనానికి సంబంధించిన సంఘటనలలో నాకు గుర్తువున్న మొదటి సంఘటన." అని సుభాస్ తన స్వీయ చరిత్రలో రాసుకున్నాడు. తన చిన్నతనంలో తన తల్లిదండ్రులతో చాలా సన్నిహితంగా ఉండాలని సుభాసు చంద్ర బోసు కాంక్షించాడు. కాని ఈ చిన్న బోసుకు అటువంటి అవకాశం లభించలేదు. జానకీనాథ్‌బోసు కుటుంబం చాలా పెద్దది. పైగా బోసు తల్లిదండ్రులతో మాట్లాడాలంటే అందరికీ భక్తి భావంతో కూడిన భయం కలిగేది.

మొదట్లో తను ఎందుకూ పనికిరాని అప్రయోజకుడనని భావించిన బోసు వ్యక్తిత్వ పరిణామ క్రమంలో ఎప్పుడు ఏ మెట్టు ఎక్కిందీ జాడలు తియ్యటం చాలా ఆసక్తికరంగా ఉంటుంది. జానకీనాథ్ తన పెద్ద బిడ్డలను పంపినట్లే సుభాసు బోసును కూడా మొదట కటక్‌లో వున్న ప్రొటెస్టెంట్ యూరోపియన్ పాఠశాలకు పంపించాడు. అది పూర్తిగా ఆంగ్లేయుల ఆలోచన ప్రకారం, ఆంగ్లేయుల పద్ధతిలో నడిచే బడి. కాగా అక్కడ చదివిన ఇతరులతో పాటు సుభాసుచంద్రకు మంచి ఇంగ్లీషు పట్టుబడటమే కాకుండా, ఇతర పాఠశాలలలో చదివే తన యీడు పిల్లలకంటె ఎక్కువ ఇంగ్లీషు భాషా, సంస్కృతులకు ప్రాధాన్యం యిచ్చిన చదువు అబ్బింది. మనిషికి క్రమశిక్షణ, మంచి నడవడి, మార్గదర్శకత్వం, కాల పరిపాలన, పనిలో శుభ్రత అవసరమనే భావాన్ని కూడా ఆ చదువు అతని మనస్సులో నాటింది. సుభాస్ పాఠశాల జీవితం బాధాకరం కాకపోయినా, ఆయన చైతన్యం పెరిగిన కొలదీ తన యీడు విద్యార్థులు సాధారణంగా కలవని రెండువిభిన్న ప్రపంచాలలో బ్రతుకుతున్నట్లు గ్రహించటం ప్రారంభించాడు. ఇది ఇలా ఉండగా, విద్యార్థిగా బోసు సాధించింది ఏమిటీ అనే ప్రశ్నకు జవాబు చెప్పాలంటే, ఆయన పాఠ్యగ్రంధాలను అధ్యయనం చెయ్యటంలో ఉత్తమ శ్రేణి విద్యార్థులలో కూడా అగ్రగామిగానే ఉండేవాడని చెప్పవచ్చు.

కాని క్రీడారంగంలో ఆయన ఎప్పుడూ వెనుకబడే ఉండేవాడు. ఐనా 1909వ సంవత్సరంలో ఆయన ఆ పాఠశాలకు వీడ్కోలు చెప్పినప్పుడు ఎటువంటి అసంతృప్తినీ ప్రకటించలేదు.

తరువాత ఆయన రెవన్‌షా కళాశాల పాఠశాలలో ప్రవేశించాడు. అక్కడ ఆయన మానసిక ధోరణి, అలోచనా విధానం పూర్తిగా మారిపోయాయి. ఆ పాఠశాలలో వున్న భారతీయ వాతావరణం ఆయనకు నూతన ఆత్మస్థయిర్యాన్ని కలుగజేసింది, ఆయన వ్యక్తిత్వాన్ని గురించి ఆయనకు మెరుగైన అభిప్రాయం ఏర్పడింది. ఆయనకు తన మాతృభాష అయిన బెంగాలీలో తప్ప, మిగిలిన అన్ని విషయాలలోను పరీక్షల్లో బాగా రాణించవచ్చుననే అభిప్రాయం ఏర్పడింది. బెంగాలీ భాషను ఆయనకు పాఠశాలలోలాగా బోధించలేదు. అయినా ఆయన గట్టిగా కృషిచేసి, బెంగాలీ భాషలో కూడ ముందుకు వెళ్ళి, తన మొదటి వార్షిక పరీక్షలో బెంగాలీ భాషలో ప్రథముడుగా ఉత్తీర్ణుడయ్యాడు. ఇంతేకాదు, ఆయన సంస్కృతాన్ని కూడ ఎంతో అభిలాషతో అభ్యసించటం ప్రారంభించాడు. కాని క్రీడారంగం మాత్రం నిర్లక్ష్యం చేసిన రంగంగానే మిగిలిపోయింది. ఈ లోపాన్ని గురించి ఆయన తన జీవితాంతం వరకు చింతిస్తూనే వుండేవాడు. రెవెన్‌షా కళాశాల హైస్కూలులో ఉపాధ్యాయులతోనూ, విద్యార్థులతోనూ కూడా బెంగాలీలూ, ఒరియా వాళ్ళూ కలిసి మెలిసి ఒకరినొకరు సాదరంగా గౌరవించుకుంటూ వుండేవారు. బోసు ఇంటిదగ్గర పనిచేస్తున్న ఒరియావాసులు, హిందువులు, మహమ్మదీయుల మధ్యకూడ అటువంటి స్నేహ వాతావరణమే ఉండేది. సుభాస్ తల్లి దండ్రులు ఉదార స్వభావానికి పేరుగాంచిన వారు. వారి మంచి తనం వారు కుంటుంబ మొత్తాన్ని ప్రభావితం చేసింది. కాగా సుభాస్ బాబూ, ఆయన తరంవారూ, ఎప్పుడూ సంకుచితంగాగాని, కొన్ని ఎల్లలమధ్యగాని ఆలోచించటం అనేది లేదు.

వేణు మాధవ్ దాస్ రెవెన్‌షా కళాశాల పాఠశాల ప్రధానోపాధ్యాయుడు. ఆయన అప్పుడే బాల్య దశను దాటిన సుభాసు ఆలోచనా ధోరణిని శాశ్వతంగా ప్రభావితం చేశాడు. సౌందర్య ఆరాధనకు, నీతికి సంబంధించిన మంచి విలువలను ఆయన సుభాసు లేత మనస్సులోకి చొప్పించాడు. మానవ జీవితంలో అన్నింటికంటె నైతిక విలువలకే ఎక్కువ ప్రాధాన్యత వుందని ఆ ఉపాధ్యాయుడు తన శిష్యునికి బోధించాడు.

తనంతట తాను ప్రకృతికి లోబడి, ప్రకృతి చూపిన మార్గంలో నడువమని ఆ ఉపాధ్యాయుడు బోసుకు చెప్పాడు. ఆయన మాట ప్రకారం సుభాను ప్రకృతి అందాలకోసం నదులగట్ల మీద, కొండల మీద అస్తమించుచున్న సూర్యుని వెలుతురులో ప్రకాశించుచున్న గడ్డి మైదానాలలోను అందమైన ప్రదేశాల కోసం ఒంటరిగా అన్వేషించటం ప్రారంభించాడు. అటువంటిచోట్ల ధ్యానం చెయ్యటం అలవాటు చేసుకున్నాడు. మనిషికి ప్రకృతికిగల అవినాభావ సంబంధాన్ని గురించి వేణు మాధవ్ యిచ్చిన వివరణ ఏకాగ్రతతో ధ్యానం చెయ్యటానికి సుభాసుకు ఎంతో ఉపయోగపడింది.

అప్పుడు సుభాస్ వయస్సు, సుమారు పదిహేను సంవత్సరాలు. ఆ వయస్సులో సుభాస్ జీవితంలో అతి గొప్ప మానసిక సంక్షోభం సంభవించింది. ఆయన అంతరంగంలో చాలా తీవ్రంగా బాధపడ్డాడు. అది మనిషిని సహజంగా ఆకర్షించే ఐహిక జీవితానికి, ఆయనలో చెలరేగుచున్న స్వార్థంతో సంబంధంలేని ఉదాత్త భావాలకు మధ్య జరిగిన సంఘర్షణ. ఆ సంఘర్షణ నుండి బయట పడటానికి ఆయనకు ప్రకృతి ఆరాధన తోడ్పడింది. కాని అది ఆయనలో చెలరేగిన సంఘర్షణను పూర్తిగా నివారించ లేకపోయింది. సుభాను బాబు మనస్సుకు సంక్షోభం కలిగించిన ఆ సమయంలో, అనగా ఆయన వయస్సు పదిహేను సంవత్సరాలు కూడా నిండని రోజుల్లో, వివేకానంద స్వామి ఆయన జీవితంలో ప్రవేశించాడు.

సుభాస్ ఒకసారి యాదృచ్ఛికంగా వివేకానందుని రచనలను చూశాడు. వెంటనే ఆయన వివేకానందుని రచనలను తీవ్రమైన ఆకాంక్షతో అధ్యయనం చేశాడు. తత్ఫలితంగా ఆయన ఆలోచనా ధోరణిలో విప్లవాత్మకమైన మార్పు వచ్చింది.

అవి సుభాను తన జీవితానికి మార్గదర్శి కాగల ఒక మూల సూత్రం కోసం అన్వేషిస్తున్న రోజులు. కాగా వివేకానందుని రచనల అధ్యయనం సుభాను ఒక నిర్ణయానికి రావటానికి తోడ్పడింది. తత్ఫలితంగా ఎవరికి వారు తమ ముక్తికోసం కృషి చెయ్యటం, అట్లాగే తన జీవితాన్ని మానవ సేవకు అంకితం చెయ్యటం, మనిషి గమ్యాలు కావాలని సుభాస్ నిశ్చయించుకున్నాడు. సోదరి నివేదిత నమ్మినట్లు, బోసు కూడా మానవ సేవలో దేశసేవ ఇమిడి వుందని నమ్మాడు. తన మాతృభూమియే స్వామి

వివేకానందుడు పూజించిన దేవత అయినందున, సుభాసు యీ నిశ్చయానికి వచ్చి, ప్రతి భారతీయుడు తన సోదరుడనీ, ఇండియా విముక్తి ప్రజాశక్తి విజృంభించటం మీదనే ఆధారపడి ఉంటుందనీ, స్వామి వివేకానంద చెప్పిన ప్రవచనాన్ని ఆమోదించాడు. ఇంకా పురాతన పవిత్ర గ్రంథాలకు అధునిక వ్యాఖ్యానాలను యిస్తూ, ఆత్మ విశ్వాసం కండబలం మాత్రమే ముక్తికి దారితీస్తాయని వివేకానందుడు అన్న సూక్తిని కూడ సుభాసు ఆమోదించాడు.

తరువాత సుభాసు తన దృష్టిని వివేకానందుని నుండి ఆయం గురువైన రామకృష్ణ పరమహంసవైపు మళ్ళించాడు. జ్ఞానం లేదా ముక్తి అనేది త్యాగం లేదా సన్యాసం ద్వారా మాత్రమే సాధ్యమని రామకృష్ణ బోధనల సారాంశం. అప్పుడు సుభాసు బాబు రామకృష్ణ - వివేకానంద యువక బృందాన్నొక దానిని ఏర్పాటు చేశాడు. ఆ బృందం చర్యలను బోసు కుటుంబీకులు, బయటవారు కూడా వ్యతిరేకించారు. కాని వాళ్ళ వ్యతిరేకత బోసు బృందాన్ని వెనుకడుగు వేయించలేక పోయింది. తన కుటుంబపు కట్టుబాట్లను ఎదిరించి సుభాసు చంద్రుడు ముందడుగు వేశాడు. తనకు వ్యతిరేకించిన తన కుటుంబ సభ్యులతోను, బయటివారితోను తను బ్రహ్మాండంగా పోరాడుతున్నప్పుడే, ఆయన మనస్సును పట్టుకొని పీకుతున్న ఉదాత్తం కాని భావాలతో, ఆకాంక్షలతో సుభాస్ పోరాడవలసి వచ్చింది. ఈ అతి క్లిష్ట సమయంలో సుభాసు తన ఇంటి దగ్గర ఉన్నప్పటి కంటె బయట ఉన్నప్పుడే హాయిగా ఉందని భావించేవాడు. అప్పుడు సుభాసు యోగ విద్యను ఆచరించుటను గురించి చేతికి అందిన ప్రతి పుస్తకాన్ని అధ్యయనం చేశాడు. అవి మనిషికి, మానసిక, ఆధ్యాత్మిక శిక్షణకు మాత్రమే అవసరమని సుభాసు నమ్మిన రోజులు. కాగా సుభాసు రహస్యంగా కూడ ఆధ్యాత్మిక సాధనచేశాడు. ఎప్పుడు ఓ సాధువు కనిపించినా సుభాసు, ఆయన బృందం ఆ సాధువును వెంబడించేది. కొంతకాలం ఆ ప్రయోగాలు చేసి, అవి నిరుపయోగమని గ్రహించి, సుభాసు మళ్ళీ రామకృష్ణ వివేకానందుల సూక్తుల వైపు మొగ్గాడు. ఆ విధంగా సుభాసు తన వయసు పదహారు సంవత్సరాలు నిండకముందే గ్రామ పునర్నిర్మాణ కార్యక్రమంలో ప్రత్యక్షానుభవం గడించాడు. తత్ఫలితంగా మతపరమైన జీవితం కేవలం వ్యక్తిగతమైన యోగ అనుభవాలకు

పరిమితమైనది కాదనీ, అది మానవ సేవకు సంబంధించినదనీ, మానవ సేవలో మాతృభూమి సేవ ఇమిడి ఉందనీ ఒప్పుకున్నాడు.

వివేకానందుని సిద్ధాంతం* హేతుబద్ధమైన తత్వశాస్త్రం మీద ఆధారపడినది. ఇంకా శాస్త్రానికి, మతానికి మధ్య ఏర్పడిన సమన్వయం మీద ఆధారపడినది. కాగా సుభాసుబోస్ చిన్నతనంలోనే మూఢ విశ్వాసాలనుండి విముక్తిని పొందటానికి వివేకానందుడు ఎంతో తోడ్పడ్డాడు.

సుభాసుబోసు యీ విధంగా వివేకానందుని చేత ప్రభావితుడైన తరుణంలో ఆయనకు రాజకీయ రంగంనుండి మొదటి ప్రేరణ అందింది. అప్పటికి యింకా సుభాసు పాఠశాల విద్య పూర్తి కాలేదు. ఆ సమయంలో కలకత్తాకు చెందిన ఒక యువక బృందం దూత సుభాసును కటక్‌లో కలిసాడు. ఆ యువ బృందం నాయకుడు ఒక వైద్య విద్యార్థి. ఆ బృందానికి రెండు ప్రధాన ఆశయాలున్నాయి. మొదటిది ఆధ్యాత్మిక ఉన్నతి, రెండవది జాతీయ సేవ. ఆనాడు సుభాసు మనస్సులో రూపొందుతున్న సైద్ధాంతిక దృష్టికి యీ రెండు ఆశయాలూ అనుకూలమైనవే. కాగా వారి సంబంధం చాలాకాలం నిలబడింది.

సుభాసు సైద్ధాంతిక చింతన యీ విధంగా రూపాంతరం పొందుతూ ఉండగా, ఆయన మెట్రిక్యులేషన్ పరీక్షల తేదీ దగ్గర పడింది. కాగా ఎంతో అభివృద్ధికి రాదగిన ఆ బాలుడు, మేధావి, ఆ విధంగా, మొండిగా, మూర్ఖంగా, సైద్ధాంతిక చర్యలలో మునిగిపోయినందుకు, ఆయన తల్లిదండ్రులు, ఇతరులు కూడా యదార్థంగానే ఆందోళన పడ్డారు. అయినప్పటికి పరీక్షా ఫలితాలు వెలువడినప్పుడు సుభాసు ఆ సంవత్సరం ఆ విశ్వవిద్యాలయం మెట్రిక్ పరీక్షలో ఉత్తీర్ణులైన వారందరిలోనూ అత్యుత్తమ శ్రేణిని సంపాదించిన వారిలో ద్వితీయుడని తెలిసింది. పరిసరాలు మారినట్లయితే సుభాసుకు మరింత మంచి జరుగుతుందనే ఆనందంతో, పై చదువులకోసం ఆయన్ని వాస్తవిక వాతావరణం వుండే కలకత్తాకు ఆయన కుటుంబం పంపివేసింది.

# 3

కలకత్తాలో సుభాసును ఏ శక్తి ఏ విధంగా మార్చనున్నదీ ఆయన కుటుంబం ఏమాత్రం ఊహించలేక పోయింది. పల్లె ప్రాంతం నుండి ఓ యువ విద్యార్థిని కలకత్తా పంపటం అతనికి నిస్సందేహంగా మంచి చేస్తుందని చెప్పలేం. వాస్తవంగా అటువంటి మార్పు ఎంతోమందిపైకి రాదగిన వాళ్ళను నాశనం చేసింది. కాని సుభాసు ఆనాటికే నిర్దిష్టమైన కొన్ని సిద్ధాంతాలు, భావాలుగల యువకుడు. నలుగురు నడిచిన బాటవెంట వెళ్ళకుండా ఉండటానికి అప్పటికే నిర్ణయించుకున్నాడు. తన సొంత ఆధ్యాత్మిక ఉన్నతికి, తనతోటి మనుషుల ఉన్నతిని సాధించటానికి అవసరమైన జీవితాన్ని గడపాలని అప్పటికే నిర్ణయించుకున్నాడు. జీవితాన్ని గురించి గంభీరంగా ఎలా ఆలోచించాలో అప్పటికే నేర్చుకున్నాడు. కాగా కళాశాల ప్రాంగణంలో అడుగుపెట్టేనాటికే, జీవితానికి అర్థం, గమ్యం ఉన్నాయని నమ్మాడు.

కలకత్తా వెళ్ళి సుభాసుబోసు ప్రెసిడెన్సీ కళాశాలలో చేరాడు. ఆనాడు అది కలకత్తా విశ్వవిద్యాలయంలో ప్రధానమైన కళాశాల. ఆ కళాశాలలో పాఠాలు చెప్పటం ప్రారంభం కాకముందే, అంతకు సంవత్సరం పూర్వం తన దగ్గరకొక దూతను పంపించిన యువబృందాన్ని కలిశాడు. ఆ కళాశాలలో ఎన్నో రకాల విద్యార్థులు ఉన్నారు. వారిలో కొందరు నూతన సంపన్నులు, కొందరు అధికార రోగపీడితులు పరాన్న భుక్తులు. కొందరు ఎంతో మంచిగా కనిపించే పుస్తకాల పురుగులు, కొందరు రామకృష్ణ, వివేకానందుల ఆధ్యాత్మిక వారసులమని చెప్పుకొనేవారు. సుభాసు కూడ రామకృష్ణ, వివేకానందుల ఆధ్యాత్మిక వారసుడే. వీరందరు కాక రహస్యంగా పనిచేసే విప్లవకారులు కూడా కొందరు ఉన్నారు.

1913లో సుభాసు కటక్‌కు వీడ్కోలు చెప్పినప్పుడు, ఆయన భావాలు యింకా అస్పష్టంగానే ఉన్నాయి. అప్పుడు ఆయనలో ఆధ్యాత్మిక ఆవేశం, అస్పష్టమైన సంఘ సేవాతత్పరత కూడా మిళితమై ఉన్నాయి. ఆయన కలకత్తాలో యోగా సిద్ధాంతాన్ని ఆచరణలో పెట్టటంలో సంఘసేవ

ఒక భాగమని గ్రహించాడు. ఆధునిక పద్ధతులతో జాతీయ పునర్నిర్మాణం కార్యక్రమాన్ని చేపట్టటం కూడ యోగాలో ఒక భాగమేనని విశ్వసించాడు.

అదే సమయంలో సుభాసు ఆలోచనలతో ఏకీభవించిన ఆయన బృందం విజ్ఞానంకోసం, ఉత్తేజంకోసం, ఇండియాలో వున్న చారిత్రక ప్రాముఖ్యంగల స్థలాలను, పవిత్రమైన ప్రదేశాలను సందర్శించాలనీ ప్రముఖ వ్యక్తులను కలవాలనీ, యింకా తమ బృందంలో నూతన సభ్యులను చేర్చాలనీ భావించింది. ఆనాడు ఆ బృందాన్ని ఆకర్షించిన ప్రముఖుడు అరవింద్ ఘోష్. భారత జాతీయ నాయకులు స్వపరిపాలనతో తృప్తి పడతామని ప్రకటించిన రోజులలో, అరవిందుడు భారత జాతీయ కాంగ్రెస్ వేదిక నుండి మాట్లాడుతూ భారత దేశానికి కావలసింది సంపూర్ణ స్వాతంత్ర్యం అనే నినాదాన్ని యిచ్చి అతివాదులను బలపర్చిన సంఘటన సుభాసు బృందాన్ని ఆకర్షించింది. (అరవిందుకు సన్నిహితుడైన రాజకీయ సహచరుడు బాలగంగాధర్ తిలక్‌కు ఆనాడు ఎంతో ప్రతిష్ఠ ఉంది). ఆ రోజుల్లో అరవిందుని గురించి యువకులు గొప్పగా చెప్పుకునేవారు. ఆయన పాండిచ్చేరి వెళ్ళిపోయినప్పుడు, ఆయన అక్కడ ఏకాగ్రతతో పన్నెండేళ్ళు ధ్యానించి, వివేకవంతుడై, తిరిగివచ్చి, భారతదేశానికి ముక్తి కలిగిస్తాడని చెప్పుకున్నారు. అయినా అరవిందుని గురించి ప్రచారంలో వున్న, సామాన్యులకతీతమైన ఆయన ఆధ్యాత్మిక శక్తి సుభాసును ఆకర్షించలేదు. కాని అరవిందుని రచనలు, తాత్విక సిద్ధాంతం, యోగా సిద్ధాంతాన్ని ఆయన అర్థం చేసుకున్న తీరు, సుభాసును ఆకట్టుకున్నాయి.

రాజకీయాలు సుభాసు ఆసక్తిని సూటిగా ఆకర్షించనంతకాలం, ఆయన మత బోధకులను కలుస్తూనే ఉన్నాడు. సాంఘిక సేవా కార్యక్రమాలలో పాల్గొంటూనే ఉన్నాడు. కాని కళాశాలలో ఆయన పాఠాలను శ్రద్ధగా వినేవాడు కాదు. ఆయనకు ఆయా ఉపాధ్యాయుల బోధన ఆసక్తికరంగా ఉండేది కాదు. చర్చలను ఏర్పాటు చేయటం, వరద బాధితుల సహాయార్థం, కరువు బాధితుల సహాయార్థం నిధులను వసూలు చెయ్యటం, విహారయాత్రలకు వెళ్ళటంవంటి కార్యక్రమాల్లో సుభాసు ఎక్కువ ఆసక్తిని చూపించేవాడు. అటువంటి కార్యక్రమాలు తన అంతర్ముఖ భావాలను వెల్లడించటానికి సుభాసుకు తోడ్పడ్డాయి.

ఆ రోజుల్లో సంఘంలో పాతుకుపోయిన సాంఘిక అన్యాయం,

దానికి తోడైన ఆర్థిక వ్యత్యాసాలు ఆయన దృష్టిని బాగా ఆకర్షించాయి. ఆ అన్యాయాన్ని సహించలేక సుభాను మన సాంఘిక వ్యవస్థను వ్యతిరేకించాడు. ఈ వ్యవస్థకు సంబంధించిన సాంఘిక సంబంధాల మూల సూత్రాలను గురించి తెలునుకోవాలనుకున్నాడు. ఒకసారి సెలవుల సమయంలో సుభాను కటక్ గ్రామీణ ప్రాంతంలో ఒక హృదయ విదారకరమైన దృశ్యాన్ని చూశాడు. అప్పుడు అక్కడ కలరా అంటువ్యాధి విజృంభించింది. వెంటనే సుభాను, ఆయనతోవున్న అంకితభావంగల ఒక యువక బృందం నాటి సాంఘిక కట్టుబాట్లను ఎదిరించి, కలరా రోగులకు సేవలు చెయ్యటం ప్రారంభించారు. "ఒక వారం అనుభవం నాకొక నూతన ప్రపంచాన్ని చూపించింది. అది భారతదేశం నిజ స్వరూపాన్ని నా కళ్ళముందుంచింది. ఇండియా పల్లెటూళ్ళ దేశమని నాకు బోధ పడింది. ఆ పల్లెలలో పేదరికం దొంగ పిల్లివలె, చప్పుడు చెయ్యకుండా, జనాన్ని దోచుకు తింటూ ఉంటుందనీ, జనం ఈగలవలె చచ్చిపోతూ ఉంటారనీ, నిరక్షరాస్యత రివాజు అనీ నాకు బోధపడింది" అని సుభాను చంద్రబోసు తన స్వీయ చరిత్రలో రాశాడు.

తను మెట్రిక్ పరీక్ష రాయటానికి ముందు ఏ విధంగా సాధువులకోసం అన్వేషించాడో, అదే విధంగా తను కళాశాలలో చేరిన తొలి సంవత్సరాలలో కూడ సుభాను సాధువులకోసం అన్వేషించటం ప్రారంభించాడు. ఒక సద్గురువును గుర్తించాలనే కోరికే అంతులేని ఆయన అన్వేషణకు కారణం. కాగా, తనను వాళ్ళ నిరాడంబర జీవన విధానం వలన, ఉదాత్తమైన ఆలోచనా ధోరణి వలన ఆకర్షించిన సన్యాసులను కలవటానికి సుభాను అసాధారణమైన పనులను కూడా చేశాడు. చివరకు 1914 వేసవి సెలవుల కాలంలో ఒక స్నేహితుని వెంటబెట్టుకొని, ఇంటి దగ్గర ఎవరికీ చెప్పకుండా, ఇంటినుండి వెళ్ళిపోయాడు.

వాళ్ళద్దరూ ఉత్తర భారతదేశంలో ఎన్నో చారిత్రక ప్రాధాన్యతగల ప్రదేశాలను, యాత్రా స్థలాలను, సాంప్రదాయక విద్యాసంస్థలను దర్శించారు. ఎన్నో ఆశ్రమాలను దర్శించారు. ఎందరో సాధువులను కలిశారు. కాని వాళ్ళు ఆయా ప్రదేశాలలో మౌలిక హిందూ మత ధర్మాలకంటే, మూఢ నమ్మకాలు, అర్థరహితమైన ఆచారాలు కొనసాగుతూండటం చూసినప్పుడు, వాళ్ళ భ్రమలు తొలగిపోయాయి.

మత ప్రచారకులు పవిత్ర ప్రదేశాలలో యింకా ఆచరణలో బలపర్చుతున్న కులతత్వం, శాఖా దురభిమానం, సుభాసుకు దిగ్భ్రాంతిని కలిగించాయి. ఆ ఉత్తర దేశ యాత్రా సందర్భంగా సుభాసు వారణాసికి వెళ్ళినప్పుడు, అక్కడ ఆయన రామకృష్ణ ఆశ్రమానికి చెందిన స్వామి బ్రహ్మానందను కలిశాడు.

అటువంటి విజ్ఞానులతో చర్చించిన ఫలితంగానూ, "వేం పవిత్రులం" అని చెప్పుకొనే వాళ్ళతో ప్రత్యక్షంగా చర్చలలో పాల్గొన్నందువలన లభించిన మౌలిక విజ్ఞానం ఫలితంగానూ, సుభాసుకు మతపరమైన నమ్మకాలలో సమతుల్యం ఏర్పడింది.

ఇది ఇలా ఉండగా, సుభాసు ఇంటి దగ్గర చెప్పకుండా పారిపోయినందున సుభాసు తల్లిదండ్రులూ, ఆన కుంటుంబంలో గల ఇతరులూ కొన్ని వారాలపాటు చాలా ఆదుర్దాపడ్డారు. చివరకు సుభాసు ఎంత ప్రశాంతంగా ఇంటినుండి వెళ్ళిపోయాడో అంతే ప్రశాంతంగా ఒకనాటి ఉదయం ఇంటికి తిరిగివచ్చాడు. కొన్ని రోజుల తరువాత టైఫాయిడ్ జ్వరంతో సుభాసు మంచం పట్టాడు. ఆయన మంచంలో ఉండగానే మొదటి ప్రపంచ యుద్ధం ప్రారంభమైంది.

అప్పటివరకు విప్లవకారులు కలకత్తా విద్యార్థులలో ఎంత ప్రచారం చేసినా రాజకీయాలు సుభాసు జీవితంలో ప్రవేశించలేదు. అయినా ఇంకా ఆధ్యాత్మిక పునర్వికాసం, రాజకీయేతర పద్ధతులతో జాతీయ పునర్నిర్మాణంవంటి భావాలను నమ్ముతూనే ఉన్నాడు. కలకత్తాలో ప్రత్యక్షంగా కనిపించే బ్రిటిష్ వాళ్ళ ఉనికి ఎక్కడో దూరానవున్న కటక్‌వంటి పట్టణంలో కనిపించక పోవటమే ఇందుకు ప్రధానకారణం. కలకత్తాను నియంత్రించిన బ్రిటిష్ పాలకులు అక్కడ వాళ్ళ ఉనికిని ఇతరులు గుర్తించేటట్లు ప్రవర్తించటమే కాక, అడుగడుగునా, ప్రతిస్థాయిలోనూ భారతీయులను అవమానపరచేవారు. తెల్లవారు వారి వీధులలోను, రైళ్ళలోను, ప్రజలు అద్దెకు వాడుకొనే వాహనాలలోను వాళ్ళ జాతి దురహంకారాన్ని ప్రదర్శించే వారు. అటువంటి సందర్భాలలో వాళ్ళు భారతీయులలో ప్రఖ్యాతిగల పౌరులనూ, నిష్ణాతులనూ కూడ వదిలి పెట్టేవారు కాదు. భిన్న జాతుల మధ్య ఘర్షణలు చెలరేగినప్పుడు చట్టం భారతీయులకు ఏమీ ఉపయోగపడేది కాదు. దాంతో ఇంగ్లీషు వాళ్ళకు భుజబలం తప్ప

మరొకటి అర్థం కాదనే భావం ప్రబలింది. అటువంటి అనుభవం సుభాను రాజకీయ చైతన్యాన్ని పెంచటానికి ఎంతో ఉపయోగపడింది. కాని సుభాను రాజకీయ ఆలోచనా ధోరణి ఒక స్పష్టమైన రూపం దాల్చటానికి ఆ అనుభవం చాలలేదు. అందు నిమిత్తం ప్రపంచపు అనుభవం కావలసి వచ్చింది. కాగా ఆయన ప్రపంచ సంఘటనలను పత్రికల ద్వారా అధ్యయనం చేసి, తను నమ్మిన విలువలను తిరిగి పరిశీలించాడు, పరీక్షించాడు. తత్ఫలితంగా ఒక జాతి జీవితాన్ని రెండు భిన్నమైన భాగాలుగా విభజించటం సాధ్యం కాదని నిర్ణయించుకున్నాడు. వాటిల్లో ఒక భాగాన్ని మనకోసం మన చేతులలోను, రెండవ భాగాన్ని పరాయివాళ్ళ చేతుల్లోను ఉంచటం సాధ్యం కాదని ఉద్ఘాటించాడు. ఇండియా నాగరికమైన ఆధునిక దేశంగా మనవలెనంటే, ఇండియా ప్రజలందరూ ఏకమై ఇండియా విముక్తి కోసం పాటుపడాలనీ, పోరాడాలనీ, భావించాడు. రాజకీయ స్వాతంత్ర్యం అవిభాజ్యం అని ఉద్ఘాటించాడు. ఇంకా స్వాతంత్ర్యం పొందిన దేశం తన స్వాతంత్ర్యాన్ని కాపాడుకోవటానికి చాలినంత సైనిక బలం కలిగి ఉండటం అవసరమని కూడా బోసు ఉద్ఘాటించాడు.

తరువాత సుభాను రెండు సంవత్సరాలు కళాశాల విద్యనభ్యసిస్తూ తాత్విక, రాజకీయ చింతనలో చాలా త్వరత్వరగా అభివృద్ధి చెందాడు. తత్ఫలితంగా ఆయన అంతరంగంలో ఎంతో మారాడు. ఆయన బృందం సంఖ్యలోనే కాకుండా, గుణాత్మకంగా కూడా చాలా అభివృద్ధి చెందింది. ఆ బృందంతో చర్చలు జరుపుతూ, సుభాను తన కళాశాల చదువును నిర్లక్ష్యం చేశాడు. తత్ఫలితంగా 1915లో జరిగిన ఇంటర్ పరీక్షలో ఉన్నత శ్రేణిలో ఉత్తీర్ణుడు కాలేకపోయాడు. తరువాత బి.ఏ. ఆనర్సు కోర్సులో తత్వశాస్త్రాన్ని ఐచ్ఛిక విషయంగా ఎన్నుకొన్నాడు. తత్వశాస్త్రం ఆయన అధ్యయనం చెయ్యాలనే ఎంతో కాలంనుండి కోరుకున్న విషయం. అందువల్ల ఆయన తత్వశాస్త్రాన్ని అతి శ్రద్ధగా అధ్యయనం చేశాడు. తత్వశాస్త్రం అధ్యయనం ఆయనకు మేధా సంబంధమైన క్రమశిక్షణను, విమర్శనాత్మకమైన ఆలోచనా ధోరణిని ఇచ్చింది. ఆ విమర్శనాత్మక ధోరణి వలననే నిజంగా స్వతంత్రంగా ఆలోచించగలిగి మేధావి అయిన మనిషి ఏ భావాన్నైనా, సొంతం చర్చించకుండా, దానికి మద్దతుగా

చూపించిన సాక్ష్యాన్ని పూర్తిగా పరిశీలించకుండా, ఆమోదించలేడు అని సుభాసు ఉద్ఘాటించాడు.

# 4

1916వ సంవత్సరం ఆరంభంలో ప్రెసిడెన్సీ కళాశాలలో సంభవించిన రెండు సంఘటనలు సుభాను జీవిత మార్గాన్ని, జీవిత గమనాన్ని పూర్తిగా మార్చివేశాయి. ఆ సంవత్సరం జనవరిలో ఒక ఉదయం ఇ.ఎఫ్.ఓటెన్ అనే పేరుగల ఆంగ్ల భాషాచార్యుడు తన తరగతి గది ముందు గందరగోళం సృష్టించిన కొందరు విద్యార్థులను కొట్టాడు. ఆ ఆచార్యుడు క్షమాపణ చెప్పాలని విద్యార్థులు పట్టుబట్టారు. కాని ఇ.ఎఫ్. ఓటెన్ అందుకు నిరాకరించాడు. తత్ఫలితంగా ఆ కళాశాల విద్యార్థులందరు సమ్మె చేశారు. ఆ రోజుల్లో ప్రెసిడెన్సీ కళాశాలలో సమ్మె జరగటం ఊహాతీతం. కాగా ఆ సమ్మె నిర్వాహకులలో ఒకడైన సుభాసును హెచ్చరించటం జరిగింది. అయినప్పటికీ సుభాసు లొంగలేదు. తరువాత అదృష్టవశాత్తూ ఆ ఆచార్యునికి జ్ఞానోదయం కలిగి, ఆ సమస్యను స్నేహపూర్వకంగా పరిష్కరించాడు. కాని దురదృష్టవశాత్తూ విద్యార్థులపైన విధించిన జరిమానాను ఉపసంహరించటానికి ప్రిన్సిపల్ నిరాకరించాడు.

మరుసటి నెల మరొక సంఘటన ఆకాశం నుండి పడిన పిడుగువలె హఠాత్తుగా సంభవించింది. ఆ ఆచార్యుడే ఒక మొదటి సంవత్సరం బి.ఏ. ఆనర్స్ విద్యార్థిని కొట్టాడు. అసమ్మతి ప్రదర్శనలు, సమ్మెలువంటి చట్టబద్ధమైన చర్యలు నిరుపయోగమని గ్రహించిన విద్యార్థులు చెలరేగిపోయారు. విద్యార్థులు చట్టాన్ని తమ చేతుల్లోకి తీసుకున్నారు. ప్రొఫెసర్ ఓటెన్‌ను తుక్కుతుక్కుగా కొట్టారు. ఆ సంఘటన కళ్ళారా చూసిన సుభాసు ఆ విద్యార్థులు ఆ ప్రొఫెసర్‌ను చాలా ధైర్యంగా, గట్టిగా ఎదుర్కొన్నారనీ, ఆ దెబ్బలాటలో ఆ ప్రొఫెసర్ ఏ స్థాయికి దిగజారాడో, అదే స్థాయికి విద్యార్థులు కూడా దిగజారారని రాశాడు. యాజమాన్యం వెంటనే కళాశాలను మూసివేసి, ఒక విచారణ సంఘాన్ని నియమించింది. ఆ గందరగోళంలో ప్రిన్సిపాల్ ప్రభుత్వంతో విభేదించాడు. కాగా ప్రభుత్వం ఆయనను ఉద్యోగం నుండి తాత్కాలికంగా తొలగించింది.

కాని ప్రిన్సిపల్ తన పదవీ బాధ్యతలను మరొక వ్యక్తికి యివ్వకముందే తన వద్దగల రహస్య జాబితాలో వున్న విద్యార్థులనందరినీ పిలిపించాడు. వారిలో సుభాస్ కూడా ఉన్నాడనుకోండి.

ప్రిన్సిపల్ సుభాస్ వంక చూసి కొరకొర లాడుతూ "బోస్! ఈ కళాశాల విద్యార్థులందరిలోకి నువ్వే అతి చెడ్డవాడివి. కాబట్టి నీ పేరును విద్యార్థుల పట్టిక నుండి తాత్కాలికంగా తీసివేస్తున్నాను," అన్నాడు. "ఇందుకు మీకు నేను కృతజ్ఞుడను" అని బోసు ఇంటికి వెళ్ళిపోయాడు. కళాశాల పాలకమండలి ప్రిన్సిపల్ చర్యను ధృవపరచి బోసును కళాశాలనుండి బహిష్కరించింది. వెంటనే మరొక కళాశాలలో చదవటానికి అనుమతి యివ్వమని బోసు విశ్వవిద్యాలయానికి విన్నవించాడు. విశ్వవిద్యాలయం ఆయన కోర్కెను తిరస్కరించింది. ఈ విధంగా బోసును ఆ విశ్వవిద్యాలయంనుండే బహిష్కరించింది.

ఆ విశ్వవిద్యాలయం నియమించిన విచారణ సంఘంలో ముగ్గురు బ్రిటిష్ వాళ్ళు, ఇద్దరు భారతీయులు ఉన్నారు. ఆ ఇద్దరు భారతీయులలో ఒకరు అశుతోష్ ముఖర్జీ, మరొకరు హేరంబి చంద్రమైత్రా.

ఆ సంఘానికి సుభాస్ విద్యార్థుల వాదనను వినిపిస్తూ, ఒక స్పష్టమైన, తర్కబద్ధమైన ప్రకటన చేశాడు. విద్యార్థుల చర్యను తను సమర్థించలేక పోయినా, విద్యార్థులు బాగా రెచ్చగొట్ట బడినందువలననే ఆ ఆచార్యుని తుక్కు, తుక్కుగా తన్నారని తనకు తెలుసునని ఉద్ఘాటించాడు. అదే సందర్భంలో బ్రిటిష్‌వాళ్ళు ఆ కళాశాలలో చేసిన దుశ్చర్యలను వివరించాడు. కాని ఆ కమిటీ నివేదికలో విద్యార్థులకు అనుకూలంగా ఒక్కమాట కూడా లేదు. సుభాను పేరు మాత్రం అందులో చోటుచేసుకుంది. మరొక ఏ విద్యార్థి పేరూ అందులో లేదు. కాబట్టి ఆయన కర్మ మూడిందనేది స్పష్టం.

ఈ సమయంలో కలకత్తా రాజకీయ వాతావరణం రోజు రోజుకూ దిగజారుతూ వుంది. మూకుమ్మడి అరెస్టులు జరుగుతున్నాయి. ఆ విధంగా నిర్బంధింపబడిన వాళ్ళల్లో ప్రెసిడెన్సీ కళాశాలనుండి వెల్లగొట్టబడిన వాళ్ళూ ఉన్నారు. కాగా సుభాసు కుటుంబం పెద్దలు తులనాత్మకంగా ప్రశాంత వాతావరణంగల కటక్ పట్టణానికి సుభాసును రప్పించటం మంచిదని భావించారు.

కాని ఆ సంఘటనలలో తను వహించిన పాత్రకు సుభాస్ ఏమాత్రం విచారపడలేదు. పైగా తనకు వాటిల్లే ముప్పును లెక్కచేయ్యకుండా, తన జాతి గౌరవాన్ని నిలబెట్టటంకోసం తను నిలబడినందుకు సుభాస్ నిజంగా సంతృప్తి చెందడమే కాకుండా, ఆనందించాడు. ఆ శోచనీయమైన సంఘటన ఫలితం ఎట్లా ఉంటుందో సుభాస్ వెంటనే గ్రహించలేకపోయాడు.

సుభాస్ కళాశాల నుండి బహిష్కరింపబడటం ఆయన భవిష్యత్తు రూపురేఖలను దిద్దింది. ఆయన ఒక క్లిష్ట పరిస్థితిలో ధైర్యంగా నిలబడి, తన విధిని నెరవేర్చాడు. ఆ పని ఆయనకు ఆత్మ విశ్వాసాన్ని, చొరవను కలుగజేశాయి. పైగా తన యోగ్యత, త్యాగాలు ఆధారంగా తనకు లభించిన నాయకత్వం ఎట్లా ఉంటుందో తన జీవితంలో మొదటిసారి చవిచూశాడు.

ప్రొఫెసర్ ఓటెన్ సంఘటన సుభాను జీవితాన్ని ఒక తుఫానువలె తలక్రిందులుగా మార్చివేసింది. తనతల్లి తండ్రులు, ఇతరులు కూడ కష్టాలలో చిక్కుకుపోయిన తనకు సానుభూతి చూపించారనే విషయం ఆయనకు ఎంతో ఊరట కలిగించింది. కాగా తను సరియైన మార్గంలోనే పయనిస్తున్నట్లు భావించాడు. కాని తన బృందంలో కొందరు సభ్యులు మాత్రం తను చాలా అతిగా ప్రవర్తించినట్లు భావించారు. అయినా సుభాను గట్టిగా నిలబడ్డాడు. ఎటువంటి ఫలితాన్నైనా ఎదుర్కోవటానికి సిద్ధమయ్యాడు. చాలా వరకు సిగ్గు, బిడియాలకు వీడ్కోలు చెప్పాడు.

అప్పుడు తన కళాశాల చదువును అద్యతన భావంతో కొనసాగించే ఆశ పూర్తిగా పోయినందున, సుభాస్ ఆవేశపూరితమైన ఉత్సాహంతో సాంఘిక సేవా రంగంలోకి దూకాడు. స్వచ్ఛంద సాంఘిక సేవ ద్వారా తన భవిష్యత్తు రూపురేఖలను దిద్దటానికి తగిన శిక్షణ తనకు లభిస్తుందని సుభాస్ విశ్వసించాడు. కాగా సాంఘిక సేవలో ఎటువంటి అపాయాలు పొంచివున్నా, తను దేనినుండి తప్పించుకోవటానికి ప్రయత్నించకూడదని నిర్ణయించుకున్నాడు. యువకులలో శారీరక దారుఢ్యాన్ని, నైతిక బలాన్ని, మేధాశక్తిని పెంపొందించటానికి ఏర్పడిన యువజన సంఘాల కార్యక్రమాల్లో కూడా సుభాను పాల్గొన్నాడు. అంటరానితనానికి వ్యతిరేకంగా అనేక ఉద్యమాలను నిర్వహించాడు. అనాడు అంటరానివాడుగా భావించబడిన ఒక సంతాల్ జాతి విద్యార్థి జబ్బుతో మంచం పట్టగా, అతనికి సపర్య చేయటానికి తనతోపాటు, తన తల్లి

ప్రభావతి కూడా ముందుకు రావటం సుభాస్‌కు ఎంతో ఆనందం కలిగించింది. తరువాత సుభాను మళ్ళీ స్నేహితులను వెంటబెట్టుకొని చారిత్రక ప్రాముఖ్యం, మత ప్రాముఖ్యంగల దూరదూరప్రాంతాలను చూడటానికి వెళ్ళాడు. మతాలకు సంబంధించిన ఉత్సవాలు, పూజలు జరిగే ప్రదేశాల్లో సుభాస్ పెక్కు సాంఘిక సేవా కార్యక్రమాలను ఏర్పాటు చేశాడు. అప్పుడు కూడా, అంతకు పూర్వం కంటె లోతుగా, సుభాస్ తన అంతరంగాన్ని విశ్లేషించుకుంటూ ఉండేవాడు. తన మనస్సును తనే అర్థం చేసుకోవటం, తన మనస్సులో ఏవైనా నీచమైన ప్రేరణలకు స్థానం లభించిందేమో తెలుసుకోవటం ఆ విశ్లేషణకు కారణాలు. మనశ్శాంతికి భగ్నం కలిగించే కలలను కూడ ఆయన నీచమైన ప్రేరణలుగానే పరిగణించేవాడు.

ఒక సంవత్సరం గడిచిన తరువాత సుభాను తన అదృష్టం ఎట్లా ఉందో తెలుసుకోవటానికి, విశ్వవిద్యాలయం అధికారులను కలవాల నుకున్నాడు. అందు నిమిత్తం బోస్ మళ్ళీ కలకత్తా వెళ్ళి తన ప్రయత్నాలు ప్రారంభించాడు. ఏదో ఒక ఫలితం కోసం ఎదురుచూస్తూనే, 49వ బెంగాల్ రెజిమెంట్‌లో చేరటానికి ప్రయత్నించాడు. కాని ఆయన కంటిచూపు లోపభూయిష్టంగా ఉన్నందున, ఆయన కోరిక నెరవేరలేదు. ఆఖరికి తను మరొక కళాశాలలో సీటును సంపాదించుకునే షరతు మీద కలకత్తా విశ్వవిద్యాలయం తనను మళ్ళీ విశ్వవిద్యాలయంలో చేరనివ్వటానికి అనుకూలంగా ఉందని సుభాస్‌కు తెలిసింది. వెంటనే సుభాస్ తిన్నగా వెళ్ళి స్కాటిష్ చర్చి కళాశాల ప్రిన్సిపల్‌ను కలిశాడు. ఆయనపేరు డాక్టర్ ఉర్క్ హార్డ్. ప్రెసిడెన్సీ కళాశాల ప్రిన్సిపల్ లాంఛనప్రాయంగా తన సమ్మతిని తెలియజేస్తే, సుభాసును చేర్చుకుంటానని ఆ స్కాటిష్ చర్చి కళాశాల ప్రిన్సిపాల్ చెప్పాడు. ఆ పని జరిగింది. కాగా 1917 జూలైలో సుభాసు స్కాటిష్ చర్చి కళాశాలలో చేరాడు. డాక్టర్ ఉర్క్ హార్డ్ నేర్పుగలవాడూ, ఇతరుల కష్టసుఖాలను గురించి ఆలోచించే సహృదయుడు మాత్రమేగాక, సమర్థుడైన తత్వశాస్త్రోపాధ్యాయుడు కూడా అని సుభాస్ త్వరలోనే గ్రహించాడు.

1916వ సంవత్సరంలో సుభాసు చంద్రుడు బెంగాల్ అంబులెన్స్ దళం నుండి విడుదలైన ఆఫీసర్‌ను కలిశాడు. ఆ అంబులెన్స్ దళం ప్రథమ

ప్రపంచ యుద్ధం రోజుల్లో మెసొపొటేమియాకు వెళ్ళింది. అక్కడ ఆ ఆఫీసరు ఖైదీగా పట్టుబడ్డాడు. ఆయన తన అనుభవాలు ఆధారంగా సుభానుకు ఎన్నో సాహస గాథలను చెప్పాడు. ఆ గాథలు సుభానును బాగా ఉత్తేజపరచాయి. కాగా సుభాను సైన్యంలో చేరాలనుకున్నాడు. అప్పుడు ఇండియా ప్రభుత్వం ఇండియా సైన్యం లేదా ప్రాంతీయ రక్షణ దళం యూనివర్సిటీ శాఖను ఏర్పాటు చేయటానికి అంగీకరించింది. ఈ శాఖలో చేరదలచిన వారు కొన్ని శారీరిక పరీక్షలలో నెగ్గవలసి వున్నా, అవి సైన్యంలో చేరదలచిన వారు ఎదుర్కొనవలసిన పరీక్షలంత కఠినమైనవి కావు. కాగా సుభానుకు ఆ శాఖలో ప్రవేశం లభించింది. ఆ దళం శిక్షణాధికారి కెప్టెన్ గ్రే. ఆయన ఒక ముతక మనిషి, స్కాట్ జాతీయుడు. అప్పుడు ఫోర్ట్ విలియంలో తమ విధులను నిర్వహించుతున్న సైనికాధికారులు మొదట బెంగాలీ కుర్రవాళ్ళు సైనికులుగా ఎందుకూ పనికిరాని వారు అనుకున్నారు. కాని నాలుగు నెలల సైనిక శిక్షణా శిబిరంలో, మూడు వారాలపాటు చిన్న తుపాకులను కాల్చటంలో శిక్షణ పొందిన తరువాత, ఆ బెంగాలీ కుర్రవాళ్ళు గురువులను మించిన శిష్యులయ్యారు. ఆ శిక్షణ సుభాను చంద్రునికి నూతన బలాన్ని, ఆత్మ విశ్వాసాన్ని కలుగజేసింది. కాగా సుభాను ఒక సేనా విభాగం (కంపెనీ) అధిపతిగా తన సహచరులతో పాటు కవాతు చేస్తూ ఫోర్ట్ విలియం (కోట)లో ప్రవేశించాడు. అప్పుడు, తన సైనిక విభాగం సభ్యులు తమ జన్మ హక్కుగా తమకు చెందవలసిన దానినే, పరాయి పాలకులు, అన్యాయంగా తమను మోసగించి కాజేసిన దానినే, ముట్టడించినట్లు భావించాడు.

సుభాను చంద్రుని కళాశాల జీవితంలో మూడవ సంవత్సరం సైనిక జీవితంగా గడిచింది. నాల్గవ సంవత్సరం ఆయన పట్టుదలతో చదివి, తత్వశాస్త్రంలో ప్రథమ శ్రేణి బి.ఏ. డిగ్రీని (ఆనర్స్‌లో) యూనివర్సిటీలో ద్వితీయ స్థానాన్ని సంపాదించాడు. కాని అప్పటికే తత్వశాస్త్రం విషయంలో ఆయనకు గల భ్రమలు తొలగటం ప్రారంభం కాగా, ఆయన మనస్సు ప్రయోగాత్మక మానసిక శాస్త్రంవైపు మళ్ళింది. కాగా తన ఎం.ఏ. కోర్సులో ఆ విషయాన్ని తన ఐచ్ఛిక విషయంగా ఎంచుకోవాలని నిర్ణయించుకున్నాడు.

తరువాత ఒకనాటి సాయంత్రం జానకీనాథ్ తన కుమారుని తన గదికి పిలిపించుకున్నాడు. శరత్ చంద్ర బోస్ కూడా అక్కడే ఉన్నాడు. "ఐ.సి.యస్. పరీక్ష రాయటం కోసం ఇంగ్లండు వెళ్ళి చదువుకుంటావా?" అని సుభాసు బాబును జానకీనాథ్ అడిగాడు. తన నిర్ణయం ఇరవై నాలుగు గంటల్లో చెప్పాలన్నాడు. సుభాసు బాబు తనలో తనే ఆలోచించుకున్నాడు. కొన్ని గంటలలోనే ఆ ప్రతిపాదనను అంగీకరించాడు.

ఆ విధంగా సుభాసు పథకాలు పరిస్థితుల ప్రభావం వలన మరొకసారి తలక్రిందులయ్యాయి. తను ఐ.సి.యస్. పరీక్షలో ఉత్తీర్ణుడవుతాననీ, బ్రిటిష్ వాళ్ళ క్రింద పనిచెయ్యటానికి అంగీకరిస్తాననీ సుభాసు కలలో కూడా అనుకొనలేదు. కాని అదంతా భవిష్యత్తుకు సంబంధించిన విషయం! వెంటనే ఓ వారంలో ఇంగ్లండుకు బయల్దేరుతున్న ఓడలో ఒక పడక లభించింది. పాస్ పోర్ట్ కూడా త్వరగానే వచ్చింది. ఆ విధంగా సుభాసు బాబు పూర్తిగా తన సొంత ఆలోచన మీదనే ఆధారపడి ఒక చారిత్రాత్మక నిర్ణయాన్ని తీసుకున్నాడు. అంతకు పూర్వం తను ఇండియా సైన్యం- విశ్వవిద్యాలయపు శాఖలో చేరినప్పుడు తన మిత్ర బృందాన్ని ఎలా సంప్రదించలేదో, యీసారి కూడా అలాగే తన మిత్ర బృందాన్ని సంప్రదించలేదు. అప్పట్లో దేశాంతరం వెళ్ళటానికి నిర్ణయించటం సాహసోపేతమే. అందుకు బాధ్యత పూర్తిగా తనదే. అది తన గత జీవిత ధోరణికి పూర్తిగా భిన్నం. అది బోసు బాబు జీవితంలో ఒక పెద్ద ముందడుగు.

ఆ నిర్ణయం ప్రకారం సుభాసు చంద్రుడు 1919వ సంవత్సరం సెప్టెంబరు 15వ తేదీన ఇంగ్లండు వెళ్ళేందుకు ఓడను ఎక్కాడు.

# 5

తను ఐ.సి.యస్. పరీక్షకు తయారు కావటానికి నిండా ఎనిమిది నెలల గడువు కూడా తనకు లభించదని ఇంగ్లండు వెళ్ళటానికి ఓడ ఎక్కినప్పుడే సుభాసు చంద్రునికి తెలుసు. ఇంకా తన వయస్సు ప్రకారం ఐ.సి.యస్. పరీక్ష రాయటానికి అదొక్కటే ఆయనకు లభించే మొదటి అవకాశం, చివరి అవకాశం కూడా. ఈ పరిమితులకు తోడు ఒక మంచి కేంబ్రిడ్జి కళాశాలలో సుభాసుకు ప్రవేశం లభించుతుందా అనేది కూడ సందేహాస్పదమే. ఎందుకనగా ఆయన ఇంగ్లాండు చేరే నాటికే కేంబ్రిడ్జిలో విద్యా సంవత్సరం ప్రారంభమై ఉంటుంది.

సుభాసు ఇంగ్లండు చేరగానే 'ఇండియా హౌస్'లో వున్న భారత విద్యార్థుల సలహాదారుని సంప్రదించి నిరాశచెందాడు. అయినా తన అదృష్టాన్ని పరీక్షించుకోవటానికా అన్నట్లు సరాసరి కేంబ్రిడ్జికి వెళ్ళాడు. కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయానికి చెందిన ఫిడ్జి విలియం హాల్‌లో అందులో ప్రవేశం కోరే అభ్యర్థుల పూర్వాపరాలను ప్రప్రథమంగా పరిశీలించే అధికారి సుభాసు సమస్యను ఎంతో సానుభూతితో పరిశీలించాడు. సుభాసుకు అందులో ప్రవేశం యివ్వటానికి అంగీకరించాడు. అంతే కాదు, ఆయనను 1921 జూన్ నెలలో డిగ్రీ పరీక్షకు హాజరు కావటానికి అనుమతి యివ్వటానికి కూడా అంగీకరించాడు. కాని ఐ.సి.యస్. పరీక్ష తేదీ చాలా దగ్గరలో పడినందున సుభాసు బాబు ఆచరణలో ఆ సమయాన్నంతా ఐ.సి.యస్. పరీక్షకు తయారు కావటానికే వినియోగించాడు. కాగా కేంబ్రిడ్జిలోని 'మెంటల్ అండ్ మోరల్ సైన్సెస్ ట్రైపాస్ (కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయం బి.ఏ. డిగ్రీ యిచ్చుటకు ముందు నిర్వహించే ప్రావీణ్య పరీక్ష) పరీక్ష రాయటానికి సుభాసు చంద్రుడు ఆచార్యుల ఉపన్యాసాలు వినటానికి మించి అదనంగా ఎక్కువ కృషి చెయ్యలేకపోయాడు. బోధనా ప్రణాళికలో లేని కార్యక్రమాల విషయానికి వస్తే ఇండియన్ మజ్లిస్, యూనియన్ సొసైటీల కార్యక్రమాలలో మాత్రం పాల్గొన్నాడు.

ఇంగ్లండ్‌లో విద్యార్థులకు వున్న స్వాతంత్ర్యం, గౌరవం, ప్రతిష్ట సుభాసు చంద్రునిబాగా ప్రభావితం చేశాయి. ఇవి ఇంగ్లండు విద్యార్థుల ప్రవర్తనను ఆరోగ్యజనకంగా ప్రభావితం చేశాయని సుభాసు చంద్రుడు భావించాడు. ఇంగ్లండులో విద్యార్థులకుగల హోదాకు ఇండియాలో విద్యార్థులకు గల హోదాకు మధ్య స్పష్టమైన వ్యత్యాసం ఉందని సుభాసు గమనించాడు. ఇండియాలో విద్యార్థులు అనుమానితులు, దయనీయ స్థితిలో వుండి కరుణకు నోచుకోవలసిన వాళ్ళు. నిర్లక్ష్యానికి గురి అయిన వాళ్ళు లేదా విప్లవకారులుగా పోలీసులచేత వేటాడబడే వాళ్ళు. కేంబ్రిడ్జి యూనియన్ సొసైటీ చర్చలకు పార్లమెంటు సభ్యులు, మంత్రులు కూడా హాజరైనా, నిర్భయంగా, నిష్పక్షపాతంగా, తమ అభిప్రాయాలను వెల్లడించటానికి అక్కడ విద్యార్థులకు సంపూర్ణ స్వాతంత్ర్యం వుంది. ఇంగ్లీషు పౌరుని కొన్ని సాధారణ లక్షణాలను సుభాసు బాగా మెచ్చుకున్నాడు. వాటిని గురించి ఇండియాలో వున్న తన మిత్రులకు రాశాడు. ఇంగ్లీషువారు ఎప్పుడూ వేళ తప్పకుండా, గడియారం పనిచేసినంత కచ్చితంగా పనిచేసేవారు. వారు గట్టి ఆశావాదులు. వారి ఆలోచన అంతా మానవ జీవితం ప్రసాదించే ప్రకాశవంతమైన విషయాల చుట్టూ తిరుగుతూ ఉండేది. వారు ఇండియాలో మనం ఆలోచించినట్లు ఎప్పుడూ దుఃఖమయమైన విషయాలను గురించి ఆలోచించేవారు కాదు. వారి లోకజ్ఞానం అపారం కాగా వారు ఏ పరిస్థితిలోనైనా వాస్తవిక దృష్టిలో పరిశీలించగలిగే వారు. అన్నింటికంటె ముఖ్యంగా, వారి జాతీయ ప్రయోజనాలకు ముప్పు వాటిల్లినప్పుడు, ఏది ఏమైనా, ఎట్టి పరిస్థితులలో అయినా, వాటిని కాపాడేందుకు, మిగతా వాటినన్నింటికీ పక్కన ఉంచేవారు.

సుభాసు చంద్రుడు కేంబ్రిడ్జిలో ఉన్నప్పుడు, బ్రిటిష్ విద్యార్థులు, ఇండియా విద్యార్థుల మధ్య సత్సంబంధాలు ఉన్నాయి. కాని ఆ సంబంధాలు నిజమైన, శాశ్వతమైన స్నేహంగా పరిపక్వం చెందలేదు. సగటు బ్రిటిష్ పౌరుడు భారతీయులందరి కంటె తాను ఎంతో అధికుడను అని అనుకొనేవాడు. అదే సమయంలో మొదటి ప్రపంచ యుద్ధం తరువాత ఇండియాలో సంభవించిన సంఘటనలు, ముఖ్యంగా జలియన్ వాలాబాగ్ సామూహిక హత్యాకాండ ఇండియా గుండెల్లో మండుతూ వుంది. అంతేకాకుండా ఇంగ్లీషు మధ్య తరగతి ప్రజలు కొందరు జలియన్

వాలాబాగ్ సామూహిక హత్యకు కారకుడైన జనరల్ డయ్యర్‌కు అనుకూలంగా స్పందించటం భారత విద్యార్థులకు బాధ కల్గించింది. కాగా ఆ పరిస్థితులలో అరుదైన కొద్దిమంది వ్యక్తుల మధ్య తప్ప, బ్రిటిష్ పౌరులకు భారతీయులకు మధ్య స్నేహ భావం ఉండటానికి ఆదారం ఏవీ లేదని సహజంగానే సుభాసు చంద్రుడు, ఆయన మిత్రులు ఊహించారు. బ్రిటిష్ రాజకీయ పక్షాలలో లేబర్ పార్టీ మాత్రమే ఇండియా ఆకాంక్షలకు సానుభూతిని తెలియజేసింది. అదే సమయంలో రాజకీయ సన్నిహితత్వం లేకపోయినా, సుభాసు వంటి తీవ్రవాదికూడా కొందరు బ్రిటిష్ మితవాద రాజకీయవేత్తలను తన స్నేహితులుగా పరిగణించేవాడు.

ఆ రోజుల్లో ఇండియా విద్యార్థులకు జాతి వివక్షత వల్ల జరిగిన ఒక అన్యాయం అందరికీ చాలా స్పష్టంగా తెలిసింది. అది యూనివర్సిటీలో ఏర్పరిచిన సైనిక అదికార శిక్షణా దళానికి కావలసిన విద్యార్థులను ఎన్నుకొనుటకు సంబంధించినది. భారత విద్యార్థులకు ఆ దళంలో ప్రవేశం యివ్వటానికి ఎన్నో అభ్యంతరాలు పెట్టారు. ఆ అభ్యంతరం కారణంగా 'నువ్వు' అంటే 'నువ్వు' అంటూ ఇండియా ఆఫీసు, యుద్ధ మంత్రాలయం పరస్పరం విమర్శించుకున్నాయి. ఆ విషయాన్ని ఇండియా పాలనకు సంబంధించిన ఒక ఉన్నతాధికారి దృష్టికి తీసుకొని వెళ్ళటంలో సుభాసు చంద్రుడు ప్రధాన పాత్ర వహించాడు. అసలు రహస్యం ఏమిటంటే, ఆ సైనిక అధికార్ల శిక్షణా దళంలో చేరటానికి ఎవరైనా ఒకసారి అర్హత సంపాదించితే, ఆయనకు బ్రిటిష్ సైన్యంలో సరాసరి సైనికాధికారి కావటానికి హక్కు ఏర్పడుతుంది. కాగా తమకు బ్రిటిష్ సైన్యంలో ఆఫీసర్ పదవులను యివ్వాలని సాధికారంతో అడగం అనీ, తమకు కావలసింది సైనిక శిక్షణ మాత్రమేననీ ఇండియా విద్యార్థులు ఎంత విన్నవించినా, బ్రిటిష్ అధికారులు వారి కోర్కెను ఆమోదించలేదు.

ఇది ఇలా ఉండగా, ఇంగ్లండులో సుభాసు గడిపిన జీవితం ఆయనతోటి వాళ్ళకు చాలా నియమ నిష్ఠలతో కూడినదిగా కనిపించింది. ఒకే కాలంలో చేయటానికి నిర్దేశింపబడిన రెండు పనులు: ఒకటి ఐ.సి.యస్. పరీక్ష రాయటానికి తయారు కావటం, మరొకటి కేంబ్రిడ్జి ట్రైపాస్ పరీక్ష రాయటానికి సన్నద్ధం కావటం. కాగా విశ్రమించాలన్నా, వినోదం కోసం మరొక పని చెయ్యాలన్నా ఆయనకు సమయం చిక్కేదికాదు. అంతేకాదు,

విదేశాలలో ఎందరో భారతీయ విద్యార్థుల జీవిత విధానంగా ఆమోదింపబడి, చివరికి వారి జీవితాలనే నాశనం చేసిన అనావశ్యక, అల్ప విషయాలంటే సుభాసు ఆలోచనా ధోరణికి ఏమాత్రం పడేది కాదు. కాగా సుభాసు చంద్రుడు ఎక్కడ ఉంటే అక్కడ, ఏమాత్రం క్రమశిక్షణ లేని వాళ్ళు కూడ గంభీరంగా ఉండే వాళ్ళట. అటువంటి అనుభవాలను, ఇంగ్లీషు ప్రజల జీవిత విధానాన్ని, ఇంగ్లండు పరిస్థితులను వివరించుతూ సుభాసు భారతదేశంలో వున్న తన మిత్రులకు నియమానుసారంగా ఉత్తరాలు రాశాడు. ఎప్పుడూ, ఏ ప్రఖ్యాత భారతీయుడు ఇంగ్లండును సందర్శించి ఇంగ్లండు విశ్వవిద్యాలయాలలో గాని, ఇండియన్ మజ్లిస్ ఆధ్వర్యాన జరిగే సభల్లోగాని ఉపన్యసించనున్నా, సుభాసు అక్కడ ప్రత్యక్షమై ఎంతో ఉత్సాహంగా శ్రోతల సమావేశాలను ఏర్పాటు చేసేవాడు. ఏ భారతీయుడు విదేశాచార్యుడుగా ఇంగ్లండు వచ్చి, రాణించినా, సుభాసు ఎంతో గర్వించేవాడు. ఉదాహరణకు: సుభాసు ఒకసారి ఇంగ్లండులో సరోజినీ నాయుడు ఉపన్యాసాన్ని విని అపరిమితమైన ఆనందంలో మునిగిపోయాడు. "ఆహా! ఒక భారతీయ వనిత పశ్చిమ ప్రపంచంలో తన హోదాను ఎంత బాగా నిలబెట్టుకుంది! ఆమె పాండిత్యం, ఆమె ఉత్తేజం, ఆమె బౌద్ధిక లక్షణాలు, స్వభావం, ఎంత గొప్పవి!" అంటూ ఇండియాలోని ఒక మిత్రునికి రాసిన ఉత్తరంలో ఆమె ఉపన్యాసాన్ని గురించి సగర్వంగా రాశాడు.

సివిల్ సర్వీస్ ఉద్యోగులు దేశాన్ని దక్షతతో పాలించాలి. ఇందు నిమిత్తం వారికి అపారమైన విషయ పరిజ్ఞానం అవసరం. కాగా సివిల్ సర్వీస్ పరీక్షార్థులు చాలా విషయాలను అధ్యయనం చెయ్యాలి. అప్పుడు రాజకీయ శాస్త్రం, అర్థిక శాస్త్రం, ఆంగ్ల చరిత్ర, ఆధునిక ఐరోపా చరిత్రలలో సహా మొత్తం తొమ్మిది విషయాలను అధ్యయనం చేయవలసి వుండేది. సివిల్ సర్వీస్ పరీక్ష కోసం ఇంగ్లండులో వుండి ఆధునిక ఐరోపా చరిత్రను లోతుగా అధ్యయనం చేసిన తరువాతనే, సుభాసుకు ఐరోపా ఖండం రాజకీయాలను గురించి ఒక స్పష్టమైన అవగాహన కలిగింది. ఐరోపా రాజకీయాలను ఇంగ్లండు కళ్ళతో చూడటం ఇండియాకు బోధించారని చాలా కాలం సుభాసు చంద్రుడు భావించాడు.

సుభాసు ఐరోపా చరిత్రను మూలభూతమైన ఆధారాల ద్వారా

అధ్యయనం చేసి, అంతర్జాతీయ రాజకీయాలలోని అంతర్లీనంగా వున్న ధోరణులను సరియైన విధంగా అర్థం చేసుకున్నాడు, వాటిని నూతన పద్ధతిలో అంచనా కట్టాడు. ఈ అవగాహన ఆయనకు తరువాత జీవితంలో బాగా తోడ్పడింది.

ఐ.సి.యస్. బహిరంగ పోటీ పరీక్ష 1920 జూలైలో ప్రారంభమై, ఒక నెల వరకు సాగింది. ఆ పరీక్షలో నెగ్గుతాననే ఆశ తనకు లేదని సుభాను ఇంటికి ఉత్తరం రాశాడు. ఐ.సి.యస్. పరీక్షలో నెగ్గటం విషయంలో తనకు నమ్మకం లేనందున, సుభాను మరుసటి సంవత్సరం జరగనున్న కేంబ్రిడ్జి ట్రైపాస్ పరీక్షకు తయారుకావటం ప్రారంభించాడు. కాని సెప్టెంబరు నెల మధ్యలో ఒకనాటి రాత్రి బాగా పొద్దుపోయిన తరువాత ఆయనకు ఒక స్నేహితుని నుండి ''పరీక్షలో నెగ్గినందుకు అభినందనలు'' అంటూ ఒక టెలిగ్రాం వచ్చింది. ఆయన చాలా ఆశ్చర్యపడ్డాడు. మరునాటి ఐ.సి.యస్. పరీక్షలో కృతార్థులైన వారి పేర్లు పత్రికలలో వచ్చాయి. యోగ్యతననుసరించి తయారు చేయబడిన ఆ పేర్ల వరసలో సుభాను పేరు నాల్గవదిగా వుంది. తరువాత వచ్చిన మార్కుల పట్టీ, ఆయన ఇంగ్లీషు (సమాస, వాక్యాది) రచనలో ప్రథముడుగా వచ్చినట్లు వెల్లడించింది. ఆ విధంగా దివినుండి భువికి దిగి రానిదని పేరుపడిన ఉద్యోగం సుభాను చేజిక్కింది. ఎందరో అత్యాశాపరులైన భారతీయ యువకుల పగటికల సుభాను విషయంలో వాస్తవంగా సిద్ధించింది.

# 6

ఐ.సి.యస్. పరీక్షలో సుభాసు విజయం ఆయన జీవితంతో పరిహాసమాడుతున్నదా అన్నట్లు ఆయనను తీవ్రాతి తీవ్రమైన సంక్షోభంలోకి నెట్టింది. వెంటనే తానొక కఠోరమైన పరీక్షను ఎదుర్కొంటున్నట్లు సుభాసు గ్రహించాడు. తను నమ్మిన ఆదర్శాలకోసం, తను ప్రవచించిన సిద్ధాంతాల కోసం తను నిలబడి పోరాడాలా లేక దివి నుండి భువికి దిగివచ్చిన ఐ.సి.యస్. ఉద్యోగం దురాకర్షణకు దాసోహం అనాలా అనే సమస్య సుభాసును ఇరుకులో పెట్టింది. కాగా ఆయన తన రెండవ అన్నగారైన శరత్ చంద్రబోసుతో చాలాకాలం ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపాడు. తన హృదయాన్ని విప్పిచెప్పాడు. ఆయన సలహాను అర్థించాడు. అనంతమైన బాధను భరించటానికీ, పేదరికాన్ని తట్టుకోవటానికీ సిద్ధంగా ఉండమని ఆదేశించే తన ఉదాత్తమైన ఆశయాలకు, ఇండియన్ సివిల్ సర్వీస్‌లో తనకోసం ఎదురుచూస్తున్న సుఖప్రదమైన ఉద్యోగం ఆకర్షణకు సుభాసు చంద్రుని అంతరంగంలో సంఘర్షణ ప్రారంభమైంది. ఆ సంఘర్షణ 1920 సెప్టెంబరులో ప్రారంభమై 1921 మార్చి వరకు కొనసాగింది. ఆయన ఆ రోజుల్లో శరత్‌కు రాసిన ఉత్తరాలలో ఆ సంఘర్షణ స్వరూపం వెల్లడైంది.

అది ఏడు నెలల కాలం కొనసాగిన అంతర్గత సంఘర్షణ. ఆ ఏడు నెలలూ ఆయన ఆ సమస్యకు సంబంధించిన వివిధ అంశాలను పరిశీలించాడు. తన కుటుంబ బాధ్యతలను గురించి, తన కుటుంబ ఆర్థిక వ్యవహారాలను గురించి కూడా ఆలోచించాడు. తన కుటుంబంలో అత్యధిక సంఖ్యాకులు తను ఆ ఉద్యోగానికి రాజీనామా యివ్వటాన్ని హర్షించరని ఆయనకు తెలుసు. ఆయన తండ్రి జానకీనాథ్ అంచనా ప్రకారం ఇండియాకు సుమారు పది సంవత్సరాలలో స్వయం పరిపాలన వస్తుంది. కాగా నూతన హయాంలో స్వాభిమానంగల భారతీయ ప్రభుత్వ ఉద్యోగి జీవితం దుర్భరంగా ఉండదని ఆయన నమ్మకం. కాని ఇండియా తగిన మూల్యం చెల్లిస్తేనే ఇండియాకు పదేళ్ళలోనో, ఇంకా ముందుగానో

పరిపాలన వస్తుందని సుభాస్ సమాధానం. సేవ, త్యాగం, బాధలనుభవించటం ఆ మూల్యం స్వరూపం. అందువలన యీ పరిస్థితులలో భారతీయులు పరాయి ఉద్యోగుల దొరతనానికి భక్తి, విశ్వాసాలు ప్రకటించి, కేవలం చారుభోజనం కోసమే తమను తాము విక్రయించుకొంటే, భారత స్వాతంత్ర్యం వెనక్కు పోతుందే కాని అందుబాటులోకి రాదు అని సుభాను భావించాడు. కాగా సేవ, పోరాటం, త్యాగాలను ఆశించే మార్గంలో పయనించి స్వాతంత్ర్యం వైపుకు ముందడుగు వెయ్యటమా లేక ఇండియాను దాస్యంలో వుంచుతున్న పరాయి శక్తికి లొంగి ఉండటమా అనే మౌలిక ప్రశ్నకు సుభాను జవాబు చెప్పవలసి వచ్చింది. తన కుటుంబంలో అత్యధిక సంఖ్యాకులు తనది అసాధారణ మనస్తత్వం అని అనుకుంటున్నారని సుభానుకు తెలుసు. కాగా తను ఐ.సి.యస్. ఉద్యోగాన్ని వదులుకుంటే తన ఇంటిదగ్గర వాళ్ళు పెద్దగా అరుస్తారనీ, కేకలు వేస్తారనీ ఆయనకు తెలుసు. కాని ఆ విధంగా తన కుటుంబం నుండి వచ్చే వ్యతిరేకతను గురించి సుభాను అంతగా పట్టించుకోలేదు. తన బంధువులలో ఎవ్వరూ తన అసాధారణ పథకాలను అమోదించకపోయినా శరత్ అంతకుముందు ఎన్నోసార్లు చేసినట్లుగానే, ఎప్పుడూ తన నిర్ణయాలకు అనుకూలంగానే స్పందిస్తాడనే ఆత్మ విశ్వాసం సుభానుకు వుంది.

కాని తను ఐ.సి.యస్. ఉద్యోగానికి రాజీనామా యివ్వటానికి చేసుకున్న నిర్ణయం తన వయస్సు మళ్ళిన, వ్యాధిగ్రస్తులైన తల్లిదండ్రుల మనస్సులను గాయపర్చుతుందని సుభాను చాలా ఆందోళన పడ్డాడు. అదే సమయంలో భారతదేశం ప్రయోజనం వాళ్ళ కుమారుని ముందుకు వచ్చి అతని ఉద్యోగాన్ని బలి యివ్వమని కోరిందని శరత్ తన తల్లిదండ్రులకు నచ్చజెప్పగలడనీ నమ్మాడు. ఇంకా తను చేసే త్యాగం ఉద్దేశపూర్వకమైనదీ, సచేతనంగా చేసినదీ కావాలేగాని, అచేతనంగా చేసినది కాకూడదని కూడ సుభానుచంద్రుడు భావించాడు. తన విదేశీ చదువు నిమిత్తం ఖర్చు చేసిన డబ్బును ఎటువంటి ప్రతిఫలాన్ని ఆశించకుండా భారత మాత పాదాల దగ్గర ఉంచిన కానుకగా పరిగణించమని తన తల్లిదండ్రులకు చెప్పటం బాగా ఉంటుందని సుభాను తన అన్న అయిన శరత్‌కు సూచించాడు.

లాంఛనప్రాయంగా తన ఐ.సి.యస్. ఉద్యోగానికి రాజీనామా లేఖను పంపించటానికి మూడు వారాలముందు, అనగా 1921 ఏప్రిల్ నెలలో శరత్‌కు ఉత్తరం రాస్తూ తన అంతరంగంలో ఘర్షణపడుతున్న సిద్ధాంతానికీ, ప్రయోజనకారిత్వానికి మధ్య తను ఎందుకు రాజీ కుదర్చలేక పోయిందీ లేదా వాటి మధ్యగల ఘర్షణను ఎందుకు పరిహరించలేక పోయిందీ సంక్షిప్తంగా చెప్పాడు.

"మనం ఒక వంక స్వామి వివేకానందుని వలన ప్రభావితులమై పెరిగాం, మరొకవంక అరవింద్ ఘోష్ వలన ప్రభావితులమై పెరిగాం. మంచికో, చెడుకో, మనం ఒకదానికొకటి పూర్తిగా వ్యతిరేకమైన భిన్న దృక్పథాల మధ్య సమన్వయాన్ని సాధించలేని ధోరణిని పెంచుకున్నాం." అంటూ, సుభాను అన్యథా సమరసంగా వున్న తన కుటుంబంలో భేదాభిప్రాయాలు కలగటానికి తను కారణమైనందుకు తన విచారాన్ని వెలిబుచ్చాడు. ఆ భేదాభిప్రాయాలకు కారణం ఆ కుటుంబానికి నచ్చని కొన్ని భావాలకు సుభాను చంద్రుడు కట్టుబడి ఉండడమే.

సుభాను చంద్రుడు ఐ.సి.యస్. ఉద్యోగానికి రాజీనామా యివ్వటానికి నిర్ణయించుకోగానే దేశబంధు చిత్తరంజన్ దాసుకు ఉత్తరం రాస్తూ, దేశం కోసం ఆయన నాయకత్వాన తను సేవచేయటానికి సిద్ధంగా ఉన్నానని తెలియపరిచాడు.

1921 ఏప్రిల్ 22వ తేదీన కేంబ్రిడ్జినుండి ఆనాడు ఇండియాకు సెక్రటరీ ఆఫ్ స్టేట్ అయిన మాంటేగ్యూ ప్రభువుకు ఒక ఉత్తరంలో 1920 ఆగస్టులో జరిగిన పోటీ పరీక్షలో నెగ్గి, ఐ.సి.యస్.కు ఎన్నికైన వారి పేర్ల పట్టిక నుండి తన పేరును ఉపసంహరించుకుంటున్నట్లు రాశాడు.

అంతకు ముందే, అనగా 1921 ఫిబ్రవరి, మార్చి నెలలలో సుభాను చంద్రబోస్ రెండు చరిత్రాత్మకమైన ఉత్తరాలను దేశ బంధు చిత్తరంజన్ దానుకు రాశాడు. అంతకు పూర్వం 1916లో ప్రొఫెసర్ ఓటెన్ సంఘటన జరిగినప్పుడు సుభాను కొద్ది సేపు మాత్రమే దేశబంధుతో వున్నాడు.

1921లో రాసిన ఉత్తరాలలో చిత్తరంజన్ దానును సుభాను చంద్రుడు "బెంగాలులో జాతీయ సేవా ఉద్యమ నిర్వాహకులలో అగ్రగామి" అని ఉగ్గడించుతూ, భారతజాతి ప్రయోజనాల నిమిత్తం చిత్తరంజన్ దాస్ నాయకత్వాన మనస్ఫూర్తిగా త్రికరణ శుద్ధిగా

పనిచెయ్యటానికి తన సంసిద్ధతను తెలియజేశాడు.

అదే సందర్భంలో భారత జాతీయ కాంగ్రెసు నిర్మాణాన్ని గురించి తన భావాలను స్పష్టంగా తెలియజేశాడు. ప్రప్రథమంగా కాంగ్రెసుకు సొంత ఆఫీసు భవనం అవసరమన్నాడు. ఇంకా వివిధ జాతీయ సమస్యల గురించి పరిశోధించటానికి కాంగ్రెసుకు ఒక పరిశోధక బృందం అవసరమన్నాడు. కరెన్సీ, మారకపు విలువల విషయంలో కాంగ్రెసుకు ఒక నిర్దిష్టమైన నీతి అవసరమన్నాడు. అలాగే భారత సంస్థానాల యెడల కాంగ్రెసుకు ఒక కచ్చితమైన వైఖరి ఉండాలనీ, స్త్రీలకు పురుషులకు కూడా సార్వత్రిక ఓటు హక్కు ఉండాలనే విషయంలో కాంగ్రెసు తన అభిప్రాయాన్ని నిర్ద్వంద్వంగా ప్రకటించాలనీ, యింకా దళిత వర్గాల అభ్యున్నతికి కాంగ్రెసు ఏమి చెయ్యదలచినదీ ప్రకటించాలనీ, బోసు ఉద్ఘాటించాడు. ఈ పనులన్నింటినీ నిర్వహించటానికి కాంగ్రెసుకు శాశ్వతమైన సిబ్బంది ఉండాలనీ, ఆ సిబ్బందిపై పనులను నిర్వర్తించటానికి అవసరమైన సమాచారాన్ని సేకరించి, భద్రపరచాలనీ, ఆ సమాచారం ఆధారంగానే కాంగ్రెసు తన ప్రణాళికలకు రూపం యివ్వాలనీ కూడా సుభాను చంద్రుడు చెప్పాడు. కాంగ్రెసుకు ఒక రహస్య సమాచార విభాగం, ఒక ప్రచార విభాగం కూడా అవసరమన్నాడు. ఇంకా మన జాతీయాభివృద్ధికి సంబంధించిన వివిధ సమస్యలపైన స్వదేశ భాషలన్నింటిలోనూ కరపత్రాలను ప్రచురించటం అవసరమన్నాడు.

ముఖ్యంగా మూడు రంగాలలో, అనగా బోధన, పత్రికా రచన, పరిశోధన రంగాలలో తన వ్యక్తిగత సేవలను దేశ బంధుకు అందించటానికి సుభాను ముందుకు వచ్చాడు. దేశబంధు చిత్తరంజన్ దాసు స్థాపించిన నేషనల్ కాలేజీలో ఆచార్యుడుగా పనిచేయటానికి, దేశబంధు స్థాపించిన 'స్వరాజ్' అనే పత్రిక ఇంగ్లీషు ప్రచురణల కోసం, అలాగే కాంగ్రెసుకు అవసరమైన పరిశోధన కార్యక్రమాలను జయప్రదం చెయ్యటానికి తన సేవలు దేశబంధుకు లభించుతాయన్నాడు. చివరి మాటగా భారతదేశానికి భవిష్యత్తులో ఎటువంటి రాజ్యాంగం అవసరం అనే విషయంలో కాంగ్రెసుకు ఒక నిశ్చితమైన విధానం ఉండాలన్నాడు. కాబట్టి స్వరాజ్యం ఎలా ఉండాలో నిర్ణయించి, ఆ నిర్ణయానికి అనుగుణంగా ఇండియా కోసం ఒక నూతన రాజ్యాంగ విధానాన్ని రచించటానికి కాంగ్రెసు

నాయకత్వం వెంటనే చర్యలు తీసుకోవాలని నొక్కి చెప్పాడు.

ఇండియన్ సివిల్ సర్వీసు నుండి సుభాను చంద్రుడు రాజీనామా చేశాడన్న వార్త ఇంగ్లండులో వున్న భారతీయులందరిలో గొప్ప సంచలనం కలిగించింది. ఆ వార్త చాలా వేగంగా ఇండియాకు చేరింది. వెంటనే ఆ విషయం దేశమంతటా ఉత్తేజకరమైన చర్యలకు కారణమైంది. నిజానికి ఆ సంఘటన ఇండియాలో సంచలనం కలుగజేయరాదనీ, జనం దానిని గురించి మాట్లాడుతూ తనకు మెచ్చుకోవలసిన అవసరం లేదనీ సుభాను భావించాడు. అది కేవలం తన ఆత్మ తిరస్కార చర్యగా మాత్రమే మిగిలిపోవాలనుకున్నాడు. అందుకే "నేను మీ మంచి మాటలకు అర్హుడను కానని నాకు తెలుసు. మీరు రాసిన ఉత్తరాలలో నన్ను గురించి ఎన్నో మంచి మాటలు రాశారు. 'మిమ్ములను గురించి నేను చాలా గర్విస్తున్నాను' అని మాత్రమే నేను చెప్పగలను. నేను ఎంతమంది హృదయాలను గాయపరిచానో నాకు తెలుసు. నాకంటే ఎంత మంది పెద్ద వాళ్ళకు అవిధేయుడుగా ప్రవర్తించానో నాకు తెలుసు. కాని నేను యీ అపాయకరమైన బాధ్యతను స్వీకరించేముందు, 'యీ చర్య మన ప్రియమైన దేశానికి మంచిని కలుగజేయుగాక'! అని మాత్రమే నా ప్రార్థన." అని అంటూ తన అన్న అయిన శరత్ చంద్ర బోసుకు రాసిన ఉత్తరంలో సుభాను పేర్కొన్నాడు.

చివరకు తన తల్లి నుండి ఉత్తరం వచ్చినప్పుడు సుభాను చంద్రుడు చాలా ఊరట పొందాడు. ఇతరులు ఏమి చెప్పినా తను మాత్రం మహాత్మాగాంధీ ఆదర్శాలకు ప్రాముఖ్యతను యిస్తున్నట్లు ఆమె ఆ ఉత్తరంలో రాశారు.

అంతా నిర్ధారణ అయిపోయింది. ప్రయోజనకారిత్వంతో రాజీపడే ప్రశ్నకు తావు లేకుండా సుభాను చంద్ర బోసు కావాలన్నా వెనుకడుగు వెయ్యటానికి వీలులేకుండా ఆదర్శవాదం, నైతిక పోరాటాల పంథాను ఎంచుకున్నాడు. అంతే. మళ్ళీ ఆయన ఎప్పుడూ వెనక్కి తిరిగి చూడలేదు.

# 7

కేంబ్రిడ్జి 'మెంటల్ అండ్ మోరల్ సైన్సెస్ ట్రైపాస్' పరీక్షలో ఉత్తీర్ణుడు కాగానే, సుభాను చంద్రుడు 1921 జూన్‌లో ఆదరాబాదరాగా ఇండియాకు బయల్దేరాడు. ఇండియా చేరగానే అప్పుడు పూర్తిగా ఊపు అందుకున్న జాతీయ పోరాటంలోకి దూకాడు. ఆయన జూలై 16న బొంబాయి ఓడ రేవులో దిగి, అదే రోజు మధ్యాహ్నం గాంధీ మహాత్ముని సందర్శించాడు. భారత జాతీయ ఉద్యమానికి సర్వోన్నత నాయకుడైన మహాత్ముని నుండి ఆయన తలపెట్టిన పోరాట కార్యక్రమం యొక్క స్పష్టమైన రూపాన్ని తెలుసుకోవాలనుకున్నాడు. అంతకుముందు గడిచిన కొద్ది సంవత్సరాలలో సుభాను ఇతర ప్రాంతాల, ఇతర దేశాలలోని జాతీయ విప్లవ ఉద్యమాలను లోతుగా పరిశీలించాడు. ఆ విప్లవ ఉద్యమాలు, తన సొంత ఆలోచనలు తనకు కలిగించే ఆలోచనల వెలుగులోనే మహాత్ముని అంతర్యాన్ని చూడాల నుకున్నాడు.

గాంధీజీని కలవగానే, తను పరాయి (దేశ) దుస్తులు ధరించి ఉన్నందుకు సుభాను క్షమార్పణ చెప్పుకున్నాడు. 'అయితే అయిందిలే హాయిగా ఉండు' అని మహాత్ముడు అన్నాడు. అప్పుడు వారిద్దరి మధ్య ఒక ఆసక్తికరమైన సంభాషణ జరిగింది. అధికారాన్ని వదులుకోవటానికి యిష్టపడకుండా వున్న ఆంగ్లేయులనుండి అధికారాన్ని లాక్కోవటానికి మహాత్ముడు నిర్వహించదలచిన పోరాటాల దశలలో వరుస క్రమాన్ని తెలుసుకోవాలని సుభాను కోరిక. కాగా గాంధీ మీద సుభాను ప్రశ్నల వర్షాన్ని కురిపించాడు. మహాత్ముడు తన మామూలు ధోరణిలో వాటన్నింటికీ ఓర్పుగా సమాధానమిచ్చాడు. పన్నులు చెల్లింపు నిరాకరణోద్యమం, శాసనోల్లంఘనోద్యమం, విదేశీ వస్త్ర బహిష్కరణ, ఖాదీ ప్రచారం, ఒక సంవత్సరంలో స్వరాజ్యం వస్తుందని మహాత్ముడు భారతీయులకు పెట్టిన ఆశ, ప్రజలు మూకుమ్మడిగా జైళ్ళకు వెళ్ళటం మొదలైన విషయాలన్నీ ఆ సంభాషణలో చోటుచేసుకున్నాయి. మహాత్ముని సమాధానాలలో కొన్ని సుభానుకు సంతృప్తిని కలిగించాయి. ముఖ్యంగా

పన్నులు చెల్లింపు నిరాకరణకు సంబంధించిన సమాధానాలు సుభాసుకు నచ్చాయి. ఇతర సమాధానాలు సుభాసుకు అంత సంతృప్తికరంగా లేవు. అంతా విని, మహాత్ముడు అప్పటికింకా ఒక స్థిరమైన రూపు ధరించని తన పథకాలను అంత త్వరలో ముందుగా అకాలంగా బయట పెట్టటానికి యిష్టపడకపోయి వుండవచ్చు. లేదా వాస్తవంగా రాజ్యాధికారాన్ని కైవశం చేసుకోవటానికి తాను అనుకరించవలసిన పద్ధతులు, ఎత్తుగడల విషయంలో మహాత్మునికి ఒక విస్పష్టమైన అవగాహన అయినా లేకపోవచ్చునని సుభాసు అనుకున్నాడు.

మహాత్మునితో తను జరిపిన మొదటి సమావేశం ఫలితాలు అంత ప్రోత్సాహకరంగా లేకపోవడంలో నిరుత్సాహపడి, దేశబంధు చిత్తరంజన్‌దాసుని వీలైనంత త్వరగా కలిసే నిమిత్తం సుభాసు వెంటనే కలకత్తాకు బయల్దేరి వెళ్ళాడు. కలకత్తా చేరగానే చిత్తరంజన్‌దాసు పర్యటనలో ఉన్నట్లూ, ఆయనను కలవాలంటే తను కొన్ని రోజులు వేచియుండక తప్పదనీ తెలుసుకున్నాడు.

తరువాత వారిద్దరి మధ్య జరిగిన మొదటి సమావేశమే నిర్ణయాత్మకం అయింది. చిత్తరంజన్‌దాసుకు కొన్ని స్పష్టమైన పోరాట పథకాలు ఉన్నాయనీ, ఆయన తనది అనే ప్రతిదానినీ తన ఆశయ సాధనకోసం త్యజించటానికి సిద్ధంగా ఉన్నాడనీ, కాగా సాధికారంగా ఆయన ఇతరులను వాళ్ళది అన్న ప్రతిదానిని వాళ్ళు నమ్మిన ఆశయం కోసం త్యాగం చెయ్యమని అడగగల స్థితిలో ఉన్నాడనీ, సుభాసు చంద్రుడు వెంటనే గ్రహించాడు. తనకొక నాయకుడు లభించాడని సుభాసు నమ్మాడు. కాగా ఆయనను అనుసరించటానికి సుభాసు నిర్ణయించుకున్నాడు.

చిత్తరంజన్ దాసు యువకుడు, ఉత్సాహవంతుడు అయిన సుభాసును తన నూతన ప్రతినిధిగా ఆహ్వానించాడు. వెంటనే ఆయనకు కొన్ని బాధ్యతలను అప్పగించాడు. అప్పుడు భారతదేశం దేశభక్తితో సంచలిస్తూ ఉంది. దేశం కోసం కృషి చెయ్యాలనే ఉత్సాహం ప్రజల ఆదరణను పొంది, అసమాన స్థాయికి ఎదిగింది. బహిష్కార ఉద్యమం త్రిముఖంగా సాగటం ప్రారంభమైంది. కాంగ్రెసు నాయకులు శాసన సభలకు దూరమయ్యారు. న్యాయవాదులు న్యాయస్థానాలకు హాజరు కావటం మానేశారు. జాతీయోద్యమంలో పాల్గొనే నిమిత్తం విద్యార్థులు

విద్యాలయాలను బహిష్కరించారు. ఆ దేశంలో చిత్తరంజన్‌దాసు పశ్చిమ బెంగాలు రాష్ట్ర కాంగ్రెసు కమిటీ ప్రచార విభాగానికి, జాతీయ స్వచ్ఛంద సేవాదళానికి ముఖ్య నాయకుడుగా సుభాసును నియమించాడు. నూతనంగా ప్రారంభమైన జాతీయ కళాశాల ప్రిన్సిపల్ పదవికూడా సుభాసునే వరించింది. సమర్ధవంతంగాను, అంకిత స్వభావంతోను సుభాసు తన బాధ్యతలను నిర్వహించిన విధానం ఆనాటి కాంగ్రెసు నాయకులందరి మన్ననలను చూరగొంది. ఇది ఇలా ఉండగా 1919లో బ్రిటిష్ పార్లమెంటు ఆమోదించిన మాంటేగ్యూ-ఛెమ్స్ ఫర్డ్ రాజ్యాంగ సంస్కరణలను భారతదేశం ఎంత వ్యతిరేకించినా అమలుపర్చటానికి కావలసిన పూర్వ రంగాన్ని సిద్ధం చెయ్యటానికి, ప్రభుత్వం పూనుకుంది. ఆ పూనికలో భాగంగా వేల్సు యువరాజు భారత దేశాన్ని దర్శించనున్నాడని 1921 నవంబరులో ప్రకటించింది. వేల్సు యువరాజు బొంబాయిలో కాలుపెట్టిన రోజున భారతదేశం హర్తాల్ (అంగళ్ళను మూసివేయుట) చెయ్యాలని కాంగ్రెసు ప్రజలకు పిలుపు యిచ్చింది. బారతదేశంలోగల ఇతర నగరాలలో వలె కలకత్తా కూడా తగిన విధంగా ఆ పిలుపుకు స్పందించింది. తత్ఫలితంగా ఆ నగరం అంతా సుభాసు చంద్రబోస్ నాయకత్వాన కదిలిన కాంగ్రెస్ స్వచ్ఛంద సేవా దళం వశమైనట్లు కన్పించింది. వెంటనే ప్రభుత్వం ఆ సేవాదళాన్ని చట్ట విరుద్ధమైనదిగా ప్రకటించింది. ఆ చర్య అగ్నికి ఆజ్యం పోసినట్లు కాంగ్రెసులో తీవ్రవాదులకు కొత్త ఊపును యిచ్చింది. కాంగ్రెసు కార్యవర్గం తన అధికారాలనన్నింటిని కాంగ్రెసు అధ్యక్షుడైన చిత్తరంజన్ దాసుకు యిచ్చింది. చిత్తరంజన్ దాసు ఆ రాజ్యాంగ సంస్కరణల వ్యతిరేక ఉద్యమ నిర్వహణ బాధ్యతను సుభాసుకు అప్పగించాడు. చిత్తరంజన్ దాసు భార్య వాసంతీ దేవి, ఆమెతో బాటు వీధులలో చట్టాన్ని ధిక్కరించిన సేవా దళ సభ్యులాంధ్రు నిర్బంధితులయ్యారు. వెంటనే ఆ ఉద్యమం పెద్ద ఊపును అందుకుంది. యువతీ యువకులు వేల సంఖ్యలో ముందుకు దూకారు. ఇండియా ప్రభుత్వం జైళ్ళు అన్నీ నిండిపోయాయి. డిసెంబరు రెండవ వారంలో చిత్తరంజన్ దాసు, యింకా మరికొందరు నాయకులతో పాటు సుభాసు చంద్రుడు కూడా నిర్బంధితుడయ్యాడు. వాళ్ళందరికీ కొద్దికాలం జైలు శిక్ష పడింది. ఆ సందర్భంలో సుభాసుచంద్రుడు ఎనిమిది నెలలు

చిత్తరంజన్‌తో కలిసి జైలులో ఉండవలసి వచ్చింది. చిత్తరంజన్‌తో కలిసి జైలులో ఉండటం సుభాను చంద్రుని మానసికంగా ఎంతో చలింపజేసింది, ఆయనకు ఎంతో మనో వికాసాన్ని కలిగించింది.

కలకత్తాకు సమీపంలో వున్న అలీపూర్ కేంద్ర కారాగారంలో చిత్తరంజన్‌కు తోటి ఖైదీగా వుంటూ, సుభాను తన గురువు లక్షణాలను విశ్లేషించి, ప్రజలలో ఆయనకుగల అద్భుతమైన పట్టు, ముఖ్యంగా ఆయన అనుచర వర్గంలో ఆయన పలుకుబడి రహస్యం తెలుసుకోవటానికి ప్రయత్నించాడు. కాలం గడిచిన కొలదీ, అనగా, బెంగాలు నాయకత్వం సుభాను భుజస్కంధాలమీద పడినప్పుడు. తరువాత అఖిల భారత రాజకీయ రణరంగంలో ఒక ప్రత్యామ్నాయ నాయకత్వాన్ని చూపించవలసి వచ్చినప్పుడు, చివరికి ఆయన ఐరోపా, తూర్పు ఆసియాలలో అజాద్ హింద్ ఉద్యమానికి నాయకత్వం వహించినప్పుడు, యీ అనుభవం ఆయనకు చాలా బాగా ఉపయోగపడింది.

చిత్తరంజన్ దాసు ప్రజల నాయకుడుగా పొందిన విజయ రహస్యాన్ని సుభాను చంద్రుడు యీ క్రింది విధంగా విశ్లేషించాడు: (1) చిత్తరంజన్ తన అనుచరులనందరినీ, (వాళ్ళ హోదాలను, లక్షణాలను, లోపాలను గురించి ఆలోచించకుండా), సమానంగా, హృదయపూర్వకంగా ప్రేమించాడు. ఆయన ఎప్పుడూ ఎదుటి మనిషి హృదయానికి ప్రథమ తాంబూలం యిచ్చాడు, ఎదుటి మనిషి హృదయంతో మాట్లాడాడు. (2) తనతోటి మనుషులలో ఎవరు కష్టాలలో చిక్కినా, వారి గతాన్ని, పార్టీ అనుబంధాన్ని గురించి ఆలోచించకుండా, వారికి సహాయపడటానికి అవసరమైన ఏ పని చెయ్యటానికైనా సిద్ధమయ్యేవాడు. అందుకు కృతజ్ఞతగా ఆయన అనుచరులు, దేశస్థులు ఆయన ఆశయాలను నెరవేర్చటానికి లేదా ఆయన సూచనలను ఆచరణలో పెట్టటానికి వారికి సాధ్యమైన ఏ పనినైనా, ఏ త్యాగాన్నైనా చేసేవారు, ఏ బాధనైనా అనుభవించేవారు. కాగా ఆయన అనుచరులు ఆయన యెడల ప్రవర్తించిన సంపూర్ణ విశ్వాసం ఆయన రాజకీయ ప్రత్యర్థుల కడుపు మంటకు, అసూయకు కారణమైంది. (3) ప్రజలను సంఘటిత పరచటంలో చిత్తరంజన్ దాసు ప్రదర్శించిన నిర్మాణశక్తి సుభానును బాగా ప్రభావితం చేసింది. ఆయన నిర్మించిన సంస్థ సభ్యులు చాలా ఉత్తమ శ్రేణికి చెందిన వారు.

కాగా ఆ సంస్థ దేశ విదేశాలలోని ప్రతికూల శక్తులన్నింటినీ, విజయవంతంగా ఎదుర్కోనగల శక్తి కలిగి ఉండేది. ఐనప్పటికీ, ఆయన నిర్మించిన సంస్థ సమావేశాలలో వివిధ చర్చనీయాంశాల మీద వాదోపవాదాలు చేయటానికి, భిన్నాభిప్రాయాలను ప్రకటించటానికి దాని సభ్యులందరికీ సంపూర్ణ వాక్స్వాతంత్ర్యం ఉండేది. అదే సమయంలో ఆ సభ్యులందరూ కొనియాడదగిన సంయమనం, క్రమశిక్షణ, పోరాటంలో ఐకమత్యం ప్రదర్శించేవారు. (4) దేశబంధు చిత్తరంజన్ యువతీ యువకులను చాలా ప్రేమించేవాడు. వాళ్ళ బాధలతో, ఆశలతో, ఆకాంక్షలతో చిత్తరంజన్ పూర్తిగా తాదాత్మ్యం చెందేవాడు.

ఆలీపూర్ కారాగారంలో వున్న ఎనిమిది నెలలూ సుభాను అత్యంత భక్తి, ప్రేమలతో చిత్తరంజన్‌ను కాపాడాడు. చిత్తరంజన్‌కు అవసరమైన సమస్త భౌతిక సౌకర్యాలను కలుగజేయటంలో శ్రద్ధ చూపటమేగాక, ఆయనకు వంటకూడా చేసిపెట్టేవాడు. అందుకే ఐ.సి.యస్. (ఇండియన్ సివిల్ సర్వీసు)ను ఎగతాళిగా కొందరు ఇండియన్ కుకింగ్ సర్వీస్ అనేవారు) అటువంటి వంటవానిని కలిగివున్న దేశబంధు ఎంతో అదృష్టవంతుడని కొందరు ఆయనతో పరిహాసమాడేవారు. ఆ సాన్నిహిత్యం దేశబంధు అంతరంగాన్ని అర్థం చేసుకోవటానికి సుభానుకు అద్వితీయమైన అవకాశాన్ని యిచ్చింది. చిత్తరంజన్ రాజకీయాలలో పూర్తిగా మునిగిన మనిషి. కాని ఆయనలో సంకుచిత స్వభావం గుర్తులు కూడా కనిపించవు. కాగా సుభాను చంద్రుడు రాజకీయాల కంటె జీవితం విశాలమైనదనే సూత్రాన్ని తన నాయకుని నుంచి నేర్చుకున్నాడు. సుభాను ఆ సూత్రాన్ని విశ్వసించాడు, ఆచరణలో పెట్టాడు.

దేశబంధుతో ఆయనకు గల సన్నిహిత సహవాసం పుణ్యమా అని, ఇంగ్లండు నుండి భారతదేశానికి తిరిగి రాగానే భారత దేశపు విశిష్టమైన నాయకులలో కొందరిని కలిసే అవకాశం సుభానుకు లభించింది. 1921 సెప్టెంబరు నెలలో కాంగ్రెసు కార్యవర్గ సమావేశం దేశబంధు ఇంటి దగ్గర జరిగింది. అప్పుడు పండిట్ మోతీలాల్ నెహ్రూ, లాలా లజపత్ రాయ్, మౌలానా మహమ్మద్ ఆలీలతో సుభానుకు పరిచయమైంది. ఈ ముగ్గురూ నాటి జాతీయోద్యమంలో చిత్తరంజన్‌తో పాటు మహాత్ముని పక్కన నిలబడిన భారత మేధావులలో అసాధారణ ప్రజ్ఞావంతులైన

ముగ్గురు ప్రముఖులు. ఇది ఇలా ఉండగా, సుభాను భారతదేశంలో అడుగుపెట్టకముందే ఆసక్తికరమైన, చారిత్రక ప్రాముఖ్యంగల సంఘటన ఒకటి జరిగింది. ఇండియాకు రావటానికి సుభాను ఏ ఓడలో ప్రయాణం చేస్తున్నాడో అదే ఓడలో నాటి భారత జాతీయ కవి అయిన రవీంద్రనాథ్ టాగూరు కూడా ఉన్నాడు. అంతేకాదు. ఆ ఓడలో వాళ్ళిద్దరూ ముఖాముఖీ ఎదురుగా ఒకేచోట కూర్చున్నారు. సహాయ నిరాకరణోద్యమం గురించి మాట్లాడుకున్నారు. ఈ సంఘటన యిక్కడ ఉదహరించతగినది.

నాటి వరకు టాగూరు సహాయ నిరాకరణోద్యమానికి మౌలికంగా వ్యతిరేకి అనే అభిప్రాయం ఉండేది. కాని ఆయనతో చర్చించిన ఫలితంగా సుభానుకు భిన్నమైన అభిప్రాయం కలిగింది. టాగూరు సహాయ నిరాకరణోద్యమానికి మౌలికంగా వ్యతిరేకి కాదనీ, అయితే కొన్ని పరిమితుల పరిధిలోనే టాగూరు ఆ ఉద్యమాన్ని బలపర్చుతున్నాడనీ సుభాను భావించాడు. ప్రజల క్రియాశీల సహకారం, అండలతో చివరికి బ్రిటిష్ ఇండియాలో భారతీయులు తమ రాజ్యాన్ని నిర్మించుకోవాలంటే కాంగ్రెసు యింకా ఎక్కువ నిర్మాణాత్మకమైన కార్యక్రమాలను చేపట్టాలనేది టాగూరు అభిప్రాయంగా సుభాను గ్రహించాడు. టాగూరు భావం ఆనాడు ఐర్లండులో బలంగావున్న 'సిన్‌ఫిన్ ఉద్యమం నిర్మాణాత్మక పార్శ్వానికి అనుకూలంగానే వుంది. ఆ విధంగా టాగూరు ఆలోచన, సుభాను ఆలోచన పూర్తిగా ఏకీభవించాయి. అంతేకాదు. ప్రపంచంలోగల సంస్కృతులు అన్నీ ఏకమై ఒకే ప్రపంచ సంస్కృతిగా ఏర్పడాలని టాగూరు వెల్లడించిన భావనను సుభాను ఆమోదించాడు. నాటి సహాయ నిరాకరణోద్యమ ప్రముఖులలో కొందరు గట్టిగా సూచించినట్లు పాశ్చాత్య విజ్ఞానశాస్త్రం, సంస్కృతి, నాగరికతలను నిరాకరించకూడదు అనే టాగూరు భావనను కూడా సుభాను చంద్రుడు ఆమోదించాడు.

# 8

1921 మధ్య నుండి ఇండియాలో రాజకీయ ఉద్రిక్తత పెరిగి, పెరిగి, ఆ సంవత్సరం చివర ఒక తుఫాను రూపం దాల్చింది. సహాయ నిరాకరణోద్యమ తుఫానుకు కలకత్తా కేంద్రమైంది. గాంధీజీ ఆధ్వర్యాన ముందుకు పోతున్న సహాయ నిరాకరణ, శాసనోల్లంఘన ఉద్యమాలకు మిద్నపూరు జిల్లాలో పన్నుల నిరాకరణోద్యమం, పంజాబులో అకాలీ ఉద్యమం, మలబారులో మాప్లా తిరుగుబాటు తోడయ్యాయి. సహాయ నిరాకరణోద్యమానికి, ఖిలాఫత్ ఉద్యమానికి మధ్య ఏర్పడిన అనుసంధానం బ్రిటిష్ ప్రభుత్వానికి చాలా చిరాకు కలిగించింది. ఒక్క సంవత్సరంలో స్వరాజ్యం అనగా 1921 డిసెంబరు 31వ తేదీ లోపలే ఇండియాకు స్వరాజ్యం వస్తుంది అంటూ గాంధీజీ చేసిన వాగ్దానం నెరవేరుతుందనే ఆశ కనుచూపు మేరలో లేకపోయినా, జాతీయోద్యమ శక్తులకు తమ బలం పట్ల విశ్వాసం చాలా బాగా పెరిగింది. తత్ఫలితంగా పాలకులు తమ హృదయ పరివర్తనను బహిరంగపర్చకపోతే, తన ఉద్యమ ఆయుధాలలో అఖరి ఆయుధమైన పన్నుల నిరాకరణోద్యమాన్ని చేపట్టగలనంటూ గాంధీజీ కొత్తగా వచ్చిన వైస్రాయ్ అయిన రీడింగ్‌కు తన తుది హెచ్చరికను పంపించాడు. గాంధీజీ సమర శంఖారావాన్ని పూరించిన వెంటనే ఆ ఉద్యమాన్ని ప్రారంభించటానికి అవసరమైన ఏర్పాట్లన్నీ జరిగిపోయాయి. ఏర్పాట్లు బెంగాలులో కూడా జరిగాయి. అంతర్జాతీయ పరిస్థితి కూడా భారతదేశం పోరాటానికి అనుకూలంగానే వుంది. కాని సుభాసు మొదలగు తన దగ్గరి సహచరులతో పాటు చిత్తరంజన్ 1921 డిసెంబరు నుండి కారాగారంలోనే ఉన్నాడు.

ఆ పరిస్థితులలో ఒక పరిష్కార మార్గాన్ని అన్వేషించటానికి బ్రిటిష్ వైస్రాయ్ శాంతిదూతగా పండిట్ మదనమోహన్ మాలవ్యాను కారాగారంలో వున్న చిత్తరంజన్ దగ్గరకు పంపించాడు. ఆ దశలో పరిష్కారం వాళ్ళ ఆశయాన్ని ముందుకు తీసుకొని వెళ్ళుతుందని చిత్తరంజన్ తన సహచరులతో వాదించాడు. ఆ సహచరులలో సుభాసు చంద్రుడు

కూడా ఉన్నాడు. వెంటనే చిత్తరంజన్, మౌలానా అబుల్ కలాం ఆజాద్‌లు ఆ పరిష్కారం షరతులు ఆమోదయోగ్యమైనవని సిఫారసు చేస్తూ మహాత్మాగాంధీకి ఒక ఉమ్మడి టెలిగ్రాంను పంపించారు. కలకత్తా, సబర్మతిల మధ్య చాలా టెలిగ్రాంలు నడిచాయి. దేశబంధు బ్రిటిష్‌వాళ్ళ ప్రతిపాదన ఆహ్వానింపదగిన అదృష్టంగా భావించాడు. కాని గాంధీజీకి అందులో వున్న కొన్ని షరతులు తృప్తికరంగా లేవు. ఫలితం ప్రతిష్టంభన.

1921 ఉత్తరార్ధంలో కాంగ్రెసు బెంగాలులో చాలా ముందుకు వెళ్ళింది. ఆ సందర్భంలో సుభాను నిర్వహించిన పాత్ర చాలా ప్రాముఖ్యత గలది. కాంగ్రెసుకు గాంధీజీ ఒక నూతన రాజ్యాంగాన్ని ఏర్పాటు చేశాడు. తద్వారా కాంగ్రెసుకు ప్రజాపార్టీగా పునాది ఏర్పడింది. మూడు రంగుల జెండా నిజంగా జాతీయ జెండా అయింది. ఎక్కడ విన్నా అవే నినాదాలు. ఖాదీ దుస్తులు భారత పౌరుల వేష ధారణకు ప్రతీకలయ్యాయి. అట్లాగే ఒకే ఒక రాజకీయ విధానం. ఒకే ఒక రాజకీయ సిద్ధాంతం బెంగాలు, మహారాష్ట్ర, పంజాబు, మద్రాసు, రాష్ట్రాలలో, ఇంకా ఇతర ప్రాంతాలలో కూడా చెలామణి కావటం ప్రారంభమైంది.

బెంగాలులో యీ పరివర్తన సంభవించినప్పుడు కొన్ని ప్రత్యేక విధులను నిర్వహించటానికి సుభాను చంద్రుని దేశబంధు ప్రత్యేకంగా ఎన్నిక చేశాడు. అప్పటికి సుభాను చంద్రుని వయస్సు 24 సంవత్సరాలు మాత్రమే. ఆయన ఆకృతిని గురించి చెప్పాలంటే, ఆనాడు ఆయన ఎంతో అందమైన యువకుడు. ఆ అందాన్ని ఆయన అవయవ సౌష్టవం ఇనుమడింపచేసింది. ఇండో-యూరోపియన్ లక్షణాలన్నింటిని రంగరించి పోతపోసిన మూర్తి ఆయనది. వాటికి తోడు ఆయన రంగు సొగసైన తెలుపు, ఆయన నుదురు విశాలమైనది, ఆయన కళ్ళు నల్లనివి, ఇతురల కళ్ళలోకి చొచ్చుకు పోగల శక్తి గలవి. ఆయన దాదాపు ఎల్లప్పుడూ నిరాడంబరమైన ఖాదీ వస్త్రాలనే ధరించేవాడు.

సుభాను చంద్రుడు తాత్కాలికంగా రాజకీయ రంగంలో ప్రవేశించిన వ్యక్తి కాదు. ఆయన గొప్ప విద్యాధికుడనీ, ఆయన మేధా శక్తి అపారమైనదనీ, తన ఐ.సి.యస్. ఉద్యోగానికి రాజీనామా యిచ్చి అప్పటికే ఆయన గొప్ప త్యాగిగా రుజువు చేసుకున్నాడనీ, భారతదేశం అంతటికీ తెలును. ఆయన అప్పటికే జాతీయ సేవా దళాన్ని జాతీయ విద్యా సంస్థలను

నిర్మించటంలో ప్రత్యేకమైన ప్రతిభను ప్రదర్శించిన విషయం కూడా దేశం అంతటికీ తెలుసు. అందుకే చిత్తరంజన్ ఆయనకు కొన్ని ప్రత్యేక విధులను కేటాయించాడు. కాగా సుభాసు జాతీయ పత్రికలను ప్రారంభించటానికి పూనుకొని, వరుసనే 'బంగ్లార్ కథ' (1921), 'ఆత్మశక్తి' (1922), 'ఫార్వర్డ్' (1923) పత్రికలను స్థాపించటంలో ప్రత్యేక పాత్ర వహించాడు. తన సొంత ప్రాంతమైన దక్షిణ కలకత్తాలో సాంఘికాభివృద్ధిని పెంపొందించటానికి కృషిచేస్తూనే ఉన్నాడు. దక్షిణ కాళీఘాట్ సేవా సమితి, దక్షిణ కాళీఘాట్ సేవాశ్రమాల ద్వారా ఆయన సాంఘిక సేవా కార్యక్రమాలలో పాల్గొన్నాడు.

1922వ సంవత్సరం ఒక వంక అనిశ్చితంగానూ, మరొకవంక ఉత్తేజ పూరితంగానూ, ప్రారంభమైంది. ఒకపక్క వైస్రాయ్ తన పరిష్కారం ప్రతిపాదనను ఉపసంహరించుకున్నాడు, మరొకపక్క గాంధీజీ బార్డోలీ (గుజరాత్)లో పన్నుల నిరాకరణ ఉద్యమాన్ని ప్రారంభిస్తానని వైస్‌రాయ్‌కి తన అంతిమ సందేశం పంపించాడు. అప్పుడు గాంధీకి హఠాత్తుగా ఒక పిడుగువంటి వార్త చేరింది. ఫిబ్రవరి ప్రథమపక్షంలో చౌరీచౌరా అనేచోట గ్రామస్థులు ఒళ్ళు తెలియని ఉద్రేకంలో ఒక పోలీసు స్టేషన్‌కు నిప్పంటించి, కొందరు పోలీసులను సజీవంగా దహనం చేశారు. తన ఉద్యమం ఆ రూపం దాల్చినందుకు గాంధీజీ నిర్ఘాంతపోయాడు. కాగా ఆయన ప్రేరణతో కాంగ్రెసు కార్యవర్గం సహాయ నిరాకరణోద్యమాన్ని ఉపసంహరించింది. అప్పుడు దేశబంధుతో పాటు సుభాసు కారాగారంలో ఉన్నాడు. సహాయ నిరాకరణోద్యమం ఉపసంహారాన్ని గురించి విన్న వెంటనే వాళ్ళిద్దరూ విచారంలో మునిగిపోయారు, ఆగ్రహంతో ఊగిపోయారు. హఠాత్తుగా ఉద్యమ విరమణ జరిగినందుకు కాంగ్రెసువాదులు దిగ్భ్రమ చెందారు. కాగా ఉల్లాసపూరితమైన ప్రజల ఆశాభావం నిస్పృహగా మారింది.

వైస్‌రాయ్ అయిన రీడింగ్ ఆ పరిస్థితిని అవకాశంగా తీసుకొని ఎదురుదాడి ప్రారంభించాడు. మహాత్ముని అరెస్టు చేశారు. రాజద్రోహం నేరం ఆరోపించి, ఆయనకు దీర్ఘకాలిక కారాగార శిక్ష విధించారు.

కారాగారంలో వున్న దేశబంధు ప్రజా ఉద్యమాన్ని వాయిదా వేయటం తిరుగులేని పని అనీ, అది మళ్ళీ తిరిగి ప్రారంభం కావడం జరగదనీ నిర్ధారించుకుని ఒక నూతన సహాయ నిరాకరణోద్యమ పథక

రచనకు అంకితమయ్యారు. ఆ సహాయ నిరాకరణోద్యమంతో పాటు, విప్లవకర పోరాటంలో అనుకూలమైన దశలన్నింటినీ తాము వశం చేసుకుని ఉంచుకోవాలని సిద్ధాంతం ప్రకారం శాసన సభల లోపల కూడా పోరాటం సాగించటానికి వీలైన ఒక నూతన పోరాట విధానాన్ని రూపొందించటానికి ఆ కారాగారంలో నుండే చిత్తరంజన్ అంకిత స్వభావంతో పనిచెయ్యటం ప్రారంభించాడు.

అప్పుడే కాంగ్రెసు కార్యవర్గం సహాయ నిరాకరణోద్యమం గురించి అధ్యయనం చెయ్యటానికి ఒక విచారణ సంఘాన్ని నియమించింది. ఆ విచారణ సంఘం సభ్యుల్లో సగంమంది పోరాటం ప్రారంభించాలనే చిత్తరంజన్ పథకాన్ని బలపర్చగా, మిగిలినవారు సహకార నిరాకరణోద్యమ స్వరూపంలో ఎటువంటి మార్పు అవసరం లేదనే వర్గాన్ని బలపరిచారు. సుభాను తన నాయకుడైన చిత్తరంజన్‌కే విశ్వాసపాత్రుడుగా నిలిచాడు.

1922 సెప్టెంబరులో బెంగాలు ఉత్తర జిల్లాలను విధ్వంసకరమైన వరదలు ముంచెత్తాయి. కాంగ్రెసు సమయానికి తగినట్లు స్పందించింది. వరద బాధితులకు కావలసిన సహాయాన్ని వెంటనే పంపించింది. ఆ సహాయ కార్యక్రమాలను నిర్వహించిన మొదటి సేవాదళం నాయకుడు సుభాస్ చంద్రబోసు. వరద బాధితులకు ప్రభుత్వం చేసిన సహాయం ప్రభుత్వం పిసినారితనాన్ని, అర్ధాంగీకారాన్ని తెలియజేయగా, సుభాను నాయకత్వాన కాంగ్రెసు ఏర్పాటుచేసిన సహాయ కార్యక్రమాలు బాగా విజయవంతం కావటమేగాక, కాంగ్రెసు ప్రతిష్ఠను బాగా పెంచాయి.

1922 ఉత్తరార్థంలో రెండు ముఖ్యమైన రాజకీయ సంఘటనలు సంభవిం చాయి. చిత్తరంజన్ ప్రధాన అనుచరుడైన సుభాను జీవితం మీద అవి ప్రగాఢమైన ముద్రను వేశాయి.

వాటిల్లో మొదటిది దేశ బంధు అధ్యక్షతన లాహోరు నగరంలో జరిగిన అల్ ఇండియా ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ (ఏ.ఐ.టి.యు.సి.) మహాసభ. ఆ మహాసభలోనే, వారు ఏ స్వరాజ్యంకోసం పోరాడుతున్నారో, ఆ స్వరాజ్యం జనాభాలో 98 శాతంగావున్న ప్రజానీకం కోసమని దేశబంధు నిర్ద్వంద్వంగా ప్రకటించాడు. ఆ విధంగా భారత కార్మిక ఉద్యమం నిర్వహణలో సుభానుకు ప్రవేశం లభించింది. తరువాత సుభాను తన నాయకుని అడుగుజాడల్లో నడిచి అల్ ఇండియా ట్రేడ్ యూనియన్

కాంగ్రెస్ అధ్యక్షుడు (1931) కావటమే గాక, జెంషెడ్‌పూర్‌లోని టిస్కో (తాతా ఐరన్ అండ్ స్టీల్ కంపెనీ) లేబర్ అసోసియేషన్ అధ్యక్షుడు కూడా అయ్యాడు. ఆ పదవి అంతకు ఒక దశాబ్దం పూర్వం ఆయన గురువుగారైన చిత్తరంజన్ నిర్వహించినదే.

కలకత్తాలో జరిగిన యువజన మహాసభ రెండవ సంఘటన. అది నూతన బెంగాలు యువజన ఉద్యమానికి నాంది పలికింది. ఆ ఉద్యమం నుండే సుభాసుచంద్రుడు వివాదరహితుడైన, ప్రజలను అద్భుతంగా ప్రభావితం చేయగల నాయకుడుగా ఆవిర్భవించాడు. ఆ దశాబ్దాంతానికి భారతదేశంలో యువజన ఉద్యమం ఒక బలమైన, గుర్తింపు పొందిన శక్తిగా ఎదిగింది. ఆ ఉద్యమానికి సుభాసుచంద్రుడు, జవహర్‌లాల్ నెహ్రూ మార్గదర్శకులైన ధృవతారలు.

1922 సంవత్సరాంతాన కలకత్తాలో అఖిల భారత కాంగ్రెసు కమిటీ సమావేశం జరిగింది. అది ఆ సంవత్సరం డిసెంబరు నెలలో దేశబంధు అధ్యక్షతన గయలో జరగవలసిన కాంగ్రెసు వార్షిక మహా సభకు భూమిక.

కలకత్తా సమావేశంలో మార్పుకోసం పోరాడుతున్న దేశబంధు అనుచరులకు, యధాపూర్వ స్థితిని నిలబెట్టటానికి గాంధీ అనుచరులకు మధ్య బలాబలాల పరీక్ష జరిగింది. అదే పరీక్ష గయ మహాసభలో మళ్ళీ జరిగింది. ఆ సభకు సుభాను కూడా హాజరయ్యాడు. అయినప్పటికీ దేశబంధు ప్రతిపాదన వీగిపోయింది. కాగా కాంగ్రెసు అధ్యక్షుడుగా దేశబంధు స్థితి అసంగతంగా తయారైంది. మరుసటి సంవత్సరానికి కార్యక్రమం తయారుచేసే సమయం వచ్చినప్పుడు, కాంగ్రెసుతో నిమిత్తం లేకుండా, అధ్యక్షుని కార్యక్రమాన్ని ఆచరణలో పెట్టేందుకు స్వరాజ్య పార్టీ స్థాపనను ప్రకటించి మోతీలాల్ నెహ్రూ కాంగ్రెసు సభను నిర్ఘాంతపర్చాడు. వెంటనే కాంగ్రెసు అధికార తీర్మానాలకు వ్యతిరేకంగా పనిచెయ్యదలచిన దేశబంధు కాంగ్రెసు అధ్యక్ష పదవికి రాజీనామా చేశాడు. ఆ విధంగా 'స్వరాజిస్టులు' ఓటమి పొందామనే భావంతోనే కాంగ్రెసును వదిలిపెట్టారు. కాని 'పోరాడి, విజయం సాధించాలనే పట్టుదలతోనే ఆ పనిచేశారు' అని తరువాత ఆ సంఘటనను గురించి సుభాను రాశాడు.

# 9

సుభాను, దేశబంధు ఇతర అనుయాయులు గయ నుండి నిరుత్సాహంగా తిరిగి బెంగాలు చేరుకున్నారు. బెంగాలు రాష్ట్ర కాంగ్రెసు యంత్రాంగం గాంధీ అనుచరుల చేతుల్లోకి పోయింది. దేశబంధు వర్గానికి ప్రత్యేక నిధి అంటూ కూడా ఏమీ లేకుండా పోయింది. అయినా 'స్వరాజిస్టులు' కేవలం పట్టుదలతో కృషి చేసి క్రమక్రమంగా ముందడుగు వేశారు. కాంగ్రెసువాదులకు తమ వాదనను మళ్ళీ, మళ్ళీ వినిపించారు. సుభాసు మొదలగు దేశబంధు అనుచరులు పల్లె ప్రాంతాలలో పనిచెయ్యగా, దేశబంధు, మోతీలాల్ వంటి నాయకులు దేశాన్ని చుట్టబెట్టారు. తత్ఫలితంగా 1923వ సంవత్సరం మధ్య కాలంనాటికి 'స్వరాజిస్టులు' గాంధీ అనుచరవర్గంతో 'ఢీ' అంటే 'ఢీ' అని పోరాడగల స్థాయికి ఎదిగారు. చివరికి ఆ సెప్టెంబరులో ఢిల్లీలో జరిగిన కాంగ్రెసు ప్రత్యేక మహాసభలో 'స్వరాజిస్టులు' నెగ్గారు. కాంగ్రెసువాదులకు ఎన్నికలలో పాల్గొనే స్వేచ్ఛ లభించింది. అలాగే ప్రభుత్వానికి వ్యతిరేకంగా, స్థిరమైన ప్రతిపక్షాలుగా శాసన సభల్లో పనిచేసే అవకాశం కాంగ్రెసువాదులకు లభించింది. తరువాత శాసన సభలకు జరిగిన ఎన్నికలలో స్వరాజిస్టులకు అఖండ విజయం లభించింది. కేంద్ర శాసన సభలో కాంగ్రెసు పక్షానికి మోతీలాల్ నాయకత్వం వహించాడు, బెంగాల్ కౌన్సిల్‌లో కాంగ్రెసు పక్షానికి దేశబంధు నాయకత్వం వహించాడు. కలకత్తాలో దేశబంధు 'ఫార్వర్డ్' పత్రికను ప్రారంభించి, దానిని నిర్వహించే బాధ్యతను సుభానుకు అప్పగించాడు. అతి కొద్ది కాలంలోనే 'ఫార్వర్డ్' భారతదేశపు ప్రధాన దినపత్రికలలో ఒకటిగా పెరిగింది.

ఒకవంక స్వరాజ్య పార్టీ కార్యక్రమాలను శక్తివంతంగా నిర్వహించుతూనే, మరొక వంక యువజనోద్యమాన్ని పైకి తేవటానికి సుభాను తన పథకాలను అమలులో పెట్టాడు. ఆయన అఖిల బెంగాలు యువజన సంఘాన్ని స్థాపించాడు. దానికి ఆయనే అధ్యక్షుడుగా

ఎన్నికయ్యాడు. ఆ సంఘం భారతదేశంలో ఏర్పడే ఇతర యువజన సంఘాలకు ఆదర్శప్రాయంగా నిలిచింది.

ఒక రాజకీయ పార్టీకి కేవలం తోకగా పనిచేయించటానికి లేదా ఆందోళనలను నిర్వహించటానికి ఆయన యువజన సంఘాన్ని ఏర్పాటు చెయ్యలేదు. దేశంలో వున్న యువతీ యువకులను శారీరకంగా, మానసికంగా, ఆధ్యాత్మికంగా, మేధావరంగా, యింకా మనో విజ్ఞానదృష్ట్యా ఉన్నతస్థాయికి ఎదిగేటట్లు చేసి, వారిద్వారా భారతదేశంలో ఒక విప్లవాత్మకమైన పరివర్తనను తీసుకొని రావటం, కాలక్రమేణా భారతదేశంలో ఒక నూతన సమాజాన్ని నిర్మించటం సుభాను ఆశయాలు. ఈ ఆశయాలకు అనుగుణంగా ప్రతి బెంగాలీ ప్రాంతంలోనూ, జిల్లాలోనూ యువజన సంఘాల ఏర్పాటును ప్రోత్సహించాడు.

1923వ సంవత్సరం చివరలో సుభాను బెంగాలు రాష్ట్ర కాంగ్రెను కమిటీ ప్రధాన కార్యదర్శిగా ఎన్నికై, కాంగ్రెను పార్టీలో ఒక కీలకమైన స్థానాన్ని సంపాదించాడు.

1924వ సంవత్సరం స్వరాజిస్టులకు ఆశాజనరకమైన సంవత్సరంగా ప్రారంభమైంది. ఆ ఏడాది కలకత్తా మునిసిపల్ కార్పోరేషన్‌కు ఎన్నికలు ప్రకటించారు. స్వరాజ్య పార్టీ ఆ ఎన్నికల పోరాటంలో పాల్గొనటానికి నిర్ణయించింది. పోటీ చేసింది, హిందూ, ముస్లిమ్ స్థానాలలో అధిక స్థానాలను గెలిచింది. దేశబంధు కలకత్తాకు ప్రధమ మేయరుగా ఎన్నికయ్యాడు. ఆయన ప్రేరణ వలన సుభాను చంద్రుడు డెప్యూటీ మేయరుగా ఎన్నికయ్యాడు. ఇంకా దేశబంధు ప్రేరణ వలననే సుభాను కలకత్తా కార్పొరేషన్ ప్రధాన కార్యనిర్వాహక అధికారి కూడా అయ్యాడు. అనగా సుభాను ఆ కార్పోరేషన్ పాలనా వ్యవస్థ ప్రధాన అధికారి అయ్యాడు. కాని ఆయన నియామకం ప్రభుత్వానికి పెద్ద తలకాయ నొప్పి అనిపించింది. అయినప్పటికీ, ఆలోచించి, ఆలోచించి, చివరకు ప్రభుత్వం ఆయన నియామకాన్ని ఆమోదించింది.

దేశబంధు మేయరుగా, సుభాను డెప్యూటీ మేయరుగా, ప్రధాన పరిపాల నాధికారిగా, కలకత్తా కార్పొరేషన్‌ను కైవశం చేసుకోవటం భారతదేశంలో పౌరపాలనకు సంబంధించిన అభివృద్ధిలో నూతనశకం ఆరంభమైంది. దేశబంధు మేయరుగా చేసిన ఉపన్యాసం పౌరహక్కుల

పత్రంలో వుంది.

తమ పార్టీ కార్యక్రమాన్ని అమలుపర్చి, దానికి వాస్తవరూపం యివ్వటం సుభాను కర్తవ్యం. కాగా మొదటిసారిగా ఖాదీ గుడ్డను మునిసిపల్ సిబ్బంది అధికారిక యూనిఫారంగా వాడటం ప్రారంభమైంది. కలకత్తాలో బ్రిటిష్ ప్రముఖుల పేర్లుగల ఎన్నో వీధులకు, ఉద్యానవనాలకు, భారతీయ నాయకుల పేర్లు పెట్టారు. ప్రప్రథమంగా, కలకత్తా కార్పొరేషన్‌లో ఒక యోగ్యుడైన అధికారి ఆధ్వర్యంలో విద్యాశాఖ ఏర్పాటైంది. ఆ నగరంలో నలుమూలలా బాలురకు, బాలికలకు కూడా ఉచిత ప్రాథమిక పాఠశాలలు ఏర్పాటయ్యాయి. ఆరోగ్యాన్ని గురించి ప్రచారం చెయ్యటానికి కార్పొరేషన్ ఆధ్వర్యంలో, సేవా ధోరణి గల ప్రముఖ నగర వాసుల సహకారంతో, ఆరోగ్య సంరక్షణా సంఘాలు ఏర్పాటయ్యాయి. పేదలకు ఉచితంగా మందులు యిచ్చే నిమిత్తం నగరం అంతటా ఔషధశాలలు ఏర్పాటు అయ్యాయి. ఆ నగరం వివిధ ప్రాంతాలలో బాలల కోసం కొన్ని ప్రత్యేక వైద్య పరీక్షా కేంద్రాలు ఏర్పాటయ్యాయి. ఆ కేంద్రాలలో పేద పిల్లలకు ఉచితంగా పాల సరఫరా చెయ్యటానికి ఏర్పాట్లు జరిగాయి. ప్రధాన పరిపాలనాధికారియైన సుభాను కార్యక్రమ వివరణ పట్టిక ఆయన చురుకుదనానికి అద్దం పట్టేది. ఆయన రాత్రింబవళ్ళు, ఇక్కడ, అక్కడ, ఎక్కడ కావాలంటే అక్కడ ప్రత్యక్షమై, కార్పొరేషన్ ప్రజలకు అందించే వివిధ సేవా కార్యక్రమాల నిర్వహణను వివిధ సేవా విభాగాలు నిర్వహించవలసిన మరమ్మతుల నిర్వహణను తనిఖీ చేసి, తన క్రింది ఉద్యోగులకు అవసరమైన సూచనలను అక్కడికక్కడే యిచ్చేవాడు. కాగా కొద్ది నెలలలోనే కలకత్తా మునిసిపల్ కార్పొరేషన్ పాలనా విధానానికి సుభాను ఒక నూతన రూపాన్ని, నూతన అవగాహనను, నూతన గతిని కల్పించాడు.

బ్రిటిష్ ప్రముఖులకు పౌర సన్మానం చేసే సాంప్రదాయానికి వీడ్కోలు చెప్పటం. భారత జాతీయ నాయకులు కలకత్తా దర్శించినప్పుడు వారికి పౌర సన్మానం చేసే సాంప్రదాయాన్ని నెలకొల్పటం జరిగాయి. పురజనులలో పౌర చైతన్యం పెంపొందించడానికి ఒక వార పత్రిక ప్రారంభమైంది. దాని పేరు 'కలకత్తా మునిసిపల్ గెజెట్.' భారత దేశంలో తయారైన వస్తువుల విక్రయాన్ని ప్రోత్సహించటానికి ఒక వర్తక

సంబంధమైన వస్తు ప్రదర్శనశాల స్థాపన జరిగింది. ఈ కార్యక్రమాల నిర్వహణ ఇలా ఉండగా, సుభాసు తన జీతంలో నగం మాత్రమే తీసికొని, మిగతా నగాన్ని ధర్మం చేసేవాడు.

స్వరాజిస్టులు కలకత్తా కార్పోరేషన్ పాలనలో జయప్రదంగా ముందుకు సాగిపోతూ, బెంగాలు కౌన్సిల్‌లోనూ, కేంద్ర శాసనసభలోనూ, శాసన నిర్మాణ కార్యక్రమాలనూ అడ్డుకోవటానికి వారు చేయగల్గినదంతా చేస్తూ ఉండగా, హూగ్లీ (బెంగాలు) జిల్లాలో వున్న తారకేశ్వర దేవాలయంలో పేరుకుపోయిన అవినీతిని ప్రక్షాళనం చెయ్యటానికి యింకా దానిని ప్రజాస్వామ్యబద్ధం చెయ్యటానికి సత్యాగ్రహ ఉద్యమాన్ని ప్రారంభించమని దేశబంధు బెంగాలు కాంగ్రెసు కమిటీకి పిలుపు యిచ్చాడు. అప్పుడు ఆ రాష్ట్ర కాంగ్రెసు కమిటీకి సుభాసు కార్యదర్శి. పంజాబులో సిక్కు పుణ్య క్షేత్రాలను ప్రజాస్వామ్యయుతం చెయ్యటానికి అవలంబించిన ఎత్తుగడలనే బెంగాలులో కూడ అవలంబించాలని దేశబంధు ఆలోచన.

కాంగ్రెసు సేవాదళ సభ్యులు తారకేశ్వర్‌ను చేరగానే, బెంగాలు ప్రభుత్వం వాళ్ళ మీద విరుచుకుపడింది. నిరంకుశుడైన మహంత్ (ఆ దేవాలయ పాలకుడు)ను బలపర్చింది. అయినా ఆ ఉద్యమానికి ప్రజలు గొప్పగా స్పందించారు.

1924 మే నెలలో సిరాజ్‌గంజ్‌లో బెంగాలు కాంగ్రెసు మహాసభ జరిగింది. దేశబంధు ఆ సభకు 'బెంగాలు ఒడంబడిక' అనే పత్రాన్ని సమర్పించాడు. అది బెంగాలీ హిందువులకు, మహమ్మదీయులకు మధ్య జరిగిన ఒప్పందం. అది ఆ రెండు సమాజాల మత, రాజకీయ సమస్యలకు పరిష్కారాలను సూచిస్తూ, చాలా కాలం ఎన్నో ఉద్యోగాలు, ప్రత్యేక హక్కులు కోల్పోయిన మహమ్మదీయులకు చాలా రాయితీలను యిచ్చింది. దానికి తీవ్రమైన వ్యతిరేకత వచ్చినప్పటికి, దేశబంధు ఆ ఒప్పందానికి కాంగ్రెసు ఆమోదముద్రను సంపాదించగలిగాడు.

విభిన్న మత వర్గాల మధ్య తలఎత్తిన సమస్యలను పరిష్కరించటానికి సుభాసు తన జీవితాంతం వరకు తన రాజకీయ నాయకుడైన దేశబంధు నిర్దేశించిన మార్గాన్నే అనుసరించాడనే విషయాన్ని యీ సందర్భంలో చెప్పటం అవసరం. దేశబంధు విధానం న్యాయం, ఉదార స్వభావం అనే రెండు భావాలమీద ఆధారపడింది. సుభాసు విధానం

కూడా అదే. ఆ రాష్ట్ర కాంగ్రెసు మహాసభ మరొక ముఖ్యమైన తీర్మానాన్ని చర్చించింది. అది గోపీనాథ్ సాహా ప్రాణ సమర్పణకు సంబంధించినది. గోపీనాథ్ సాహా ఒక యువ విద్యార్థియైన విప్లవకారుడు. అతను కలకత్తా పోలీసు కమిషనర్‌ను హత్య చెయ్యటానికి ప్రయత్నించాడు. విప్లవకారుల ఉగ్రవాదం, దౌర్జన్యాలను గురించి దేశబంధు, సుభాసు అభిప్రాయాలు ఒకే విధంగావున్నాయి. జాతీయ ఉద్యమంలో ఒక ఆయుధంగా వారు ఎటువంటి ఉగ్రవాదాన్నీ ఆమోదించలేదు. కాని ఒక జాతీ విమోచన ఉద్యమంలో కొందరు ఆదర్శవాదులైన యువతీ యువకులు తమను తామే బలిదానం చేసుకొనేందుకు ఉగ్రవాదంవైపు మొగ్గుతారు అనే చారిత్రక వాస్తవాన్ని వారు గుర్తించారు. ఒక జాతి విమోచన ఉద్యమంలో అటువంటి ప్రేలుళ్ళు అనివార్యమని వారు భావించారు. కాగా ఉగ్రవాదాన్ని, హత్యా ప్రయత్నాలను ఖండించుతూనే, దేశబంధు, సుభాసులు విప్లవకారుల దేశభక్తిని, ఆదర్శాలను, త్యాగనిరతిని ఎంతో గంభీరంగా గౌరవించారు.

1924 మధ్యలో స్వరాజ్య పార్టీ పలుకుబడి, దాని నాయకుడైన దేశబంధు పలుకుబడి నూతన శిఖరాలను అందుకున్నాయి. ఆ పార్టీ వార్షిక మహాసభ ఆ సంవత్సరం ఆగస్టు నెలలో కలకత్తాలో జరిగినప్పుడు, ఆ మహాసభకు హాజరైన వారి సంఖ్య, వారు ప్రదర్శించిన ఉత్సాహం మరువరానివి. ఆ విధంగా స్వరాజ్యపార్టీ విజయం తరువాత విజయాన్ని చేజిక్కించుకుంటూ వుంటే, బ్రిటిష్ ప్రభుత్వం ఓర్వలేకపోయింది, చూస్తూ ఊరుకోలేక పోయింది, ఎంతో నిస్పృహాకు లోనైంది. స్వరాజ్య పార్టీని సమూలంగా నరికి వెయ్యాలనుకుంది. కాగా 1924 అక్టోబరు 25వ తేదీ ఉదయం కలకత్తా పోలీసు డెప్యూటీ కమిషనర్ సుభాసును నిద్రనుండి లేపి "మిస్టర్ బోస్! 1818 సంవత్సరంలో అమలులోకి వచ్చిన 3వ నిబంధన ప్రకారం మిమ్ములను నిర్బంధించటానికి అధికారపత్రం (అరెస్టు వారంట్) ఉంది" అన్నాడు. ఆ ఉదయం అరెస్టయిన వారిలో సుభాసుతో పాటు స్వరాజ్ పార్టీకి చెందిన ఇద్దరు బెంగాలు కౌన్సిల్ సభ్యులు కూడా ఉన్నారు.

# 10

విప్లవం తేవటానికి కుట్ర జరిగిందనే మిషమీద 1924 అక్టోబరున చేసిన మూకుమ్మడి అరెస్టులను బ్రిటిష్ ప్రభుత్వం సమర్థించుకుంది. రెండు కలకత్తా ఆంగ్లో-ఇండియన్ పత్రికలు మరొక అడుగు ముందుకు వేసి, ఆ కుట్ర వెనుకవున్న అదృశ్యహస్తం సుభాసుదేనని ఆరోపించాయి. తత్ఫలితంగా ఆ పత్రికలు సుభాసు తరఫున వేసిన పరువు నష్టం దావాలను ఎదుర్కొవలసి వచ్చింది. ప్రభుత్వం కాని, ప్రభుత్వం అదుపులో వున్న ఆ పత్రికలు కాని ఆ నేరారోపణలను రుజువు చేసేందుకు సాక్ష్యంగా ఒక చిన్న కాగితం ముక్కను కూడ కోర్టు ముందుంచలేక పోయాయి. అయినప్పటికీ సుభాసు చంద్రుడు, అభివృద్ధికి రాదగిన కొందరు బెంగాలు నాయకులు కోర్టుకు హాజరు కాకుండానే దాదాపు మూడు సంవత్సరాల కాలం గృహ నిర్బంధాన్ని అనుభవించవలసి వచ్చింది.

అప్పుడు కలకత్తా నగరం మేయరు హోదాలో సుభాసు నిర్బంధాన్ని ఖండించుతూ, దేశబంధు ఓ మహత్తరమైన ఉపన్యాసాన్ని చేశాడు. కలకత్తా నగరం కార్పొరేషన్ ప్రధాన కార్యనిర్వహణాధికారియైన సుభాసు చేసిన ప్రతి పనికీ తను పూర్తి బాధ్యతను స్వీకరిస్తానన్నాడు. ఇంకా ప్రతిధ్వనించే గొంతుతో, 'దేశాన్ని ప్రేమించటం నేరమైతే, నేనూ నేరస్థుడనే. ఈ సందర్భంలో కార్పొరేషన్ ప్రధాన కార్య నిర్వహణాధికారి ఎంత నేరస్థుడైతే, కార్పొరేషన్ మేయర్ కూడా అంతే నేరస్థుడు!' అని దేశబంధు ఉద్ఘాటించాడు.

అప్పుడు, సుమారు ఆరు వారాలపాటు పోలీసు, జైలు ఆఫీసర్ల సమక్షంలో కలకత్తా కార్పొరేషన్ అధికారకమైన పనులు చేయటానికి సుభాసుకు అనుమతి యివ్వబడింది. ఆ ఆఫీసర్లు సుభాసును తరచుగా ఇబ్బంది పెట్టగా, సుభాసు వాళ్ళకు గట్టిగా చివాట్లు పెట్టాడు. తత్ఫలితంగా సుభాసును కలకత్తాకు దూరంగా బెర్హంపూర్ జైలుకు మార్చారు. రెండు నెలల తరువాత అయనను హఠాత్తుగా కలకత్తాకు తీసుకొని వచ్చి, లాల్

బజార్ పోలీసు స్టేషన్‌లో నిర్బంధించారు. యదార్థంగా అది ప్రత్యక్ష నరకం. మరునాటి తెల్లవారు ఝామున, మరొక ఏడుగురు తోటి ఖైదీలతో సహా సుభాసును జైలు బయటకు నడిపించి జైలు మోటారు శకటంలో ఎక్కించి, అత్యంత వేగంగా (హుగ్లీ) నది ఒడ్డుకు తీసుకొని వెళ్ళి, ఒక మోటారు నావలో ఎక్కించి, ఆ నావను ప్రవాహానికి ఎదురు, వాలుగా కూడ ఓ మూడు గంటల కాలం నడిపించి, చివరకు బర్మా వెళుతున్న ఓడలో ఎక్కించారు.

ఆ నౌకాయానం నాలుగు రోజులకు ముగిసింది. ఆ ప్రభుత్వ ఖైదీలందరూ రంగూన్‌లో దిగారు. తరువాత గట్టి సాయుధ పోలీసు దళం వారి వెంట వుండి, ఒక రోజంతా రైలు ప్రయాణం చేసి, వారిని మాండలే చేర్చింది. మాండలే కారాగారంలో లోకమాన్య గంగాధర్ తిలక్ ఆరు సంవత్సరాలు ఖైదీగా ఉన్న విషయం, లాలా లజపత్ రాయ్ సుమారు ఒక సంవత్సరం ఖైదీగా వున్న విషయం గుర్తుకు తెచ్చుకొని, ఒకవంక బాధపడుతూనే, తను ఆ కారాగారానికి వెళుతున్నందుకు సుభాసు చంద్రుడు గర్వించాడు.

మాండలే జైలు లోపలి ఏర్పాట్లకు, ఇండియా జైళ్ళ లోపలి ఏర్పాట్లకు తేడా వుండేది. మాండలే జైలులో ఖైదీల గదులకు ఉండవలసిన చెక్క తలుపుల స్థానంలో కొయ్య ముక్కలు, కడ్డీలు ఉండేవి. బొమికలను కొరికే శీతకాలపు చలినుండి, తీక్షణమైన వేసవికాలపు ఎండలనుండి, దుమ్మునుండి, ఉష్ణమండలపు వర్షాలనుండి, ఖైదీలకు ఎటువంటి రక్షణ ఉండేది కాదు. జైలు సూపరింటెండెంటు,ఇతర అధికారులు న్యాయంగా ప్రవర్తించాలనుకున్నా, ఆ ఖైదీల రక్షణకు బాధ్యత వహించవలసిన బెంగాలు ప్రభుత్వం వాళ్ళ మీద కసిపూని వుంది. ఇండియా ప్రభుత్వం అసలు ఆ విషయాన్ని గురించి పట్టించుకోనేలేదు. ఆ విధంగా భారత స్వాతంత్ర్యోద్యమ నాయకుడు కావటానికి తొలిదశలో దేశబంధు చిత్తరంజన్ దగ్గర ప్రజాసేవా రంగంలో ప్రాథమిక శిక్షను పొందాడు. అంతకంటె పై స్థాయికి చెందిన శిక్షణను బర్మా జైళ్ళల్లో పొందాడు. బర్మాలో ఒక జైలుగదినుండి తన స్నేహితునికొక ఉత్తరం రాస్తూ, తన జైలు జీవితాన్ని యీ విధంగా రవీంద్రనాథ్ టాగూరు మాటల్లో వర్ణించాడు:

"నేనింకా ఊహా ప్రపంచంలోనే వున్నాను

అడవే (జైలే) నా రాజ్య సింహాసనం
నిశ్శబ్దపుటాలోచనలే నాకు శరణ్యం
శిలల లాలనలోనే నేను మనిషిగా పెరుగుతున్నాను
నా మనస్సును నేనే సమాయత్తం చేస్తున్నాను
లక్ష్య సాధనకు తగిన వాణ్ణిగా ఎదుగుతున్నాను
నేను ఆత్మసిద్ధి పొందానని
మనసారా ఎప్పుడు ప్రకటించగలనో ఎవరికి తెలుసు?
అందరూ రండి! నన్ననుసరించండి!
ప్రభువు మీ అందర్నీ పిలుస్తున్నాడు
నా జీవితమే మీ అందరిలోనూ నూతన జీవాన్ని నింపవచ్చు
ఆ విధంగా నా దేశం జాగృతం కావచ్చు!"

దేశ బహిష్కృతుడుగా, కష్టభరితమైన జీవితం గడుపుతూ, సుభాసు తీక్షణంగా అంతర్దర్శనం చేసుకున్నాడు. చదువు, అధ్యయనాల మీద కేంద్రీకరించాడు. ఆయన జైలు యాదాస్తు పుస్తకాలను పైపైన చూసినా మాండలే జైలు గదిలో ఆయన అధ్యయనం చేసిన విషయాల పరిధి, రాసిన విషయాల పరిధి కళ్ళకు కట్టినట్లు కనిపిస్తుంది. తత్వశాస్త్రం, మతం, చరిత్ర, రాజకీయ శాస్త్రం, ఆర్థిక శాస్త్రం, మానవ సమాజాలను గురించిన శాస్త్ర, కళలు, సంస్కృతి, టాగూరు సంగీతం, విద్య, ప్రజారోగ్యం, జైళ్ళ సంస్కరణలు, నాగరికత అభివృద్ధి మొదలగు విషయాలన్నీ ఆయన అధ్యయనం చేశాడు. ఇంకా ఆయన బర్మా చరిత్ర, రాజకీయాలు, ప్రజలను గురించి కూడా లోతుగా పరిశీలించాడు. ఆయన సుదీర్ఘ జైలు జీవిత కాలంలో ఆయన ప్రభుత్వంతోను, మిత్రులతోను, బంధువులతోను, ముఖ్యంగా తన అన్నగారైన శరత్ చంద్రబోసుతో తరచుగా, సమగ్రంగా ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపాడు. వివిధ సంఘ సేవా సంస్థలలో ఆయనతోప్పాటు పనిచేసిన వారికి ఆయన రాసిన ఉత్తరాలలో, ఆ సంస్థలను ఎలా నిర్వహించాలి అనే అంశాన్ని గురించి ఆయన వివరంగా ఉత్తర్వులను, సలహాలను యిచ్చాడు. వీటిని నేతాజీ పరిశోధనా సంస్థ ప్రచురించుతూ వుంది. ఆయన ప్రభుత్వానికి రాసిన ఉత్తరాలు పాలితుల దేశంలోని రాజకీయ ఖైదీల హక్కులు, విశేషాధికారాలను గురించి ఉద్యోగుల పాలనతో ఆయన నిరంతరంగా సాగించిన పోరాటాన్ని గురించి

తెలియచేస్తాయి.

1925 అక్టోబరు నెలలో సుభాను చంద్రుడు, ఆయన తోటి ఖైదీలు జైలు ఆవరణలోనే దుర్గ పూజను నిర్వహించటానికి తమకు సౌకర్యాలు, ధనం కావాలని కోరారు. ప్రభుత్వం అంగీకరిస్తుందనే ఊహతో జైలు సూపరింటెండెంట్ 'సరే' అన్నాడు. కాని ప్రభుత్వం ఒప్పుకోలేదు. వెంటనే సుభాను, ఆయనతోటి ఖైదీలు నిరాహార దీక్షకు పూనుకున్నారు. ఇది 1926 ఫిబ్రవరిలో జరిగింది. వారు 15 రోజులు పస్తులున్న తరువాత ప్రభుత్వం దిగివచ్చి, వారి కోర్కెలను ఆమోదించింది.

1926వ సంవత్సరం చివరలో శాసన సభలు రద్దు అయ్యాయి. నూతన ఎన్నికలు ప్రకటించారు. బెంగాలు రాష్ట్ర కాంగ్రెసు ఉత్తర కలకత్తా నియోజక వర్గంలో తన అభ్యర్థిగా సుభానును నిలబెట్టింది. అంతకుముందు ఆ నియోజక వర్గంలో స్వరాజిస్టులను ఓడించిన ఒక మితవాద నాయకుడు సుభానుకు ప్రత్యర్థి. ఆ పోటీ ప్రజలలో ఎంతో ఉద్రేకాన్ని రేకెత్తించింది. దేశం కొంతకాలం రాజకీయ స్తబ్దతను అనుభవించిన తరువాత తిరిగి పైకి లేచిన జాతీయతా కెరటానికి సుభాను చంద్రుడు చిహ్నమయ్యాడు. సుభాను బ్రహ్మాండమైన ఆధిక్యతతో ఆ ఎన్నికలో నెగ్గాడు. ఐనా సుభాను నిర్బంధం కొనసాగింది.

జైలులోవున్న ప్రతికూల పరిస్థితులు, అననుకూలమైన వాతావరణం, 1926లో చేసిన నిరాహార దీక్ష సుభాను చంద్రుని ఆరోగ్యాన్ని బాగా క్రుంగదీశాయి. తత్ఫలితంగా ఆయన ఊపిరితిత్తులవాపు వ్యాధికి గురయ్యాడు. ఆయనకు తరచుగా జ్వరం రావటం ప్రారంభించింది. త్వరత్వరగా బరువు కోల్పోయాడు. ఒక వైద్యుల బృందంచేత వైద్య పరీక్ష చేయించేందుకు ఆయనను రంగూన్ తీసికొని వెళ్ళారు. ఆయనను జైలులో వుంచటం కూడదని ఆ బృందం సిఫారసు చేసింది. తరువాత ఆయనను ఇన్సేన్ జైలుకు మార్చారు. ఆ జైలు ప్రధానాధికారి ప్రభుత్వానికొక అత్యవసర సందేశాన్ని పంపించాడు. అయినా ప్రభుత్వానికి జాలి కలగలేదు. కాని భారతదేశం తీరాన్ని తాకకుండా సరాసరి ఐరోపాకి వెళ్ళే ఓడ ఎక్కటానికి ఆయన సిద్ధపడితే ఆయనను విడుదల చెయ్యటానికి ప్రభుత్వం ప్రతిపాదించింది. సుభాను ఆ ప్రతిపాదనను ఖరాఖండీగా తిరస్కరించాడు. బర్మా జైళ్ళ సర్వాధికారికి ఒక ఉత్తరం రాస్తూ, "నేను నా ప్రాణానికి

విలువ యిస్తున్న మాటం నిజం. కాని నేను గౌరవాన్ని ఎక్కువ ప్రేమిస్తున్నాను. కాగా నా ప్రాణాన్ని వదులుకోవటానికి బదులుగా భారతదేశం భావి రాజ్యాంగంలో ప్రాతిపదికగా వుండవలసిన అనుల్లంఘనీయమైన హక్కులను వదిలి పెట్టలేను," అని ఉద్ఘాటించాడు.

తరువాత ప్రభుత్వం ఆయనను ఉత్తర ప్రదేశ్‌లోవున్న అల్మోరా జైలుకు మార్చింది. ఆయనను రంగూన్‌లో ఓడ ఎక్కించి నాలుగు రోజుల తర్వాత హుగ్లీనది ముఖద్వారంలో వున్న డైమండ్ హార్బర్‌లో ఆ ఓడ కలకత్తా చేరకముందే ఆయనను గవర్నర్‌గారి నావలోకి మార్చారు. ఆ నావలో డాక్టర్ నీల్ రతన్ సర్కార్, డాక్టర్ బి.సి. రాయ్ ఇంకా గవర్నర్‌గారి స్వంత వైద్యునితో కూడిన బృందం ఆయన ఆరోగ్యాన్ని పరీక్షించింది. వారి సిఫారసుమేరకు మరునాటి ఉదయం ఆయన విడుదల జరిగింది. ఇది 1927వ సంవత్సరం మే నెలలో జరిగిన సంఘటన.

# 11

బర్మా జైళ్ళల్లో సుభాను కృశించి పోతున్న రోజుల్లో, అనగా 1924 అక్టోబరు 1927 మే నెలల మధ్య ఇండియాలో రాజకీయ పరిస్థితి దిగజారటం ప్రారంభమైంది. రాజకీయ కార్యక్రమాలలో మాంద్యం ఏర్పడింది. దేశభక్తులు సంఘటితం కాకపోగా, విఘటితం కావటం ప్రారంభమైంది. 1925 జూన్ నెలలో దేశబంధు అకాల మరణం పొందటం ఇందుకు ప్రధానమైన కారణం. 1924, 1925 సంవత్సరాలలో దేశబంధు రాజకీయబలం శిఖరాగ్రానికి చేరింది. ఆయన భారత రాజకీయ రంగంలో ఒక సేనానిగా రూపొందాడు. కాగా ఆయన అతి సన్నిహిత శిష్యుడైన సుభానుకు, ఆయన మరణం ఒక జాతీయ విపత్తుకంటె దారుణమైనది. సుభానుకు అదొకవ్యక్తిగతమైన విషాద సంఘటన. సుభాను ఆరోగ్యం క్షీణించటానికి ఆ వ్యక్తిగతమైన వియోగం కూడా తోడ్పడింది. తరువాత ఆయన దేశబంధు భార్య అయిన వాసంతీ దేవికి, ఇంకా ఇతరులకు రాసిన ఉత్తరాలు ఆయన నాయకుని మరణం ఆయన హృదయంలో ఎంతలోతైన గాయాన్ని కలుగ జేసిందీ తెలియజేస్తాయి. భారత ప్రజల, ముఖ్యంగా తండ్రిలేని బిడ్డలైపోయిన, దిక్కులేని వాళ్ళైపోయిన భారత యువతీ యువకుల ధైర్యాన్ని నిలబెట్టటానికి బెంగాలు ప్రజాజీవితంలో దేశబంధుకు వున్న స్థానాన్ని స్వీకరించమని సుభాను చంద్రుడు ఆ ఉత్తరాలలో వాసంతీ దేవిని ప్రార్థించాడు.

తరువాత, అనగా 1925 -1927 సంవత్సరాల మధ్య, భారత రాజకీయ వాతావరణంలో ఏర్పడిన మాంద్యానికి మరొక కారణం వుంది. మహాత్మాగాంధీ భారత రాజకీయ రంగం నుండి ఆచరణాత్మకంగా వైదొలగటమే ఆ కారణం. తరువాత మహాత్ముడు తన కార్యక్రమాలను ఖాదీ ప్రచారానికి, దళితులలో నిర్మాణ కార్యక్రమాలను చేపట్టటానికి పరిమితం చేసుకున్నాడు.

చిత్తరంజన్ మరణానంతరం స్వరాజ్య పార్టీ క్రమేణా విచ్ఛేదమై

పోయింది. దేశబంధు క్రియాశీల నాయకత్వం భిన్న వర్గాలవారిని, మిత వాదులను, అతి వాదులను, మధ్యే వాదులను, స్వరాజ్య పార్టీ పతాక క్రింద సంఘటిత పర్చింది. ఆయన అస్తమయం వారిని, వారి సైద్ధాంతిక యిష్టాయిష్టాలననుసరించి నూతన గమ్యాలవైపుకు నడిపించింది.

సుభానుచంద్రుడు పూర్తి అనారోగ్యవంతుడుగా బర్మానుండి తిరిగి వచ్చాడు. కాగా తిరిగి ఆరోగ్యాన్ని పొంది, చురుకుగా మళ్ళీ ప్రజా జీవితంలో ప్రవేశించటం ఆయన ప్రధమ కర్తవ్యం అయింది. కాగా, అనారోగ్యం నుండి తేరుకొనేందుకు ఆయన తన కుటుంబ సభ్యులతో షిల్లాంగ్‌లో ఉన్నాడు. అప్పుడు ఆయన బెంగాలు లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యుడు. అయినా అఖిల భారత రంగంలో రాజకీయ పోరాటానికి స్థావరమైన కాంగ్రెసుమీదనే ఆయన దృష్టి అంతా కేంద్రీకరించబడింది.

దేశబంధు మరణానంతరం ఆయన వారసుడుగా జతీంద్ర మోహన్ సేన్ గుప్తాను మహాత్ముడు నియమించాడు. కాని బెంగాలు రాష్ట్ర కాంగ్రెసు పరస్పర వినాశకరమైన తగాదాల వలన చిన్నాభిన్నమైంది. కులతత్వం, మత వైషమ్యాలు, మళ్ళీ తలెత్తాయి. కార్మికులలో అశాంతి వ్యాపిస్తోంది. రాజకీయ రంగంలో నూతన భావాలతో నూతన శక్తులు ప్రవేశించాయి. ఆ సమయంలో, అనగా 1927వ సంవత్సరం చివర సుభాను చంద్రుడు బెంగాలు రాష్ట్ర కాంగ్రెసు కమిటీ అధ్యక్షుడుగా ఎన్నికయ్యాడు.

అప్పుడు భారతదేశంలో రాజకీయ వాతావరణం చాలా నిరుత్సాహకరంగా వుంది. వైస్‌రాయ్ ఇర్విన్ ఆ సమయంలో సైమన్ కమిషన్ నియామకాన్ని ప్రకటించాడు. దానికి సర్‌జాన్ సైమన్ నాయకుడు. ఇండియాలో ఆనాడు వున్న రాజకీయ పరిస్థితిని సమీక్షించి, రాజ్యాంగ సంస్కరణలను సూచించడం ఆ కమిషన్ బాధ్యత. ఆ కమిషన్ సభ్యులందరూ తెల్లవాళ్ళే. అప్పుడు ఇంగ్లండు టోరీల పాలనలో వుంది. లేబర్ పార్టీ తిరిగి అధికారాన్ని చేపట్టకముందే, ఇండియా సమస్యను పరిష్కరించివెయ్యాలని టోరీల కోరిక. కాగా భారత జాతీయ కాంగ్రెస్ ఆ కమిషన్ నియామకానికి తీవ్రంగా స్పందించింది. ఇండియా భవిష్యత్తును నిర్ణయించే హక్కు బ్రిటిష్ పార్లమెంటుకు వుందని గుర్తించటానికి భారత ప్రజానీకం నిరాకరించింది. కాగా కాంగ్రెసు వెనుకా ముందూ ఆలోచించకుండా, ఎటువంటి కాలయాపన చెయ్యకుండా, సహజంగా

సైమన్ కమిషన్‌ను బహిష్కరించమని దేశానికి పిలుపు యిచ్చింది.

1926లో భారతదేశం మతపరమైన ఘర్షణలతోను, ఉద్రిక్తతతోను నిండిపోయింది. తరువాత పరిస్థితి కొద్దిగా మెరుగైంది. నవంబరు నెలలో ఒక ఐక్యతా సమావేశం జరిగింది. తరువాత అఖిల భారత ముస్లిం లీగ్ కలకత్తాలో సమావేశమైంది. ఆ తరువాత కాంగ్రెసు వార్షిక మహాసభ మద్రాసులో జరిగింది. అది 1926 డిసెంబరు నెల. "ప్రతి దశలోను, ప్రతిరూపంలోను" సైమన్ కమిషన్‌ను బహిష్కరించటానికి ఆ సభ నిర్ణయం తీసుకుంది. అంతేకాదు, ఇండియాకొక రాజ్యాంగాన్ని రచించే ఏర్పాటు చెయ్యటం కోసం ఒక అఖిలపక్ష సమావేశాన్ని ఏర్పాటు చెయ్యాలనే ప్రతిపాదనను కూడా మద్రాసు కాంగ్రెసు సభ ఆమోదించింది. అక్కడ ఆగకుండా ఇండియా ప్రజల గమ్యం పూర్తి జాతీయ స్వాతంత్ర్యాన్ని సాధించటంగా ఆ సభ నిర్వచించింది. ఇండియాలో నూతనంగా ఆవిర్భవించుచున్న యువశక్తి ఆ రోజు నుండి కాంగ్రెసు విధానాన్ని స్పష్టంగా ప్రభావితం చేయటం ప్రారంభమైంది. కాగా తిరుగుబాటు చేస్తున్న అతివాదుల ప్రతినిధులకు కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గంలో ప్రాతినిధ్యం లభించటం ప్రారంభమైంది. జవహర్‌లాల్ నెహ్రూ, సుభాస్ చంద్రబోస్, షుయాబ్ కురేషి కాంగ్రెసు ప్రధాన కార్యదర్శు లయ్యారు. కాంగ్రెసుకు ఒక నూతనమైన గమ్యం గోచరించింది.

1928 ఫిబ్రవరిలో సైమన్ కమిషన్ ఇండియాలో ప్రవేశించిన రోజున భారతదేశం భారత జాతీయ కాంగ్రెసు అధ్వర్యాన దుకాణాలను మూసివేసి తన అసమ్మతిని తెలియచేసింది. సుభాసు నాయకత్వాన బెంగాలు ఒక అడుగు ముందుకు వేసి బలమైన బ్రిటీష్ వస్తు బహిష్కార ఉద్యమాన్ని నిర్వహించింది. మే నెలలో సబర్మతి ఆశ్రమంలో సుభాసుచంద్రుడు మహాత్ముని కలిశాడు. నివృత్తినుండి బయటపడమని అయనను ప్రార్థించాడు. మళ్ళీ భారతదేశానికి నాయకత్వం వహించమని అర్థించాడు. సాధ్యమైనంత విస్తృత పరిధిలో భారతదేశాన్ని పోరాట మార్గంలో నడిపించమని ప్రార్థించాడు. గాంధీజీ స్పందించలేదు.

ప్రజాదరణగల ప్రతిఘటనను ఎదుర్కొంటూనే సైమన్ కమిషన్ ఇండియాలో పర్యటించగా, అఖిలపక్ష మహాసభ 1928 మార్చిలో ఒకసారి, మే నెలలో ఒకసారి సమావేశమై పండిట్ మోతీలాల్ నెహ్రూ అధ్యక్షతన

ఒక చిన్న కమిటీని నియమించింది. అందులో సుభాసు చంద్రుడు కూడా ఒక సభ్యుడు. ఇండియా రాజ్యాంగానికి మౌలికమైన పునాది ఎలా ఉండాలి అనే విషయంలో ఆ కమిటీలోనే భిన్నాభిప్రాయాలున్నాయి. అందులో వున్న అల్ప సంఖ్యాక వర్గంలో సుభాసు ఒకరు. ఈ వర్గం ఇండియాకు కావలసింది పరిపూర్ణ స్వాతంత్ర్యం కాని అధినివేశ ప్రతిపత్తి కాదని నిర్ద్వంద్వంగా చెప్పింది. మోతీలాల్ కమిటీ నూతన రాజ్యాంగ సూత్రాలను వినుగు, విరామం లేకుండా రూపొందించుతూ ఉండగా, సుభాసు చంద్రుడు దేశం నలుమూలలా విస్తృతంగా పర్యటించడం ప్రారంభించి, పూనే నగరం చేరాడు. అక్కడ ఒక రాజకీయ మహాసభకు అధ్యక్షత వహించుతూ, రాజకీయ పార్టీల నిర్మాణం, కార్యక్రమం, కాంగ్రెసు ఆచరణలో పెట్టవలసిన పోరాట విధానం మొదలగు వాటిని గురించి తన సొంత భావాలను ఉపదేశించటం ప్రారంభించాడు. కార్మిక వర్గాన్ని కాంగ్రెసు సంఘటిత పర్చాలన్నాడు. స్త్రీలను, యువతీ యువకులను, విద్యార్థులను కూడ వారి వారి సంఘాలలో సంఘటిత పర్చాలన్నాడు. ఆయా సంఘాలద్వారా వాళ్ళు వాళ్ళ అభిప్రాయాలను ప్రకటించటం మాత్రమే కాకుండా దేశం కోరికలను కూడా మొత్తంగా ప్రచారంలోకి తేవచ్చునని సుభాసు చంద్రుడు భావించాడు.

మోతీలాల్ కమిటీ కొంతవరకు మత సామరస్యాన్ని సాధించ గల్గింది. కాని భారతదేశానికి అధినివేశ ప్రతిపత్తి కావాలనే ప్రతిపాదన జవహర్లాల్, సుభాసువంటి యువ వామపక్ష జాతీయ వాదులకు నచ్చలేదు. అయినప్పటికీ వారు జాతీయ పోరాట శక్తుల ఐక్యతను బలహీనపర్చ కూడదనే భావంతో, జాతీయ పోరాట వేదిక అయిన కాంగ్రెసును బహిరంగంగా చీల్చ కూడదని నిర్ణయించారు. అదే సమయంలో భారత దేశానికి తక్షణం సంపూర్ణ స్వాతంత్ర్యం కావాలనే తమ నినాదానికి ప్రచారం యివ్వటానికి వారి సొంత వేదిక నొకదానిని ఏర్పాటు చేసుకున్నారు. తదనుసారం జవహర్లాల్, సుభాసు చంద్రుల ఉమ్మడి నాయకత్వాన ఢిల్లీలో (1928 నవంబరు) స్వతంత్ర భారత సంఘం (ఇండిపెండెన్స్ ఆఫ్ ఇండియా లీగ్) ప్రారంభమైంది. ఆ సంఘానికి భారతదేశం పలు ప్రాంతాలలో శాఖలు కూడా ఏర్పడ్డాయి. అయినప్పటికీ జవహర్లాల్, సుభాసులు జాతీయ కాంగ్రెసు ప్రధానకార్యదర్శులుగానే కొనసాగారు.

ఆ స్వతంత్ర భారత సంఘం నినాదం విద్యార్థి ఉద్యమంలో బాగా ప్రతిధ్వనించింది. బెంగాలు రాష్ట్రం అంతటా, ముఖ్యంగా కలకత్తా నగరంలో విద్యార్థులు సైమన్ కమిషన్‌కు వ్యతిరేకంగా విజృంభించి ఎన్నో బాధలకు లోనయ్యారు, ఎన్నో త్యాగాలను చేశారు. అప్పుడు విద్యార్థులు వారి హక్కులను రక్షించుకోవటానికి, వాటికోసం పోరాడటానికి వారిదంటూ ఒక సంఘాన్ని ఏర్పాటు చేసుకోవలసిన అవసరం ఏర్పడింది. జవహర్‌లాలు, సుభాసులు, ఇద్దరూ ఆ పరిణామాన్ని బాగా ప్రోత్సహించారు. 1928 ఆగస్టులో కలకత్తా నగరంలో అఖిల బెంగాలు విద్యార్థుల మహా సభ జరిగింది. జవహర్‌లాల్ నెహ్రూ ఆ సభకు అధ్యక్షత వహించాడు. తరువాత విద్యార్థుల సంఘాలు బెంగాలు అంతటా ఏర్పడ్డాయి. క్రమేణా విద్యార్థి సంఘాలు ఇండియా అంతటా, అన్ని రాష్ట్రాలలోను ఏర్పడ్డాయి.

ఆ సంవత్సరం గడిచిన కొలది ఇండియాలో రాజకీయ చైతన్యం త్వరితగతిని, పెరుగుతూనే వుంది. అది శ్రామిక వర్గాన్ని కూడా ప్రభావితం చేసింది. అంతకుముందే కలకత్తాకు దగ్గరలో ఖరగ్‌పూర్ రైల్వే కార్మికులు సమ్మె చేశారు. 1928లో టాటా స్టీల్ వర్క్సు కంపెనీ కార్మికులు (జెంషెడ్‌పూరు) సమ్మె చేశారు. సుభాసు కార్మికుల కోరికలను, ఉద్యమాలను బలపర్చాడు. టాటా స్టీల్ వర్క్సు కార్మికుల సమ్మె సుభాసుకు కార్మికోద్యమంలో ప్రవేశాన్ని కల్పించింది. తరువాత బొంబాయి జౌళి కార్మికులు సమ్మె, కలకత్తా దగ్గర లిలూవా రైల్వే కార్మికుల సమ్మె, యింకా ఎన్నో సమ్మెలు ఇతర చోట్ల వరుసగా జరిగాయి.

యువతీ యువకులను సంఘటిత పరచవలసిన అవసరాన్ని కూడా సుభాసు గమనించాడు. మొదటి అఖిల భారత యువజన కాంగ్రెసు మహాసభ కలకత్తాలో 1928 డిసెంబరులో జరిగింది. సుభాసు ఆ సభ ఆహ్వాన సంఘం అధ్యక్షుడు. బొంబాయికి చెందిన నాయకుడు కె.ఎఫ్. నారిమన్ ఆ సభకు అధ్యక్షత వహించాడు. వికాసం, విచారణ శీలం, విజ్ఞానం, సంస్కరణను వ్యతిరేకించే శక్తులతో పోరాడకుండా ఉదాసీనతను ప్రదర్శించటానికి బదులుగా, యువతీ యువకులు క్రియాశీలతను, ఆధునికతా వాదాన్ని ఆరాధించాలని సుభాసు తన ఉపన్యాసం ద్వారా ఆ సభకు హాజరైన యువతీ యువకులు, విద్యార్థులకు ఉద్బోధించాడు.

మనం కలలుగంటున్న నవభారత దేశాన్ని నిర్మించుకొనేందుకు యువతీ యువకులు ఆధునిక భావాలను, పద్ధతులను ఆహ్వానించాలని, అమలు జరపాలని, సుభాను వారికి పదే, పదే, విజ్ఞప్తి చేశాడు.

# 12

1928వ సంవత్సరపు భారత జాతీయ కాంగ్రెసు వార్షిక మహాసభ పండిట్ మోతీలాల్ అధ్యక్షతన కలకత్తాలో జరిగింది. ఆ సభకు హాజరైనంత మంది స్వాతంత్ర్య సమరయోధులు ఏ కాంగ్రెసు వార్షిక సభకూ అంతకు ముందు హాజరుకాలేదు. ఆ సభను నిర్వహించటానికి చేసిన ఏర్పాట్లు కూడా బ్రహ్మాండమైన స్థాయిలో వున్నాయి. ఆ మహా సభ ముగిసేటప్పటికి సుభాసు చంద్రుడు నాటి జాతీయోద్యమంలో యువకుల, అతివాద శక్తుల ప్రధాన ప్రతినిధిగా బయటపడి, గుర్తింపు సంపాదించుకున్నాడు. ఆయన కాంగ్రెసు సేవాదళం అధిపతి కూడా. ఆ దళాన్ని నిర్మించింది, దానిని సైనిక పద్ధతిలో శిక్షణ యిచ్చింది, దానికి సైనిక క్రమశిక్షణా సూత్రాలను వర్తింపజేసింది సుభాసు చంద్రుడే.

నిర్మాణ రీత్యా ఆ సేవాదళంలో చాలా విభాగాలున్నాయి. మోటార్ సైకిల్ విభాగం, ఆశ్విక దళం, మహిళా దళం కూడా ఆ సేవా దళంలో విభాగాలుగా ఉండటం విశేషం. సుభాసు ఆ సేవాదళం ప్రధాన అధిపతిగా ఒకే రకమైన పూర్తి సైనిక దుస్తులను ధరించి ఆ సేవా దళంచేసే కవాతును తనిఖీ చేస్తున్నప్పటి దృశ్యం కన్నుల పండువుగా ఉండేది. ఆ విధంగా భారత జాతీయోద్యమంలో సుభాసు ఒక నూతన అంశాన్ని ప్రవేశపెట్టాడు. అది జాతీయోద్యమ కార్యకర్తలలో సైనిక క్రమశిక్షణను నెలకొల్పటానికి తోడ్పడింది. కాగా 1928లో ఒక కలగా కన్పించిన దృశ్యం రెండవ ప్రపంచ యుద్ధం కాలంలో ఆగ్నేయాసియాలో నిజరూపం దాల్చింది.

ఆ కాంగ్రెసు మహాసభలో చర్చకు వచ్చిన ప్రధాన రాజకీయ తీర్మానం మీద వృద్ధులకు యువకులకు మధ్య విభేదం పొడచూపింది. భారతదేశం గమ్యం అధినివేశ ప్రతిపత్తి అనీ, దానిని 12 నెలల్లో బ్రిటిష్ ప్రభుత్వం మంజూరు చెయ్యాలనీ ఆ తీర్మానం పాఠంలో వుంది. దానిని ప్రతిపాదించింది మహాత్మా గాంధీ.

సుభాసు చంద్రుడు ఆ తీర్మానానికి ఒక సవరణను ప్రతిపాదించాడు.

భారతదేశం గమ్యం సంపూర్ణ స్వాతంత్ర్యం అని, అధినివేశ ప్రతిపత్తిని కోరటం అంతకుముందు సంవత్సరం మద్రాను కాంగ్రెను మహానభలో ఎత్తిన సంపూర్ణ స్వాతంత్ర్య పతాకాన్ని దించటమేననీ ఆ నవరణద్వారా సుభాను చంద్రుడు ఉద్ఘాటించాడు. భారత ప్రజానీకంలో, ముఖ్యంగా భారత యువతీ యువకులలో ఒక నూతన మనస్తత్వాన్ని, చైతన్యాన్ని సృష్టించటానికి 'భారతదేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యం కావాలి' అని ఉద్ఘాటించటం అవసరమని సుభాను నొక్కి చెప్పాడు. తను ఎంతో బాధ్యతగా ఆలోచించిన తరువాతనే ఆ నవరణను ప్రతిపాదించినట్లు ప్రకటించాడు. అంతే కాదు, తన నవరణ ఫలితంగా కాంగ్రెనులో విభజన అనివార్యం అయితే, తను ప్రాతినిధ్యం వహిస్తున్న నూతన తరం యువ నాయకత్వం ఆ విభజనకు సిద్ధంగా ఉందని బల్లగుద్ది మరీ చెప్పాడు. సుభాను నాటి అంతర్జాతీయ పరిస్థితిని గురించి కూడా వివరించాడు. మద్రాను తీర్మానం అంతర్జాతీయ రాజకీయాలలో భారతదేశానికి నూతన ప్రతిష్ఠను ఆర్జించి పెట్టిందనీ, ఆ ప్రతిష్ఠను వదులుకోవటానికి భారత యువతరం అంగీకరించలేదనీ కూడ సుభాను ప్రకటించాడు. ఇంకా ఐరోపా, ఆసియా రాజకీయాలు, సామ్రాజ్యవాద శక్తుల మధ్య ఏర్పడిన మారణాయుధాల ఉత్పత్తి పోటీ, ప్రపంచాన్ని ఒక దహనకాండవైపుకు లాక్కొని పోతున్నాయని వివరించాడు. ఆ సమగ్ర అంతర్జాతీయ పరిస్థితిని దృష్టిలో ఉంచుకొని, భారతదేశం ధైర్యంగా తక్షణ, సంపూర్ణ స్వాతంత్ర్యం కోసం నిలబడి పోరాడాలని సుభాను చంద్రుడు ఉద్ఘాటించాడు. సుభాను నవరణకు అనుకూలంగా 973 ఓట్లుపడగా, వ్యతిరేకంగా 1350 ఓట్లు పడ్డాయి. సుభాను నవరణ వీగిపోయింది.

నమయోచితంగా నడవాలని నూచించే కలకత్తా కాంగ్రెను తీర్మానం విలువైన కాలాన్ని తినేసిందనీ, 'ముందుకు దూకండి' అని పిలుపు వస్తుందని ఆశించిన వాళ్ళను నిరుత్సాహ పర్చిందనీ, నుభాను భావించాడు. అయినా అతివాదుల పక్షం కాంగ్రెసులో తగినంత బలాన్ని నంపాయించుకుందనే విషయం సుభాను చంద్రునికి కారు చీకట్లో కాంతిరేఖ వలె కన్పించింది.

అదే నమయంలో 1929 డిసెంబరు 31 లోపల ఇండియాకు అధినివేశ ప్రతిప్రత్తిని కల్గిస్తూ బ్రిటిష్ ప్రభుత్వం ప్రకటించకపోతే, 1930

జనవరి 1వ తేదీన తను సంపూర్ణ స్వాతంత్ర్య కావాలనే వాళ్ళల్లో చేరిపోగలనని మహాత్ముడు ప్రకటించాడు. ఆ విధంగా గాంధీ సమయం ఆసన్నంకాగానే స్వాతంత్ర్య సమరంలో దూకటానికి సిద్ధమౌతున్నాడని స్పష్టమైంది.

ఇది ఇలా ఉండగా 1929లో కొన్ని నూతన సంఘటనలు జరిగాయి. ఆ సంఘటనలు ప్రజల ధైర్యోత్సాహాలను నిలబెట్టాయి. ఈ సంఘటనలలో మొదటిది ఉత్తర హిందూస్థానంలో విప్లవకర చర్యల విజృంభణ, రెండవది 1928లో లాలా లజపత్‌రాయ్‌పైన దాడి జరిపించిన బ్రిటిష్ పోలీసు ఆఫీసరు హత్యకాగా, మూడవది భగవత్ సింగ్, బటుకేశ్వర దత్తులు కలిసి ఢిల్లీ శాసన సభ మందిరంలో బాంబును విసరటం. ఈ ఘటనల తరువాత ప్రజల ఆసక్తిని రేకెత్తించిన సంఘటన లాహోరు కుట్రకేసు ఇది భారతదేశ భక్తుల మీద అన్యాయంగా బనాయించిన నేరం, కాగా ఇది వారికి ఎంతో సానుభూతిని సంపాదించింది.

సర్దార్ భగత్ సింగ్ నాటి పంజాబు యువజన ఉద్యమానికి నాయకుడు. ఆ ఉద్యమం నవ జవాన్ భారత్ సభ అనే సంస్థ ఆధ్వర్యంలో సాగింది. ఆ సంస్థ కార్యకలాపాలు కొంతకాలం సాగిన తరువాత సుభాసు చంద్రుడు ఆ సంస్థతో గట్టి సంబంధాలు ఏర్పరచుకున్నాడు.

ఇది ఇలా ఉండగా సుభాసు చంద్రుని నాయకత్వాన పనిచేసిన కలకత్తా కాంగ్రెసు సేవాదళంలో మేజర్ హోదాగల సేవాదళాధిపతియైన జతీంద్రనాథ్ దాసు లాహోర్ కుట్ర కేసు నిందితులలో ఒకరయ్యారు. విచారణ నిమిత్తం బంధించబడిన ఖైదీలను రాజకీయ ఖైదీలుగా పరిగణించబడాలని డిమాండు చేస్తూ, ఆయన ఆమరణ నిరాహార దీక్ష పూనారు. ప్రభుత్వం ఆయన కోరికను ఆమోదించటానికి నిరాకరించింది. అయినా ఆయన తన నిరాహార దీక్షను ముగించలేదు. కాగా ఆయన (జతీంద్ర నాథ్ దాసు) 13-9-1929న జైలులోనే మరణించారు. జతీంద్రనాథ్ దాసు ఆత్మ బలిదానం సుభాసును ఎంతో ఉత్తేజపరిచింది. ఆ ఆత్మ బలిదానం విద్యార్థి, యువజన సంఘాలను ముందుకు నడిపించింది. వెనువెంటనే బెంగాలులో ఎన్నో జిల్లా విద్యార్థి సభలు, యువజన మహా సభలు జరిగాయి. భారతదేశంలో ఇతర రాష్ట్రాలలో కూడ విద్యార్థి, యువజన ఉద్యమాలు ఊపును అందుకున్నాయి.

ఈ ఉద్యమాలు నిర్వహించిన సభలలో అత్యధిక సభలకు సుభాసు చంద్రుడే అధ్యక్షత వహించాడు. పంజాబు విద్యార్థుల మహాసభ ప్రారంభ సమావేశానికీ, సెంట్రల్ ప్రావిన్సెస్ యువజన మహా సభకు, బీహారు విద్యార్థుల మహాసభకు సుభాసు అధ్యక్షత వహించాడు. జవహర్‌లాల్ నెహ్రూ, కమలా దేవి ఛటోపాధ్యాయ, సరోజినీ నాయుడు, మదన మోహన మాలవ్యా ప్రభృతులు నాటి సభల నిర్వహణలో ప్రముఖ పాత్ర వహించారు.

యువతీ యువకులను, విద్యార్థులను సంబోధించుతూ, సుభాసు దేశభక్తి, నిజాయితీ, త్యాగం, ధైర్యం, సంపూర్ణ స్వాతంత్ర్యం కావాలనే నినాదానికి ధట్టిగా అంటిపెట్టుకొని ఉండవలసిన అవసరాన్ని గురించి నొక్కి చెప్పాడు. ఇంకా తన పలుకులను ఉత్సాహంగా విన్న యువకులను ఉద్దేశించి మాట్లాడుతూ, సుభాసు, దేశ సమస్యను పరిష్కరించవలసిన బాధ్యత వాళ్ళదే కాబట్టి సమకాలికులంటే ఎక్కువ దూరదృష్టిని కలిగి ఉండవలసిన బాధ్యత, ప్రజాభిప్రాయానికొక నిర్దుష్టమైన రూపాన్ని యివ్వవలసిన బాధ్యత కూడా వాళ్ళదేనని ఉద్ఘాటించాడు.

1929లో మరొక ఘటన సంభవించింది. అంతకు ముందు సంవత్సరమే ఆరంభమైన శ్రామిక వర్గపు అశాంతి పెరిగింది. మీరట్ కుట్ర కేసు పేరుతో ముగ్గురు ఆంగ్లేయులతో సహా ఒక ట్రేడ్ యూనియన్ ఉద్యమ నాయకుల బృందం విచారణ నిమిత్తం నిర్బధించబడింది. ఆ నిందితుల రక్షణ కమిటీ కార్యక్రమాలలో చురుకుగా పాల్గొన్న సుభాసు చంద్రుడు ఆ ఖైదీలను చట్ట రీత్యా రక్షించటానికి ఎంతో చురుకుగా పనిచేశాడు.

1929లో ఇండియాలో కొన్ని రాజకీయ ఘటనలు సంభవించిన కాలంలోనే విస్తృతమైన రాజకీయ ఉద్యమాన్ని ఇండియా ప్రారంభించి ఉండవలసిందని సుభాసు భావించాడు. బెంగాలు లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో మంత్రులకు ఎన్నోసార్లు పదవీ భంగం చేయగల్గిన కాంగ్రెసుకు ఆనాడు పరిస్థితి చాలా అనుకూలంగా వుంది. బెంగాలు గవర్నర్ ఆ కౌన్సిల్‌నే రద్దు చేసి, నూతన ఎన్నికలను ప్రకటించగా, కాంగ్రెసు పెరిగిన బలంతో తిరిగి కౌన్సిల్‌లో ప్రవేశించింది. భారత జాతీయ కాంగ్రెసుకు చెందిన సుభాసు చంద్రుడు, ఆయన అనుచరులకు, ప్రజలను సంఘటిత

పర్చుటంలోగల సామర్ధ్యానికి సమానమైన సామర్థ్యం వారికి పత్రికారచన రంగంలో కూడా వుంది. ఇండియా ప్రభుత్వం నిర్వహణలో వున్న తూర్పు ఇండియా రైల్వే కంపెనీకి పరువునష్టం కల్గించే విషయాలను ప్రచురించిందనే నేరంమోపి, ఒకనాడు ప్రభుత్వ న్యాయస్థానం 'ఫార్వర్డ్' అనే కాంగ్రెసు పత్రికపైన భరింపశక్యం కానటువంటి పెద్ద మొత్తాన్ని జరిమానాగా విధించగా, ఆ పత్రికను మూసివేసి, మరునాడు ఉదయమే కాంగ్రెసు 'లిబర్టీ' అనే పేరుతో ఒక కొత్త వార్తాపత్రికను తీసికొని వచ్చింది. ఆ విధంగా కాంగ్రెసు తన ముఖ్య ప్రసార సాధనాన్ని పోగొట్టుకోకుండా నిలబడింది.

1929 ఉత్తరార్ధంలో మహాత్ముని ప్రేరణతో కాంగ్రెసు ఒక తీర్మానాన్ని ఆమోదించింది. శాసన సభలనుండి రాజీనామా చేయమని ఆ తీర్మానం కాంగ్రెసువాదులను కోరింది. ఎన్నికలలో పాల్గొనమని అంతకు రెండు నెలల ముందు కాంగ్రెసువారిని ప్రోత్సహించిన పండిట్ మోతీలాల్ నెహ్రూ కూడా ఆ ప్రతిపాదనను బలపర్చాడు. కాని జతీంద్ర మోహన్ సేన్ గుప్తా, సుభాసు చంద్రుల వ్యతిరేకత వలన ఆ తీర్మానం రద్దు చేయబడింది. కాగా ఆ విషయాన్ని గురించి ఆలోచించటం అదే సంవత్సరం డిసెంబరులో లాహోర్‌లో జరుగనున్న కాంగ్రెసు మహా సభ జరిగే వరకు వాయిదా వేయబడింది.

లాహోర్ కాంగ్రెసు మహాసభ అధ్యక్షుని ఎన్నిక సమయం ఆసన్నం కాగానే రాష్ట్ర కాంగ్రెసు కమిటీలలో అత్యధిక సంఖ్య మహాత్ముని పేరును సూచించింది. కానీ మహాత్ముడు జవహర్‌లాల్‌కు అనుకూలంగా పోటీనుండి తప్పుకున్నాడు.

ఇది ఇలా ఉండగా ఆనాడు ఇంగ్లండును పాలిస్తున్న లేబర్ పార్టీ. ప్రధానమంత్రి అయిన రామ్సే మేగ్డొనాల్డ్ ప్రోత్సాహంతో ఇండియా వైస్‌రాయ్ ఇర్విన్ 1929 అక్టోబరు నెలలో ఒక ప్రకటన చేశాడు. రాజ్యాంగం రీత్యా ఇండియా అధినివేశ ప్రతిపత్తిని సాధించటం సహజమైన విషయమనీ, కాగా సైమన్ కమిషన్ నివేదిక ప్రచురింపబడగానే, లండన్‌లో ఒక రౌండ్ టేబిల్ సభ జరుగుతుందనీ ఆ ప్రకటన తెలియజేసింది. ఆ నవంబరులో ఇండియాలోగల విభిన్న రాజకీయ పక్షాల నాయకులు సమావేశమై; వైస్‌రాయ్ ప్రకటనను పరిశీలించి, ఒక పత్రాన్ని ప్రకటించారు. దానిమీద

ఆ రాజకీయ పక్షాల నాయకులలో అత్యధిక సంఖ్యాకులు సంతకాలు చేశారు. అధినివేశ ప్రతిపత్తి ఇండియాకు కలుగచేయటానికి కావలసిన రాజ్యాంగ సవరణలకు రూపు రేఖలు యిచ్చే కృషిలో బ్రిటిష్ ప్రభుత్వానికి తమ సహకారం ఉంటుందని అందులో స్పష్టం చేశారు. దానిమీద సంతకాలు చేసిన వారిలో మహాత్మాగాంధి, పండిట్ మోతీలాల్ నెహ్రూ, పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ, సర్దార్ వల్లభ భాయి పటేల్, రైట్ ఆనరబుల్ వి.యస్. శాస్త్రి, శ్రీ తేజ్ బహదూర్ సప్రూ, మొదలగు వారున్నారు. అధినివేశ ప్రతిపత్తిని ఆమోదించే ఆ పత్రాన్ని వ్యతిరేకిస్తూ, అలాగే రౌండ్ టేబిల్ సభలో పాల్గొనాలనే ప్రతిపాదనను వ్యతిరేకిస్తూ, సుభాను చంద్రుడు, సైఫుద్దీన్ కిచ్లూ, ఇంకా అబ్దుల్ బారీ ఒక ప్రత్యేక ప్రకటన జారీ చేశారు. ఆ రౌండ్ టేబిల్ సభలో పాల్గొనే ఇండియా ప్రతినిధులను ఇండియా ప్రజలు ఎన్నుకున్నప్పుడే, అది నిజమైన రౌండ్ టేబిల్ సభ అవుతుందని కూడా వారు ప్రకటించారు. ఇండియా ప్రతినిధులను బ్రిటిష్ ప్రభుత్వం ఎంపిక చెయ్యకూడదని కూడ వారు డిమాండు చేశారు. ఇంకా ఆ బ్రిటిష్ ప్రభుత్వ ప్రతిపాదన ఒక ఉచ్చు అనీ, అది ఐర్లండ్‌లో బ్రిటన్ ఆడిన నాటకం వంటిదేననీ, ఐరిష్ సిన్‌ఫిన్ పార్టీ బ్రిటన్ అంతర్యాన్ని గ్రహించి, బ్రిటన్ ప్రతిపాదనను తోసిపుచ్చిందనీ, సుభాను ప్రభృతులు జారీ చేసిన ప్రకటన హెచ్చరించింది.

ఆ డిసెంబరు నెలలోనే గాంధీ, మోతీలాల్ నెహ్రూలు ఇండియా వైస్‌రాయ్‌ని కలిపి, ఇండియాకు అధినివేశ ప్రతిపత్తిని మంజూరు చెయ్యవలసినదిగా కోరారు. కాని ఆ కోరిక ఫలించలేదు. కాగా ఆ నాయకులిరువురూ, నిరాశతో, రిక్తహస్తాలతో తిరిగివచ్చి, లాహోర్ కాంగ్రెసు మహా సభకు హాజరయ్యారు.

# 13

చరిత్రాత్మకమైన లాహోర్ కాంగ్రెసు మహాసభ జవహర్లాల్ నెహ్రూ అధ్యక్షతన 1929 డిసెంబరులో జరిగింది. ఆ సభలో భారతదేశానికి కావలసింది సంపూర్ణ స్వాతంత్ర్యం అని వక్కాణించే తీర్మానాన్ని ప్రతిపాదించటానికి మహాత్మా గాంధీయే ముందడుగు వేశాడు. కాగా డిసెంబరు అర్థరాత్రి పండ్రెండు గంటలు కొట్టగానే, రావీనది ఒడ్డున ఒక పెద్ద జన సమూహం ఎదుట ఉత్సాహభరితుడు, యువ నాయకుడు అయిన జవహర్‌లాల్ నెహ్రూ భారత స్వాతంత్ర్య పతకాన్ని ఆవిష్కరించాడు. భారత ప్రజానీకానికి ఆ సంఘటన ఎంతో ఉత్సాహాన్ని, నూతన సందేశాన్ని యిచ్చింది.

సుభాను బోసు మరొక అడుగు ముందుకు వేశాడు. అది ఆయన కలకత్తా కాంగ్రెసులో చేసిన ప్రతిపాదనకంటే ఒక మెట్టు తీవ్రమైనది. భారతీయుల జాతీయ అవసరాన్ని తీర్చేటట్లు బ్రిటిష్ ప్రభుత్వాన్ని ఒత్తిడి చేయగల నిజమైన, నిశ్చయాత్మకమైన కార్యక్రమాన్ని కాంగ్రెసు ఆచరణలో పెట్టాలని వాదించాడు. ఆ కార్యక్రమాన్ని నిర్వచించటానికి అన్నట్లు, వెంటనే భారతదేశంలో కాంగ్రెసు సమానాంతర ప్రభుత్వాన్ని ఏర్పాటు చెయ్యాలనీ, దానిని ఏర్పాటు చేయటానికి నాందిగా యువతీ యువకులను, కార్మికులను, కర్షకులను సంఘటితపర్చాలనీ చెప్పుతూ సుభాను ఒక తీర్మానాన్ని ప్రతిపాదించాడు. శాసన సభల నుండి బయటకు రమ్మని పిలుపు యివ్వటం వ్యతిరేక వైఖరిని ప్రదర్శించటం మాత్రమే ఔతుందనీ, అది ఆనాటి రాజకీయ పరిస్థితిని ఎదుర్కొనటానికి తగినంత బలమైన చర్యకాదనీ సుభాను చంద్రుడు భావించాడు.

వామపక్ష కాంగ్రెసువాదులు అదే మహాసభలో మరొక తీర్మానాన్ని ప్రతిపాదించారు. దాని ప్రకారం గాంధీజీ ప్రతిపాదించిన సాంఘిక నిర్మాణ కార్యక్రమం కాంగ్రెసు శాఖల చేతులలోను, కాంగ్రెసువాదుల చేతులలోను ఉండాలి. కాని అది గాంధీజీ ప్రతిపాదించినట్లు స్వయంపాలక సంస్థ

చేతులలో ఉండకూడదు.

చివరకు ఆ రెండు తీర్మానాలు వీగిపోయాయి. ఆ సందర్భంలో లాహోర్ కాంగ్రెసు మహాసభను ఉద్దేశించి మాట్లాడుతూ "నాది సంపూర్ణ బహిష్కార ఉద్యమం. మీరు సంపూర్ణ బహిష్కార ఉద్యమంలో పాల్గొనటానికి సిద్ధంగా లేకపోతే, శాసనసభలను (కౌన్సిళ్ళను) మాత్రమే బహిష్కరించటం సత్ఫలితాలనివ్వదు." అని సుభాసు చంద్రుడు ఉద్ఘాటించాడు. ఇంకా "నేనొక తీవ్రవాదిని. మనకు చెందవలసినవన్నీ మనకు రావాలి. లేదా ఏమీ మనకు అవసరం లేదు. ఇదీ నా సిద్ధాంతం. ఇందులో రాజీకి తావులేదు" అని సుభాసు ఉద్ఘాటించాడు.

"రౌండ్ టేబిల్ సభ అనేది పరస్పరం యుద్ధం చేసుకుంటున్న రెండు రాజ్యాల మధ్య లేదా రెండు పరస్పర వ్యతిరేక శక్తుల నుండి సంపూర్ణ అధికారాలను పొందిన రాయబారుల మధ్య జరిగే సభ" అని రౌండ్ టేబిల్ సభ అనే సమాసాన్ని నిర్వచించి, "బ్రిటిష్ ప్రభుత్వ ప్రతినిధులతో చర్చించటానికి భారత ప్రజల నుండి సంపూర్ణ అధికారాలను పొందిన ప్రతినిధులను రమ్మని బ్రిటిష్ ప్రభుత్వం ఆహ్వానించిందా అని నేను మిమ్ములను అడుగుతున్నాను" అని కూడా సుభాసు చంద్రుడు కాంగ్రెసు నాయకత్వాన్ని నిలదీశాడు. "కార్మికులను, కర్షకులను, దళిత ప్రజలను సంఘటిత పరచనిదే సహాకార నిరాకరణోద్యమం జరగదు" అని ఆయన ఉద్ఘాటించాడు.

తత్ఫలితంగా కాంగ్రెసు మితవాదులు సుభాసు చంద్రునితోపాటు, శ్రీనివాస అయ్యంగారు వంటి ఇతర వామపక్ష నాయకులను కూడ కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గంలో లేకుండా చేశారు. కాంగ్రెసు సంస్థ సర్వోన్నత అధికార సంఘం ఏకాభిప్రాయంగల వారితో నిండి ఉండాలని గాంధీ భావించాడు. ఆ విధంగా ఉంటేనే, అధిష్ఠాన వర్గంలో తనకు అడ్డు ఉండదు కాబట్టి, గాంధీ తన ప్రణాళికల ప్రకారం భారత స్వాతంత్ర్యో ద్యమాన్ని నిర్వహించటం సాధ్యమౌతుందని భావించాడు.

ఇక్కడ ఒక సంఘటనను గురించి చెప్పాలి. ఇది బెంగాలు రాష్ట్రం. కలకత్తా కాంగ్రెసులో ఏర్పడిన కలహం, 1928లో గాంధీ ప్రతిపాదించిన అధినివేశ ప్రతిపత్తి తీర్మానానికి వ్యతిరేకంగా ఉండి, సంపూర్ణ స్వాతంత్ర్యమే భారతదేశం ధ్యేయం అంటూ సుభాసు చంద్రుడు సవరణను

ప్రతిపాదించినప్పుడు, జె.యం. సేన్‌గుప్తా బహిరంగంగాను బేషరతుగాను, మహాత్ముని తీర్మానాన్ని సమర్థించాడు. తత్ఫలితంగా బెంగాలు రాష్ట్ర కాంగ్రెసు కమిటీ ఎన్నికలకు ఒక నెలముందు కాంగ్రెసు నాయకత్వంలో ఏర్పడిన విభేదాలు తారాస్థాయికి చేరాయి. బెంగాలు కాంగ్రెసు కమిటీ నాయకత్వం కోసం తీవ్రమైన పోటీ జరిగింది. సుభాసు చంద్రుని వర్గం జయించింది. రాజకీయ సిద్ధాంతాలలో, విధానాలలో ఏర్పడిన విబేధాల ఫలితంగా కాంగ్రెసులో చీలిక ఏర్పడింది. ఆ అంతర్గత పోరాటం సేన్‌గుప్తా మరణించే వరకు (1933) కొనసాగింది. మొత్తంమీద బలమైన విప్లవకర శక్తుల అండతో, బెంగాలు రాష్ట్ర కాంగ్రెసులోని అత్యధికుల వర్గం, ఆయన రాజకీయ జీవిత కాలమంతా సుభాసు చంద్రుని బలపర్చింది.

తరువాత అనగా 1930 జనవరి ప్రారంభంలో భారతదేశం అంతటా జనవరి 26వ తేదీని స్వాతంత్ర్య దినంగా పాటించాలని కాంగ్రెసు కార్యనిర్వాహక, వర్గం ప్రకటించింది. భారతదేశం స్వాతంత్ర్యాన్ని గురించి ప్రతి భారతీయుడు చేయవలసిన ప్రతిజ్ఞ, ప్రకటనలను గురించి కూడా కాంగ్రెసు కార్య నిర్వహకవర్గం ఒక ప్రకటనను జారీ చేసింది. మొదటి స్వాతంత్ర్య దినోత్సవం అపూర్వమైన ఉత్సాహంతో జరిగింది.

అప్పుడే మహాత్ముడు తన ఉద్యమాన్ని ప్రారంభించవలసిన సమయం ఆసన్నమైంది. కాగా తన ఉద్యమాన్ని ప్రారంభించక ముందు కనీసం 'స్వాతంత్ర్య సారాంశాన్ని' యిచ్చినా తను తృప్తి పడగలనంటూ ఒక ప్రకటన చేసి మహాత్ముడు దేశం ఏమైపోతుందోనని భయపడుతున్న మితవాదుల భయాలను తొలగించాడు. అలాగే "ఒకసారి ప్రారంభమైన శాసనోల్లంఘనా కార్యక్రమం ఆఖరి సత్యాగ్రహి కూడా మరణించే వరకు లేదా జైలులో నిర్బంధించబడే వరకు ఆగదు" అని ప్రకటించి అతి వాదులకు కావలసిన హామీని యిచ్చాడు.

సుభాసు చంద్రుడు తన పోరాట కార్యక్రమాన్ని అమలు జరిపే నిమిత్తం "ప్రజాస్వామిక కాంగ్రెసు"ను స్థాపించాడు. కాని ఆయన తన కార్యక్రమంతో ముందడుగు వెయ్యక ముందే ఆయన నిర్బంధితుడయ్యాడు. ఆ విధంగా ఆయన లాహోర్ కాంగ్రెసు మహాసభ నుండి తిరిగి వచ్చి కలకత్తాలో కాలు పెట్టగానే ఆయనను ప్రభుత్వం నిర్బంధించింది. అంతే కాదు. ప్రభుత్వం ఆయనకు ఒక సంవత్సరం కఠిన కారాగార శిక్షను

కూడా విధించింది. కాగా అప్పుడు మహాత్ముని నాయకత్వాన చెలరేగిన విప్లవాత్మక సంఘటనలను బోనులో వున్న పులివలె జైలులో వున్న సుభాను చంద్రుడు బాధగా చూస్తూ కూర్చున్నాడు.

ఆ మార్చినెల ప్రారంభంలో మహాత్ముడు తన చర్మితాత్మక ప్రకటనను నాటి బ్రిటిష్ వైస్‌రాయ్ ఇర్విన్‌కి అందించాడు. అందులో బ్రిటిష్ వాళ్ళు చేసిన ఉప్పు చట్టాన్ని త్వరలో తను ధిక్కరించనున్నట్లు గాంధీ తెలియజేశాడు. తన వెంట తనచే ఎన్నిక చేయబడిన తన అనుచరులు ఉంటారని ఇర్విన్‌కు గాంధీ తెలియజేశాడు. ఈ ఘటనను వర్ణిస్తూ, తన పుస్తకం 'ఇండియా సమరం'లో "గాంధీ తీసికొనే నిర్ణయం, ఆయన విప్లవాత్మక నాయకత్వం సాధించిన పలు విజయాలలో ఒకటిగా శాశ్వతత్వం పొందుతుంది. ఆయన విజయాలు సంక్షోభ పరిస్థితులలో ఆయన రాజకీయ ప్రజ్ఞ ఎటువంటి ఉన్నత శిఖరాలకు ఎదగగలదో తెలియజేస్తుంది" అని సుభాను రాశాడు.

గాంధీ లేఖకు ఇర్విన్ చాలా సంక్షిప్తంగా సమాధానం యిచ్చాడు గాంధీ శాసనోల్లంఘనం చెయ్యటానికి నిర్ణయించుకున్నందుకు ఇర్విన్ తన విచారాన్ని తెలియచేశాడు. అప్పుడు మహాత్ముని చరిత్రాత్మకమైన దండి సంత్యాగ్రహం ప్రారంభమైంది. సముద్రతీరానగల దండి గ్రామంలో శాసనోల్లంఘనా కార్యక్రమాన్ని ప్రారంభించే నిమిత్తం ఆయన నిరాకరణోద్యమం ప్రారంభమైంది. వందలమంది కాల్పులకు గురయ్యారు, చాలామంది దుర్మరణం పాలయ్యారు.

ఆ విధంగా భారతదేశం అంతటా తిరుగుబాట్లు చెలరేగుతున్న సమయంలో, ఏప్రిల్ నెలలోనే చిటగాంగ్‌లో ఒక సంచలనాత్మకమైన విప్లవ సంఘటన జరిగింది. చావంటే భయపడని ఒక యువబృందం, సూర్యసేన్ అనే యువకుని నాయకత్వంలో ఒక ఆయుధాగారంపైన దాడి చేసింది. ఆయుధాలను చేజిక్కించుకుంది. కొండలలోకి పారిపోయింది. కొన్ని రోజులపాటు అక్కడ గెరిల్లా యుద్ధం జరిగింది. ఆ ప్రాంతంలో బ్రిటిష్ పరిపాలన అంతరించింది. కాని గెరిల్లా యుద్ధంలో విప్లవకారులలో అధిక సంఖ్యాకులు చనిపోయారు. మిగిలిన వాళ్ళు అజ్ఞాతవాసంలోకి వెళ్ళిపోయారు. అది సాకుగా బ్రిటిష్ సైన్యం బెంగాలు అంతటా దారుణమైన దమననీతిని అవలంబించింది.

అప్పుడు లేచిన నూతన ప్రజావెల్లువ, విప్లవ ఉద్యమం గాంధీజీ ఆశయాలకు అనుగుణంగా లేనిమాట నిజం. కాని ఆ ఆయుధగారాన్ని దోచుకోటానికి చేసిన ప్రయత్నం భారత స్వాతంత్ర్యోద్యమానికి నూతన సందేశాన్ని యిచ్చింది. శత్రువును బలంగా ఎదుర్కోవటం, శత్రువుతో బహిరంగంగా తలపడటం, అవసరం, సాధ్యం అనే భావాలు మొలకెత్తాయి. అందుకే ఆ సంఘటనను భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖిస్తారు. అది దేశభక్తి, సాహసం, త్యాగాలతో కూడిన ఒక అమరగాధ.

మహాత్మాగాంధీని మే నెల 5న నిర్బంధించారు. సుభాను చంద్రుడు అత్యుత్సాహంతో, సంతోషంగా, ఆ ఉద్యమ ప్రగతిని జైలు లోపల నుండే గమనించాడు. అప్పుడే కలకత్తా జైలులో ఒక దారుణం. తన అనుచరులతో సహా అహమ్మదాబాద్ నుండి దండి వరకు ఒక యాత్రను నిర్వహించాడు. ఆ యాత్ర ఆయన పాదం మోపిన గ్రామీణ ప్రాంతాలలో ప్రతి దానిని ఉత్తేజపరచడం మాత్రమే కాదు. ఆ యాత్ర యావత్తు భారతదేశాన్ని కూడా జాగృతం, చేసింది. భారతీయుల దేశభక్తినీ సంకల్ప బలాన్ని మహోన్నత శిఖరాలకు చేర్చింది.

ఆ సంవత్సరం ఏప్రిల్ 6న మహాత్ముడు ఉప్పు సత్యాగ్రహోద్యమం ప్రారంభించటానికి చిహ్నంగా చట్టాన్ని ధిక్కరించి, దండి సముద్ర తీరంలో ఒక ఉప్పు మడి నుండి కొంత ఉప్పును తన చేతిలోకి తీసుకున్నాడు. అదే సమయంలో అక్రమ చట్టాల పట్ల వ్యతిరేకత దేశం అంతటా ఓ పెద్ద సముద్రం అలవలె వ్యాపించింది. శాసనోల్లంఘనంతోపాటు, బ్రిటిష్ వస్తు బహిష్కరణ, రాజద్రోహ చర్యలను అరికట్టేందుకు చేసిన చట్టాన్ని ధిక్కరించటం, సారా అంగళ్ళ వ్యాపారాన్ని అడ్డగించటం, మొదలగు కార్యక్రమాలు దేశం అంతటా వ్యాపించాయి. మహాత్ముని పిలుపునందుకొని వందలు వేలమంది స్త్రీలు ఆ సత్యాగ్రహ ఉద్యమంలో దూకారు. వారి వెంట పురుషులు కూడా ఆ ఉద్యమంలో ప్రవేశించారు. స్త్రీలూ, పురుషులూ, ఎన్నో త్యాగాలు చేయ్యటం ప్రారంభించారు. అయితే ఏప్రిల్ నెలాఖరున ప్రభుత్వం అతి దారుణంగా సత్యాగ్రహుల మీద విరుచుకుపడింది. దేశం అంతటా భయోత్పాతాన్ని సృష్టించింది. ఆర్డినెన్సుమీద ఆర్డినెన్సులు జారీ చేసింది. కాంగ్రెసును చట్ట విరుద్ధ సంస్థగా ప్రకటించింది. వేలాదిమంది భారతీయులను జైళ్ళల్లో

కుక్కటానికి కొత్తజైళ్ళను ఏర్పాటు చేసింది. ఎన్నో రాష్ట్రాలలో పన్నుల చెల్లింపుల సంఘటన జరిగింది. ఆ సంఘటనలో సుభాను, సేన్‌గుప్తా, యింకా వారితోటి ఖైదీలు లాఠీ చార్జీకి గురయ్యారు. వారిలో చాలామంది తీవ్రమైన గాయాలకు లోనయ్యారు. స్పృహ లేకుండా పడిపోయారు.

సైమన్ కమిషన్ నివేదిక 1930 జూన్ నెలలో ప్రచురితమైంది. అది ఎంతో అసంతృప్తికరంగా వుంది. కాగా దానిని ఇండియాలో వున్న రాజకీయ పక్షాలన్నీ తిరస్కరించాయి. తరువాత కొన్ని నెలల కాలం కొంతమంది మధ్యవర్తులు బ్రిటిష్‌వారికి, కాంగ్రెసుకు మధ్య పరిష్కారాన్ని కుదర్చాలని ప్రయత్నించారు. కాని ఆ సంభాషణలు విఫలమయ్యాయి.

ఇది ఇలా ఉండగా జైలులో ఖైదీగా వున్న సుభాను కలకత్తా నగరానికి మేయరుగా ఎన్నికయ్యాడు. కాని ఆయన జైలునుండి విడుదల అయిన తరువాతనే ఆ సంవత్సరం ఉత్తరార్థంలో తన పదవీ బాధ్యతలను స్వీకరించగలిగాడు. మేయరుగా పదవీ స్వీకారం చేసిన సందర్భంలో ఉపన్యసిస్తూ, పౌర విషయాలలో అభివృద్ధిని సాధించటానికి చిత్తరంజన్ నాయకత్వంలో ఉపయోగపడిన విధానాన్ని గురించి సుభాను చాలా ఉత్తేజకరంగా ఉపన్యసించాడు. (1924 నుండి 1930 వరకు కలకత్తా కార్పొరేషన్ స్వరాజ్య పార్టీ కాంగ్రెసు వారి చేతుల్లో వుంది. ఆ సంవత్సరాలలో కలకత్తా కార్పొరేషన్ వివిధ రంగాలను మంచి అభివృద్ధిపరిచింది.) ఆ సంవత్సరాలలో జరిగిన అభివృద్ధికి తోడుగా మరికొంత అభివృద్ధిని సాధించటానికి మరికొన్ని అభివృద్ధి పథకాలను సుభాను చంద్రుడు ప్రకటించాడు.

రెండవ స్వాతంత్ర్య దినోత్సవం నాడు అనగా 1931 జనవరి 26వ తేదీన కలకత్తా మేయరుగా సుభాను కార్పొరేషన్ ఉన్నతాధికారులను వెంటబెట్టుకొని, పోలీసుల నిషేధాజ్ఞను ఉల్లంఘించి, పెద్ద ఊరేగింపుకు నాయకత్వం వహించుతూ కలకత్తా మైదానంవైపు నడిచాడు. వారు విస్లనేడ్ ప్రాంతం దాటగానే, అశ్వారూఢులైన పోలీసుల బృందం వారిని చితకబాదింది. సుభాను తీవ్రంగా గాయపడ్డాడు. నిర్బంధించబడ్డాడు కూడా. ఇటువంటి క్రూరమైన పద్ధతిలో ఆయన పదకొండోసారి చెరసాలలో ప్రవేశించారు. నెత్తురుతో తడిసిన ఆయన దుస్తులు మరునాడు జరిగిన పెద్ద బహిరంగ సభలో ప్రదర్శితమయ్యాయి.

# 14

1930వ సంవత్సరం చివర మొదటి రౌండ్ టేబిల్ సమావేశం లండన్‌లో జరిగింది. కాని అందులో భారత జాతీయ కాంగ్రెసు పాల్గొనలేదు. తత్ఫలితంగా ఆ సమావేశం భారతదేశానికి రెండు చేదు మాత్రలను యిచ్చింది. వాటిల్లో ఒకటి హామీలహారం, రెండవది భారత దేశాన్ని రాజ్యాంగరీత్యా ఒక ఫెడరేషన్‌గా మార్చి బ్రిటిష్ పాలిత రాష్ట్రాలను, భారత సంస్థానాధీశుల స్వాధీనంలోగల ప్రాంతాలను పాలన సౌలభ్యం కోసం కలపివేయటం. అయినా నిజంగా ఒక బాధ్యతాయుతమైన ప్రభుత్వం భారతదేశానికి లభించుతుందనే ఆశ ఎక్కడా ఆ ప్రతిపాదనలలో కల్పించలేదు. అసలు వాస్తవం ఏమనగా కాంగ్రెసు పాల్గొనని చర్చలు ఇండియా, బ్రిటన్‌ల మధ్య ఏ పరిష్కారాన్ని సాధించలేవు.

ఇది ఇలా ఉండగా లండన్‌లో బ్రిటిష్ లేబర్ ప్రధాని అయిన రామ్సేమేక్డొనాల్డ్ రౌండ్ టేబిల్ సమావేశాన్ని ముగించుతూ ఉండగా, ఇండియాలో వైస్‌రాయ్ ఇర్విన్ కాంగ్రెస్ సహకారం కోసం ఒక బహిరంగ విజ్ఞప్తి చేశాడు. మహాత్ముని, ఇతర కాంగ్రెసు కార్యనిర్వాహక సభ్యులను జైలునుండి విడుదల చేయించాడు. ఉదారవాదులకు మహాత్మునికి మధ్య ఎన్నో సమావేశాలు జరిగాయి. తుదకు ఢిల్లీలో (1931 ఫిబ్రవరి) గాంధీ-ఇర్విన్ సమావేశం జరిగింది. రోజుల తరబడి చర్చలు జరిగిన తరువాత మార్చి మొదటివారంలో గాంధీ-ఇర్విన్ ఒడంబడిక రూపం దాల్చింది. దానిని జవహర్‌లాల్ అధ్యక్షుడుగా వున్న కాంగ్రెస్ కార్య నిర్వాహక వర్గం ముందుంచగా, కాంగ్రెసు కార్యవర్గం దానిని ఆమోదించింది. అప్పుడు కలకత్తా జైలులో వున్న సుభాసు చంద్రుడు దానినొక నిరాశా జనకమైన ఒడంబడికగా భావించాడు. ఇండియాలో వున్న రాష్ట్రాలన్నింటిలోను బెంగాలు ఆ ఒడంబడికను తీవ్రంగా వ్యతిరేకించింది. కాని బెంగాలులో కూడ జతీంద్రనాథ్ వర్గం ఆ ఒడంబడికను వ్యతిరేకించలేదు.

మార్చి నెల ప్రారంభంలో సుభాసు చంద్రుడు జైలు నుండి విడుదల

అయ్యాడు. తన తోటి ఖైదీలతో పాటు తను కూడా గాంధీ-ఇర్విన్ ఒడంబడిక నిరాశా జనకమైనదేనని భావించినా, మహాత్మునితో నవివరంగా కుండ బద్దలు కొట్టినట్లుగా చర్చించకుండా తను ఎటువంటి తుది నిర్ణయానికి రాకూడదని సుభాను చంద్రుడు భావించాడు. కాగా సుభాను బొంబాయి వెళ్ళి, గాంధీతో సుదీర్ఘమైన చర్చలు జరిపాడు. సుభానుకు మహాత్ముడు ఎన్నో హామీలను యిచ్చాడు. రెండవ రౌండ్ టేబిల్ సమావేశంకోసం జారీ కాబోయే ఆదేశంలో భారతదేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యం కావాలనే ఆకాంక్షకు అసంగతంగా వుండే అంశం ఏదీ ఉండదన్నాడు. ఆ ఒడంబడికలో విస్మరించిన రాజకీయ ఖైదీలను విడుదల చేయించటానికి తను శాయశక్తులా కృషి చేస్తానన్నాడు.

సుభాను చంద్రుడు బొంబాయి నుండి ఢిల్లీకి మహాత్మునితో కలిసి ప్రయాణం చేస్తూ, ఆ చర్చలను కొనసాగించాడు. బొంబాయి నుండి ఢిల్లీ వరకు గల మార్గంలో ప్రతిచోటా గాంధీని ప్రజలు అభినందించిన విధానం సుభానును ఆకట్టుకుంది. ఆ ప్రయాణం సమయంలో గాంధీకి లభించిన అభినందన మందారాలు చూసి ప్రజలలో ఆయనకు ఎటువంటి పట్టు లభించినదీ సుభాను గ్రహించాడు. కాని వారిరువురు ఢిల్లీ చేరీచేరకముందే, వారికొక పిడుగు వంటి వార్త వినిపించింది. భగత్ సింగ్, సుఖదేవ్, రాజ గురువులను ఉరి తియ్యాలని ప్రభుత్వం నిర్ణయించింది. ప్రజల సామూహిక విజ్ఞప్తిని, మహాత్ముని జోక్యాన్ని పురస్కరించుకొని వైస్‌రాయ్ వాళ్ళ ఉరితీతను వాయిదా వేయటానికి మాత్రం అంగీకరించాడు. వాయిదా పడిన ఉరితీత చివరికి రద్దు అవుతుందని ప్రజలు ఆశించారు. కాని భారతదేశంలో పలుప్రాంతాలనుండి కాంగ్రెను మహా సభలకు హాజరు కావలసిన ప్రతినిధులందరూ కరాచీ నగరంలో ప్రవేశించటానికి మార్చి నెల చివరి వారంలో గుమిగూడుతున్న తరుణంలో భగత్‌సింగ్‌ను, ఆయన తోటి విప్లవకారులైన సుఖదేవ్, రాజగురులను ఉరితీశారనే ఆకస్మిక వార్త ప్రసారమైంది. భారతదేశం మొత్తం ఎంతో బాధపడింది, దుఃఖించింది.

కరాచి కాంగ్రెను మహా సభకు వల్లభాయి పటేల్ అధ్యక్షత వహించాడు. వామపక్షానికి చెందిన సుభాను చంద్రుడు నాటి పరిస్థితిని క్షుణ్ణంగా పరిశీలించి, గాంధి-ఇర్విన్ ఒడంబడిక విషయంలో ఒక

నిర్ణయానికి రావాలనుకున్నాడు. చివరికి 'తాము ఆ ఒడంబడికను ఆమోదించకపోయినా, ఆ క్లిష్ట సమయంలో పార్టీని చీలదియ్యాము' అని వామపక్షవాదులు ప్రకటించారు. ఈమేరకు కాంగ్రెసు విషయ నిర్ణాయక సంఘం సమావేశంలో సుభాసు ఒక ప్రకటన చేశాడు.

తరువాత రౌండ్ టేబిల్ సమావేశం గురించి వైస్‌రాయ్ ఆదేశం బయట పడింది. ఆ ఆదేశం గాంధీ బొంబాయిలో సుభాసుకు యిచ్చిన హామీకి అనుకూలంగానే వుంది. అదే సమయంలో భారతదేశం మౌలిక హక్కులను గురించి కరాచి కాంగ్రెసు చేసిన తీర్మానాన్ని ఆహ్వానించాడు. కాంగ్రెసు సాంఘిక, ఆర్థిక ఆశయాలకు ఆ తీర్మానంలో కొంత ప్రస్తావన వుంది. అయినా లాహోరులో కాంగ్రెసు కార్య నిర్వాహక వర్గంలో లేనట్లే, కరాచి కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గంలో కూడా సుభాసు పేరు లేదు. అలాగే అతివాద భావాలుగల మరికొందరి పేర్లు కూడా ఆ కార్య నిర్వాహక వర్గ సభ్యుల పట్టికలో లేవు.

అప్పుడు కాంగ్రెసు మహా సభ స్థలం పక్కనే, అఖిల భారత నౌజవాన్ భారత్ సభ కూడ తన మహాసభను నిర్వహించింది. దాని స్థాపకుడు భగత్ సింగ్. సుభాసు చంద్రుడు ఆ మహాసభకు అధ్యక్షత వహించాడు. ఆ సభలో అధ్యక్షోపన్యాసమిస్తూ, సుభాసు గాంధీ- ఇర్విన్ ఒడంబడికను లోతుగా పరిశీలించాడు. నిశితంగా విమర్శించాడు. వెంటనే ఆ ఒడంబడికను ఖండిస్తూ, ఆ సభలో తీర్మానించాడు.

గాంధీ అధినివేశ ప్రతిపత్తి తీర్మానాన్ని వ్యతిరేకిస్తూ సంపూర్ణ స్వరాజ్యం కావాలని సుభాసు చంద్రుడు కలకత్తా కాంగ్రెసు మహాసభలో మాట్లాడిన (1928)నాటి నుండీ, ఆయన దేశం నలుమూలలా యువజన, విద్యార్థి, రాజకీయ సభలలో ఉపన్యసిస్తూనే ఉన్నాడు. ఆయన ఆ ఉపన్యాసాల ద్వారా భారతదేశపు వలసవాద, సామ్రాజ్యవాద వ్యతిరేక ఉద్యమం లక్ష్యం భారతదేశం ఊహలకు అనుగుణమైన, భారతీయులు రూపకల్పన చేసిన సామ్యవాద వ్యవస్థను స్థాపించటమేనని బోధిస్తూనే ఉన్నాడు.

నౌజవాన్ భారత్ సభ కరాచీ సభలో మాట్లాడుతూ, భారతదేశం చేరవలసిన చివరి గమ్యాన్ని అతి స్పష్టమైన భాషలో వివరించి, ఆ గమ్యాన్ని చేరటానికి తగిన మార్గాన్ని కూడ సూచించాడు. "భావి భారత

రాజ్యం, దాని సాంఘిక-ఆర్థిక స్వరూపం, మానవత్వాన్ని పోషించటానికి, సమిష్టి మానవ సమాజపు అత్యున్నత ఆశయాలకు నిజ స్వరూపాన్ని యివ్వటానికి దోహదం చేసేవిగా ఉండాలి" అని ఉద్ఘాటించాడు. "న్యాయం, సమానత్వం, స్వాతంత్ర్యం, క్రమశిక్షణ, ప్రేమ''... ''సమిష్టి మానవ సమాజపు ఆధార సూత్రాలుగా ఉండాలి" అని అంటూ, "సమానత్వాన్ని దృఢపరచుకొనేందుకు సాంఘిక, ఆర్థిక, రాజకీయ, యింకా తదితరమైన అన్ని రకాల బానిసత్వం నుండి మనం విముక్తి పొందాలి'' అని సుభాను ప్రకటించాడు. "ఇండియాలో సోషలిస్టు ప్రజారాజ్యం ఏర్పడాలి. కాని తీవ్రవాద, విప్లవకర శక్తులను కదిలించి, బలపర్చకుండా మనం స్వాతంత్ర్యాన్ని సంపాదించలేం. ఆ శక్తులను ఒక నూతన సందేశంతో ఉత్తేజపరచక పోతే అవి కదలవు..." అని ఎటువంటి సంకోచం లేకుండా సుభాను వక్కాణించి చెప్పాడు. కాంగ్రెసు విధానాలలోను, కార్యక్రమాలలోను ఎంతో అస్పష్టత, ఎన్నో అవ్యక్త భావాలు ఉన్నాయని విచారపడ్డాడు. కాంగ్రెసు విధానం తీవ్రవాదం మీదగాక, భూస్వామికి-కౌలుదారుకు మధ్య పెట్టుబడి దారునికి-కార్మికునికి మధ్య, పై తరగతి వారికి-దళితులకు మధ్య, పురుషులకు-స్త్రీలకు మధ్య కుదిరే సర్దుబాట్లు మీద ఆధారపడి ఉందని బయటపెట్టాడు. కాగా ఇండియాకు స్వాతంత్ర్యం రావాలంటేః (1) సామ్యవాద కార్యక్రమం ప్రకారం కార్మికులను, సంఘాలలో సంఘటిత పరచటం; (2) బలమైన క్రమశిక్షణగల సేవా సంఘాలలో యువతీ యువకులను చేర్చటం; (3) కులతత్వాన్ని, సాంఘిక, మతతత్వ, మూఢాచారాలను రూపుమాపటం; (4) ఆధునిక భావాలకు అనుగుణంగా మహిళల ఆలోచనా ధోరణులను మార్చి వారిని మహిళా సంఘాలలో సంఘటిత పరచటం; (5) బ్రిటిష్ వస్తు బహిష్కార ఉద్యమాన్ని తీవ్రతరం చెయ్యటం, (6) నూతన ఆలోచనా ధోరణులను, కార్యక్రమాన్ని ప్రచారం చెయ్యటానికి అవసరమైన సాహిత్యాన్ని సృష్టించటం అవసరమని ప్రతిపాదించాడు. గాంధీ-ఇర్విన్ ఒడంబడిక అత్యంత అసంతృప్తికరంగాను, నిరాశాజనకంగాను ఉన్నదని సుభానుచంద్రుడు స్పష్టంగా ప్రకటించాడు. కాని ఆ ఒడంబడికకు కారకులైన వారి దేశభక్తిని గురించి మాత్రం సుభాను ఎటువంటి సంశయాన్ని వెల్లడించలేదు. ఆ పరిస్థితులలో కాంగ్రెసుతో ఘర్షణపడి మన జాతిని

బలహీనపరచి, జాతివ్యతిరేక శక్తులను బలపరచవద్దని తన అనుయాయులైన యువతీ యువకులకు సూచించి, తను ప్రతిపాదించిన కార్యక్రమాన్ని సానుకూల ధోరణితో అమలు చెయ్యమని వారికి పిలుపు యిచ్చాడు. అఖిలభారత నౌజవాన్ భారత సభ సమావేశానికి హాజరైన యువతీ యువకులను సంబోధించుతూ, ఇతరులను విమర్శించేటప్పుడు కూడ నిగ్రహాన్ని, స్వయం నియంత్రణను పాటించాలని బోధించాడు. మర్యాద, స్వయం నియంత్రణల వలన వారికి పోయేది ఏమీ ఉండదనీ, వారికి కలిగే ప్రయోజనాలే చాలా ఉంటాయనీ వివరించాడు.

సార్థకమైన తన ఉపన్యాసం సారాంశం యిస్తూ, ప్రపంచం అంతటా విస్తరించి యున్న బ్రిటిష్ సామ్రాజ్య సౌధానికి ఇండియా మూల స్తంభం అనే చారిత్రక వాస్తవాన్ని సుభాసు చంద్రుడు భారత యువతీ యువకులకు గుర్తు చేశాడు. ఇంకా స్వతంత్ర భారతదేశమే ప్రపంచం అంతటా విస్తరించిన సామ్రాజ్యవాదానికి చరమగీతం పాడుతుందని ఉద్ఘాటించాడు.

# 15

భారత ప్రజానీకానికి గాంధీ-ఇర్విన్ ఒడంబడిక విజయంగా కనిపించి నప్పటికీ, నిజానికి అది భారతీయ యువతీ యువకులలోను, సాధారణంగా వామ పక్ష వర్గాలలోను, విప్లవకారులలోను, కార్మిక సంఘాల వర్గాలలోను తీవ్రమైన నిరాశను కల్గించింది. బెంగాలు జైళ్ళలోను, ఇండియాలో ఇతర ప్రాంతాల జైళ్ళలోను వున్న ఖైదీలు ఆ ఒడంబడిక ప్రకారం విడుదల అయిన సత్యాగ్రహులతోపాటు విడుదల కాలేదు. కాగా విప్లవకారులైన ఖైదీలు (బెంగాలు) గవర్నరుకు రాస్తూ, గాంధీ-ఇర్విన్ ఒడంబడిక తమను ఏ విధంగానూ బద్ధులను చేయదని చెప్పారు. 1931 మార్చిలో జైలునుండి విడుదల అయిన సుభాసుకు యీ విషయం తెలిసింది. కొన్ని నెలల తరువాత బెంగాలు గవర్నరైన స్టాన్లీ జాక్సన్, జె.యం. సేన్‌గుప్తా వంటి నాయకుల ద్వారా రాయబారం నడిపి ఆ విప్లవకారులతో ఒక అవగాహనకు రావటానికి ప్రయత్నించాడు. కాని ఆ సంభాషణలు సఫలం కాలేదు.

కరాచీ కాంగ్రెసు తరువాత సుభాసు చంద్రుడు మళ్ళీ గాంధీ వెంట ప్రయాణం చేశాడు. గాంధీ జనరంజకత్వం, ప్రతిష్ఠ ఇంకా శిఖరాగ్రాన వున్నట్లు గ్రహించాడు. ఏప్రిల్ నెలలో కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గం రౌండ్ టేబిల్ సభలో పాల్గొనే ఏకైక ప్రతినిధిగా మహాత్ముని ఎంపిక చేసింది. అది పొరపాటని సుభాసు చంద్రుడు భావించాడు. లండన్ సమావేశంలో గాంధీ, అవసరం వచ్చినప్పుడు తనను బలపర్చుతూ ఒక మాట చెప్పటానికి కూడా ఎవ్వరూ తోడులేని, ఒంటరివాడుగా ఉండవలసి వస్తుందనీ, గాంధీకి ఎదురుగా బ్రిటిష్ ప్రభుత్వం మోహరించిన అన్ని రకాల సంకర జాతి మనుషులు, తమను తామే నాయకులుగా చిత్రించుకొన్న మనుషులు, సాంఘిక దురభిమానంతో ఆలోచించే వ్యక్తులు చాలామంది ఉంటారని సుభాసు భయపడ్డాడు.

రౌండ్ టేబిల్ సమావేశంలో పాల్గొనటానికి తనను ఏకైక ప్రతినిధిగా కాంగ్రెసు నిర్ణయించిన వెంటనే, తను రౌండ్ టేబిల్ సమావేశానికి వెళ్ళటం

హిందూ-ముస్లిమ్ సమస్యను పరిష్కరించటంలో తనకు గల సామర్థ్యంపై ఆధారపడి ఉంటుందని గాంధీ ప్రకటించాడు. మతతత్త్వవాదులు ఆ ప్రకటనను అవకాశంగా తీసుకున్నారు. మహమ్మద్ ఆలీ జిన్నా తన పదునాల్గు అంశాలుగల పత్రాన్ని గాంధీ ముందుంచాడు. అదే సాయంత్రం సుభాను చంద్రుడు, గాంధీతో సమావేశమయ్యాడు. గాంధీ నిరుత్సాహంగా ఉన్నాడు. జిన్నా షరతుల ప్రకారం హిందూ-ముస్లిమ్ ఒడంబడిక అసాధ్యమని గాంధీ భావించాడు. జాతీయ హిందువులు, జాతీయ మహమ్మదీయుల మధ్య మాత్రమే కాంగ్రెసు అవగాహనకోసం ప్రయత్నించాలనీ, వారి మధ్య జరిగే ఒడంబడికను భారత ప్రజల కోరికకు ప్రాతిపదికగా బ్రిటిష్ ప్రభుత్వం ముందు ఉంచాలనీ, జాతీయ ప్రయోజనాలను వ్యతిరేకించే శక్తులను గురించి పట్టించుకోవలసిన అవసరం లేదనీ, సుభాను మహాత్మునికి చెప్పాడు. ప్రత్యేక నియోజక వర్గాలను ఏర్పాటు చేయటం విషయంలో తనకు ఏమైనా అభ్యంతరం వున్నదా అని సుభానును గాంధీ ప్రత్యేకంగా ప్రశ్నించాడు. ఆ ప్రశ్నకు సూటిగా సమాధానం యిస్తూ, ప్రత్యేక నియోజక వర్గాల విధానం జాతీయవాదపు మౌలిక సూత్రాలకు విరుద్ధమనీ, ప్రత్యేక నియోజక వర్గాల మీద ఆధారపడిన స్వరాజ్యంకూడ కోరదగినది కాదనీ సుభానుచంద్రుడు వక్కాణించాడు.

రౌండ్ టేబిల్ సమావేశం ప్రారంభంకాగానే, బ్రిటిష్ ప్రభుత్వం చిన్న విషయాలను, వివాదాస్పద విషయాలను ముందుకు తెచ్చి, గాంధీ దృష్టిని ఆ సమస్యలవైపు మళ్ళించి, ఇండియాకు ప్రధానమైన సంపూర్ణ స్వాతంత్ర్యం విషయాన్ని మరుగుపర్చటానికి తన శాయశక్తులా ప్రయత్నించదలచిందనే నమ్మదగిన సమాచారం సుభాను చంద్రునికి చేరింది. ఆ ఎత్తుగడలతో భారతీయులలో ఒక వర్గాన్ని మరొక వర్గం మీదకు ఎగదొయ్యాలనీ, భారతీయులు ఐక్య సంఘటనగా ఏర్పడకుండా తమలో తామే పోట్లాడుకునే స్థితిని సృష్టించాలనీ బ్రిటిష్ ప్రభుత్వం కోరిక. సుభాను ఆ సమాచారాన్ని మహాత్మునికి అందించాడు. సుభానుకు వెంటనే సమాధానం యిస్తూ, తాను లండన్ చేరినవెంటనే ఇండియా ప్రధాన కోరికను గురించి సంతృప్తి కరమైన సమాధానాన్ని బ్రిటిష్‌వారి నుండి రాబట్టటానికి ప్రయత్నిస్తానన్నాడు. అంతేకాదు. అప్పుడు తనకు

సంతృప్తి కలగకపోతే, తక్షణం తన ఇంగ్లండు కార్యక్రమం అప్పటికప్పుడే ముగిసిపోతుందన్నాడు.

సుభాను, గాంధీల ఆలోచనలు యిలా ఉండగా, ఆ ఏప్రిల్ నెలలోనే ఇర్విన్ స్థానంలో వెల్లింగ్టన్ ఇండియా వైస్‌రాయ్‌గా వచ్చాడు. వెల్లింగ్టన్ కఠినచిత్తుడు, కరడు గట్టిన సామ్రాజ్యవాది. అతని రాకతో అధికారుల ధోరణి కూడ బిగిసింది. ఉద్యోగులు గాంధీ-ఇర్విన్ ఒడంబడిక షరతులను ఉల్లఘించటం ప్రారంభించారు. గుజరాత్, యు.పి., బెంగాలు రాష్ట్రాలలో పరిస్థితి దిగజారింది. బెంగాలులో ప్రజలను విచారించకుండా నిర్బంధించటం కొనసాగుతూనే వుంది. ఒక్క ప్రాణిని కూడ జైలు నుండి విడుదల చెయ్యలేదు. కల్లబొల్లి కుట్ర కేసులు మోపటం మామూలుగా కొనసాగుతూనే వుంది. గాంధీ-ఇర్విన్ ఒడంబడికను ప్రభుత్వం ఉల్లంఘించిన సందర్భాల వివరాల పత్రాన్ని మహాత్ముడు స్వయంగా ఇండియా ప్రభుత్వం హోం కార్యదర్శికి అందజేశాడు. గాంధీ నూతన వైస్‌రాయ్‌తో సుదీర్ఘంగా చర్చించాడు. కాని సాధారణ పరిస్థితిలో చెప్పుకోదగిన మార్పు ఏమీ రాలేదు. అందునా ఆఖరి నిమిషంలో గాంధీ-వైస్‌రాయ్‌ల మధ్య ఒక మొక్కుబడి ఒడంబడిక ఏదో విధంగా జరిగింది. గాంధీ ఇంగ్లండు వెళ్ళటానికి ఓడ ఎక్కాడు.

మహాత్ముడు ఇంగ్లండులో సుమారు రెండున్నర నెలలు ఉన్నాడు. అల్ప సంఖ్యాకుల సమస్యలను, భావిభారత సమాఖ్య స్వరూపానికి సంబంధించిన విషయాలను ముందుకునెట్టి, బ్రిటిష్ ప్రభుత్వం గాంధీని వల్లీకొట్టించాలని ప్రయత్నించింది. అల్పసంఖ్యాకుల (మైనారిటీల) కమిషన్ సభ్యులందరూ బ్రిటిష్ ప్రభుత్వం ఎంపిక చేసినవారే. కాగా, సహజంగానే, మత సామరస్యాన్ని సాధించటానికి గాంధీజీ చేసిన ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి. అగ్రనాయకుల ఢిల్లీ ప్రకటనను వ్యతిరేకిస్తూ, 1929 నవంబరులో సుభాను చంద్రుడు, ఆయన సహచరులు విడుదల చేసిన ప్రణాళిక ఆ ఫలితం అలాగే వుంటుందని ముందుగానే చెప్పింది. ఇంతేకాకుండా మహాత్ముడు ముస్లిం, తదితర అల్ప సంఖ్యాకుల ప్రతినిధులతో కూడిన భారత జాతీయ నాయకుల దళాన్నొకదానిని తనవెంట తీసికొని వెళ్ళివుంటే పరిస్థితి పూర్తిగా భిన్నంగా ఉండేదని సుభాను ఉద్దేశం. గాంధీ అలా చేయనందున బ్రిటిష్ వాళ్ళు ఏరి, ఏరి,

ఎంపిక చేసిన అల్ప సంఖ్యాకుల ప్రతినిధుల తుంటరి ఎత్తు గడలను గాంధీ ఒంటరిగా ఎదుర్కొనవలసి వచ్చింది.

బ్రిటిష్ ప్రభుత్వం ఆశీస్సుల అండతో, భారత అల్ప సంఖ్యాకుల ప్రతినిధులగా చెలామణి అయినవాళ్ళు మైనారిటీల ఒడండిక అనేదాన్ని సాధించారు. దాని ఫలితంగా శాసన సభల్లో దళిత వర్గాలకు నిశ్చయంగా కొన్ని స్థానాలు లభించాయి. వారికి ప్రత్యేక నియోజక వర్గాలు కూడా ఏర్పాటయ్యాయి. బ్రిటిష్ ప్రధాని ఆ ఒడంబడిక పదకొండున్నర కోట్ల, భారతీయ అల్ప సంఖ్యాకులకు ఆమోదయోగ్యమైనదనీ, భారతీయులు తమ మత విభేదాలను పరిష్కరించుకోలేకపోవటమే ఇండియాకు నలుగురి ఆమోదం పొందగల ఒక రాజ్యాంగాన్ని రచించటానికి చేయవలసిన కృషికి అడ్డుగా నిలిచిందనీ ప్రకటించాడు. మహాత్ముడు అటువంటి ఉద్ఘాటనలనన్నింటినీ సవాలు చేశాడు. కాంగ్రెసు భారత ప్రజలలో 85 శాతం మందికి ప్రాతినిధ్యం వహించుతుందని నొక్కి చెప్పాడు. నవంబరులో జరిగిన ఆ మహాసభ ప్లీనరీ (సర్వసభ్య) సమావేశంలో ఒక మహోపన్యాసం చేశాడు. ఆయన భ్రమలు పూర్తిగా తొలగిపోయాయని ఆ ఉపన్యాసం స్పష్టం చేసింది.

మహాత్ముని లండన్ ప్రయాణ పథకం అపసవ్యంగా ఉందనీ, ఆయన పర్యటనలో సమర్థులైన, మంచి సలహాదారులను చేర్చలేదనీ, సుభాను అభిప్రాయపడ్డాడు. ఇంకా గాంధీ 1931లో గాక, 1930లో ఇంగ్లండు వెళ్ళి ఉంటే బాగా ఉండేదని కూడ భావించాడు. 1930లో అయితే, గాంధీ బ్రిటిష్‌వారి నుండి మంచి రాయితీలు పొందగలిగే వాడని సుభాను విశ్వాసం. ఇది ఇలా ఉండగా, 1931 అక్టోబరులో ఇంగ్లండు ప్రభుత్వం మళ్ళీ టోరీల వశం కావటంతో భారతదేశపు ఆఖరి ఆశాకిరణం అదృశ్యమైంది.

గాంధీ విదేశ ప్రయాణం భారత స్వాతంత్ర్యం సమస్యను ఒక అంతర్జాతీయ రాజకీయ సమస్యగా చేయటానికి ఉపయోగపడనందుకు సుభాను విచారించాడు. ఐరోపా రాజకీయ రంగంలో ముఖ్యులైన వారితో గాంధీకి పరిచయం కల్గించటానికి ఎటువంటి ప్రయత్నం జరగలేదు. ఐరోపా ప్రధాన దేశాలలో గాంధీ చాలా తక్కువ సమయాన్ని గడిపాడు.

1931 చివరి రోజున గాంధీ ఇండియాకు తిరిగి వచ్చాడు. ఆయనకు

మంచి, హృదయపూర్వకమైన, సాదరస్వాగతం లభించింది. భారతదేశంలో దాక్షిణ్య రహితమైన దమననీతిని అమలు చేయటానికి గాంధీ దేశంలో లేనప్పుడు ఇండియా ప్రభుత్వం ఖచ్చితమైన పథకాలను తయారు చేసుకుంది. మరొకపక్క మొట్టమొదటే గాంధి-ఇర్విన్ ఒడంబడికను ఆమోదించని యువజన, కార్మిక సంఘాలు రానున్న పోరాటానికి సన్నాహాలు చేసుకోవటం ప్రారంభించాయి. మే నెలలో యు.పి.లో జరిగిన నౌజవాన్ భారత్ సభ సమావేశానికి సుభాను అధ్యక్షత వహించాడు. జూలై నెలలో కలకత్తాలో జరిగిన అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు మహాసభకు అధ్యక్షత వహించాడు. ఆ సభ గాంధీ-ఇర్విన్ ఒడంబడికను ఖండించింది. ప్రభుత్వ దమననీతి వలన, రెచ్చిపోయిన బెంగాలు విప్లవకారులు, చిటగాంగ్ ఆయుధాగారంపైన దాడి జరిపిన తరువాత, ప్రభుత్వంపైన కక్ష కొలది ఉగ్రవాద ప్రతీకార చర్యలకు పూనుకున్నారు. ప్రభుత్వం కూడా భయోత్పాతం సృష్టించే విధానంతో మరొక అడుగు ముందుకు వేసింది. ఎన్నో జిల్లాల్లో ప్రచ్ఛన్న రూపంలో సైనిక శాసనం అమలు జరిపింది. ఆ విధంగా ప్రభుత్వ దమననీతి, విప్లవకారుల ఉగ్రవాద చర్యలు, వాటి తరువాత ప్రభుత్వం అధికారయుతంగా అమలుజరిపే ప్రతీకార ఉగ్రవాదంతో ఒక విషవలయం ఏర్పడింది. ఆఖరికి గాంధీ-ఇర్విన్ ఒడంబడిక అమలులో ఉన్నప్పుడు కూడ కొందరు విప్లవకారులు మరణశిక్షలకు ఉరితీతలకు గురి అయ్యారు. కాగా ఆ డిసెంబరులో జరిగిన బెంగాలు రాజకీయ సభ వామపక్షవాదుల వాదనను, అనగా ప్రభుత్వం గాంధీ-ఇర్విన్ ఒడంబడిక షరతులన్ను ఉల్లంఘించింది కాబట్టి, కాంగ్రెసు శాసనోల్లంఘన ఉద్యమాన్ని తిరిగి చేపట్టాలనే వాదనను, బలపర్చింది. వాయువ్య సరిహద్దు రాష్ట్ర ప్రభుత్వం అబ్దుల్ గఫార్‌ఖాన్ నాయకత్వాన పనిచేస్తున్న 'ఖుదై ఖిద్మద్గారులు' అని పేరు పొందిన ఎర్రచొక్కాల సేవా దళం మీద ఉక్కు హస్తంతో విరుచుకుపడింది. ఆ రోజులలో సంయుక్త రాష్ట్రాలు (నేటి ఉత్తర ప్రదేశ్) దర్శించిన బ్రెయిల్స్ ఫర్డ్ అనే బ్రిటిష్ సోషలిస్టు నాయకుడు ఆ రాష్ట్ర పరిస్థితి వ్యావసాయిక విప్లవం అంచున ఉన్నదని సుభానుతో అన్నాడు.

భారతదేశానికి తిరిగి రాగానే, గాంధీ ప్రభుత్వ వైఖరిని వివరించమని కోరుతూ వైస్‌రాయ్ వెల్లింగ్టన్‌కు రాశాడు. వైస్‌రాయ్ అమిత్రభావం,

ప్రతికూల వైఖరి స్ఫురించే సమాధానాన్ని పంపించాడు. దానిని పురస్కరించుకొని కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గం ఒక తీర్మానాన్ని ఆమోదించింది. వెల్లింగ్టన్‌కు ఆ తీర్మానం ఆమోదయోగ్యం కాలేదు. అతను గాంధీని కలుసుకోవటానికి నిరాకరించాడు. ఆ విధంగా రెండవ శాసనోల్లంఘన ఉద్యమానికి రంగం సిద్ధం అయింది.

# 16

1932 జనవరి మొదటి వారంలో బ్రిటిష్ ప్రభుత్వం ఇండియా అంతటా కాంగ్రెసు మీద, ఇతర జాతీయ సంస్థల మీద భయంకరంగా దాడి చేయటం ప్రారంభించింది. గాంధీ, జవహర్‌లాల్, సుభాసులతో సహా పెక్కుమంది నాయకులు మూకుమ్మడిగా నిర్బంధితులయ్యారు. 1930లో గాంధీ నడిపించిన ప్రజాప్రతిఘటన ఉద్యమ లక్షణం ఇంగ్లీషు వాళ్ళకు కొత్తదైనందున వాళ్ళు చకితులయ్యారు. కాని ఆ ప్రభుత్వమే 1931 నాటికి శాసనోల్లంఘన ఉద్యమాన్ని ఎదుర్కొనేందుకు తన యంత్రాంగాన్ని సన్నద్ధం చేసింది. శాసనోల్లంఘన ఉద్యమం మొదటి నాలుగు నెలలలో 80 వేలమంది ప్రజలు జైళ్ళకు వెళ్ళారు. ప్రభుత్వం కాంగ్రెసు సంస్థలను చట్ట విరుద్ధమైన సంస్థలుగా ప్రకటించింది. నిర్దాక్షిణ్యమైన అణచివేత చర్యలను ఆరంభించింది. లాఠీలతో ప్రజలను తీవ్రంగా కొట్టటం, ముందూ వెనుకా చూడకుండా కాల్పులు జరపటం సామూహికంగా జరిమానాలు విధించటం, దేశభక్తుల ఆస్తులను లాక్కోవటం, జాతీయ పత్రికల గొంతు నొక్కటం, దేశం అంతటా సోదాలు నిర్వహించటం, యింకా పలువిధాల ప్రజలను బాధించటం ప్రారంభమయింది. జైళ్ళలోపల కూడా ఖైదీల స్వేచ్ఛను కుదించటానికి ముళ్ళ కంచెలు ఏర్పాటు చేశారు. రాత్రిళ్ళు ఖైదీల చేతులకు సంకెళ్ళు వేశారు. ఖైదీలచేత నార ధరింపచేశారు. అయినా భారత ప్రజలు బ్రిటిష్ సామ్రాజ్యవాదులతో వీరోచితంగా పోరాడారు. కాని యీసారి భారతీయులు అననుకూల పరిస్థితిని ఎదుర్కోవలసి వచ్చింది. వాళ్ళ శత్రువు ఆ పోరాటానికి పూర్తిగా సన్నద్ధమై వున్నాడు. నిర్దాక్షిణ్యంగా అణచి వేయటానికి సిద్ధమయ్యాడు.

1932 జనవరిలో సుభాసును నిర్బంధించిన తరువాత ఆయనను మధ్య రాష్ట్రాల (ఇప్పటి మధ్యప్రదేశ్)లోని సియోని అనే ఓ మారుమూల ప్రాంతంలో గల చిన్న జైలులో ఉంచారు. తరువాత అదే జైలుకు ఆయన సోదరుడైన శరత్‌చంద్రబోసు వచ్చాడు. శరత్‌చంద్రుడు కలకత్తాలో ఒక

ప్రముఖ న్యాయవాది మాత్రమే కాక ప్రముఖ కాంగ్రెసు నాయకుడు కూడా. ఆయన కలకత్తా కార్పొరేషన్ ప్రముఖులలో పెద్ద (ఆల్డర్‌మన్) కూడా. ఆయన, ఆయన భార్య కూడా సుభాసును అతని చిన్నతనం నుండి ఎంతో ఆప్యాయంగా చూసేవారు. తన జీవితంలో ఏ క్లిష్ట పరిస్థితి తటస్థించినా, సుభాసుతన అన్న అయిన శరత్ సలహాను, మార్గ దర్శకత్వాన్ని, అండను ఆశించేవాడు. ఇప్పుడు సోదరులిరువురూ భారతస్వాతంత్ర్య సమరంలో కలిసి బాధలు అనుభవించి కాలం వచ్చింది. ఒకే సిద్ధాంతం కోసం, ఒకే దేశం కోసం, ఒకే స్వాతంత్ర్య పోరాటంలో ఇద్దరు సోదరులు సహచరులు కావటం, సహచరులుగా బాధలను పంచుకోవటం వివిధ జాతుల చరిత్రలో అతి అరుదైన, అసాధారణ ఘటన.

1932 ఆగస్టు నెలలో బ్రిటిష్ ప్రభుత్వం 'కమ్యూనల్ అవార్డ్' పేరుతో, ఇండియాలో దళిత వర్గాలకు మైనారిటీ జాతులకు శాసన సభ సీట్లల్లో రిజర్వేషన్లు కల్పించింది. దాని కంటె ప్రమాదకరమైన ప్రత్యేక నియోజక వర్గాల ఏర్పాటును కూడ ప్రకటించింది. ఇలా చేయటం దళితులను హిందూ సమాజం నుండి చీల్చటమే అని భావించిన గాంధీ, వెంటనే బ్రిటిష్ ప్రధానికి ఉత్తరం రాస్తూ, ప్రత్యేక నియోజక వర్గాల ఏర్పాటుకు వ్యతిరేకంగా తను ఆమరణ నిరాహార దీక్షకు పూనుకుంటున్నట్లు తెలియజేశాడు. ఆ వార్త విని దేశం యావత్తు అదుర్దా పడింది. అట్టుడికిపోయింది.

గాంధీ తన నిరాహార దీక్షను పూనే జైలుగదిలో ప్రారంభించాడు. నిరాహార దీక్షను విరమించమని దేశం నలుమూలలనుండీ ఆయనకు విజ్ఞప్తులు వెళ్ళాయి. విభిన్న ధోరణులుగల హిందూ నాయకుల సమావేశం ఒకటి బొంబాయిలో జరిగింది. సుదీర్ఘమైన చర్చల తరువాత, ప్రత్యేక నియోజక వర్గాల రద్దుకు అనుకూలంగా వారొక ఒడంబడికకు వచ్చారు. అదే పూనే ఒడంబడిక. దానిని గురించి బ్రిటిష్ ప్రభుత్వానికి తెలియజేశారు. దానిని ఆమోదించమని బ్రిటిష్ పార్లమెంటుకు సిఫారసు చెయ్యటం తప్ప, ప్రత్యామ్నాయం ఏదీ బ్రిటిష్ ప్రభుత్వానికి కన్పించలేదు. దానితో మహాత్ముడు తన నిరాహార దీక్షను విరమించాడు.

1930లో వలెనే, 1932లో కూడ వివిధ ఘటనల క్రమాన్ని సుభాసు

చంద్రుడు కటకటాల వెనుకనుండే గమనిస్తూ వచ్చాడు. గాంధీజీ ప్రారంభించిన ఆమరణ నిరాహార దీక్షపైన ప్రజలలో పెల్లుబికిన ఆందోళన, ఆయన ప్రాణాన్ని కాపాడాలనే సహజమైన ఆదుర్దా ఎంతో ప్రధానమైన ఇండియా స్వాతంత్ర్య సమస్యను పక్కకు నెట్టివెయ్యటం సుభాను చంద్రునికి దిగ్భ్రమ కల్గించింది. ఈసారి కాంగ్రెసుపై బ్రిటిష్ ప్రభుత్వందే పైచెయ్యి అయిందని సుభాను గట్టిగా భావించాడు. ఆ సంవత్సరం (1932) ముగిసేనాటికి కాంగ్రెసు వాదులు అంటరానితనం నిర్మూలన, దేవాలయ ప్రవేశాలకు సంబంధించిన చట్టాల రూపకల్పనా కార్యక్రమాలలో మునిగిపోయి, శాసనోల్లంఘన కార్యక్రమాన్ని విస్మరించారు. ఈ విధంగా ప్రధాన విషయాన్ని పక్కకు నెట్టటాన్ని సుభాను గర్హించాడు.

సియోని సబ్ జైలులో బోసు సోదరుల ఆరోగ్యం వేగంగా క్షీణించింది. వారిని మొదట జబల్‌పూర్ సెంట్రల్ జైలుకు మార్చారు.

తరువాత కేవలం ఆరోగ్యాన్ని పరీక్షించటానికి అంటూ, సుభానును ఒక చోటునుండి మరొకచోటుకు మార్చటం ప్రారంభించారు. జబల్‌పూరునుండి మద్రాసుకు, మద్రాసునుండి భోవాలీకి, అక్కడి నుండి లక్నోకు మార్చారు. కానీ సుభాను వ్యాధిని సరిగ్గా నిర్ధారణ చెయ్యటం లేదా ఆయనకు ఉపయోగకరమైన చికిత్స చేయించటం జరగలేదు. కాగా ఆయన దేశ బహిష్కృతుడై బర్మాలో వుండి చిక్కి శల్యమైనట్లుగానే, స్వదేశంలో కూడా చిక్కిపోయి, అస్థి పంజరంలా తయారయ్యాడు.

జైలులో సుభాను ఆరోగ్యం యీ విధంగా క్షీణించిన దశలో, శరత్ కూడ ఇంటిదగ్గర లేనందున సుభాను తరఫున శరత్‌చంద్రుని భార్య బివాబతి ఢిల్లీ ప్రభుత్వంతో సంభాషణలు జరిపింది. నాటి అధికారుల ధోరణి చాలా స్నేహ విరుద్ధంగా ఉందని గ్రహించింది. చివరకు చికిత్స నిమిత్తం సుభానును ఐరోపా పంపించాలనే నిర్ణయం జరిగింది. కాని బ్రిటిష్ ప్రభుత్వం ఎట్టి పరిస్థితులలోనూ, ఆఖరికి వయస్సు మళ్ళిన, జబ్బుపడిన తల్లిదండ్రులను చూడటానికి కూడ, సుభానును తాత్కాలికంగానైనా విడుదల చేయటానికి అంగీకరించలేదు. అంతేకాదు. సుభాను ప్రయాణానికి, విదేశంలో చికిత్సకు అయ్యే ఖర్చుకు కూడ ప్రభుత్వం బాధ్యత వహించలేదు.

సుభాను ఐరోపాకు వెళ్ళేముందు, జబల్‌పూర్ జైలులో వున్న శరత్‌తో

కొన్ని రోజులు ఉండటానికి అవకాశం లభించింది. తరువాత సుభానుకు వీడ్కోలు చెప్పటానికి ఆయన కుటుంబ సభ్యులు కొందరూ, దేశబంధు భార్య అయిన వాసంతీదేవి జబల్పూరు వచ్చారు. 1933 ఫిబ్రవరి 13న సుభాను-ఐరోపా వెళ్ళే నిమిత్తం ఓడ ఎక్కాడు. ఆ ఓడ పేరు యస్.యస్. గాంగే. అదొక ఇటలీ ఓడ. సుభాను జీవితంలో అది మరొక బలవంతపు దేశ బహిష్కరణ.

1933 మార్చిలో సుభాను వియన్నా చేరాడు. ఆయనకు అక్కడి మంచి వైద్యులనుండి సంతృప్తికరమైన చికిత్స లభించింది. కొంత స్వస్థత చేకూరగానే ఐరోపా రాజకీయాలలో చురుకైన ఆసక్తిని చూపించటం ప్రారంభించాడు. వివిధ స్థాయిలలో ఐరోపా రాజకీయ నాయకులతో సంబంధాలు ఏర్పరచుకున్నాడు. ఇండియా స్వాతంత్ర్య సమస్యను మరింత ముందుకు తీసికొని వెళ్ళటానికి కృషి చేశాడు. అదే సమయంలో ఇండియా జాతీయ ఆకాంక్షలకు అంతర్జాతీయ అండదండలను చేకూర్చటానికి ప్రయత్నిస్తున్న వల్లభాయి పటేల్ భారతదేశం స్వాతంత్ర్య సమరాన్ని గురించి తనలాగే ఆలోచిస్తున్నాడని సుభాను గ్రహించాడు. ఐరోపాలో బోసు ఆలోచనలు యిలా ఉండగా, భారతదేశంలో శాసనోల్లంఘన ఉద్యమానికి తిరిగి ప్రాణం పోయటానికి భారతదేశంలోని వివిధ ప్రాంతాల్లో కృషి ప్రారంభమైంది.

ఆ సంవత్సరం జనవరిలో చాలాచోట్ల స్వాతంత్ర్య దినోత్సవం చాలా ఉత్సాహంగా జరిగింది. రాజ్యాంగ సంస్కరణలకు సంబంధించిన ప్రతిపాదనలకు ఒక రూపం ఇచ్చి మార్చి నెల మధ్యలో బ్రిటిష్ ప్రభుత్వం ఒక శ్వేతపత్రాన్ని ప్రచురించింది. వెంటనే, ఏప్రిల్ నెలలో భారతజాతీయ కాంగ్రెసు వార్షిక మహాసభ కలకత్తాలో నిర్వహింపబడాలనే నిర్ణయం జరిగింది. ప్రభుత్వం వెంటనే ఆ సభకు అధ్యక్షుడుగా ఎన్నికైన మదన మోహన మాలవ్యాతో సహా జైళ్ళ బయట వున్న కాంగ్రెసు నాయకులందరినీ అరెస్టు చెసింది. మదన మోహన మాలవ్యా స్థానంలో ఆ కాంగ్రెసు మహా సభ అధ్యక్షురాలిగా వ్యవహరించిన జె.యం. సేన్‌గుప్తా భార్యను ఆ సభా స్థలంలోనే నిర్బంధించారు.

ఆ మహాసభ ఆమోదించిన తీర్మానాలలో అతి ముఖ్యమైనది బ్రిటిష్ శ్వేతపత్రాన్ని ఖండించిన తీర్మానం. "కాంగ్రెసును నామరూపాలు లేకుండా

చేయటానికి బ్రిటిష్ ప్రభుత్వానికి పదిహేను నెలల కాలం చాలలేదు. ముప్పది నెలల కాలమైనా కాంగ్రెసును నాశనం చెయ్యటానికి బ్రిటిష్ ప్రభుత్వానికి చాలదు." అని ఆ కాంగ్రెసు మహాసభకు అధ్యక్షుడుగా ఎన్నికైన మదన్ మోహన్ మాలవ్యా చేసిన ఉద్ఘాటన మన దేశ ప్రజలను మనోభావాన్ని సరిగ్గా ప్రతిబింబించింది. అయినప్పటికి ఆ మే నెలలో మహాత్ముడు శాసనోల్లంఘనోద్యమాన్ని హఠాత్తుగా నిలిపివేశాడు. ఆ వార్తను విని దేశం అంతా ఉలికిపడింది.

అప్పుడు మహాత్ముడు నిరాహారదీక్షలో ఉన్నాడు. కాగా ప్రశాంతమైన, అనాసక్త వివేచన కూడా తాత్కాలికంగా ఆగిపోయింది. అయినప్పటికీ మహాత్ముని చర్యకు బ్రిటిష్ ప్రభుత్వం స్పందించలేదు. ఉద్యమాలను అణచి వేసేందుకు జారీ చేసిన అత్యవసర ఆదేశాలను ఉపసంహరించలేదు. రాజకీయ ఖైదీలను విడుదల చెయ్యలేదు. కాగా సుభాను చంద్రుడు, వల్లభాయి పటేల్‌లు గాంధీ మహాత్ముని నిర్ణయాన్ని తీవ్రపదజాలంతో ఆక్షేపించుతూ వియన్నా నుండి ఒక సంయుక్త ప్రకటనను విడుదల చేశారు. అంతకు పూర్వం పదమూడు సంవత్సరాల పాటు భారత స్వాతంత్ర్యం కోసం జరిపిన కృషిని, చేసిన త్యాగాలను మహాత్ముని నిర్ణయం మట్టిపాలు చేసిందని పటేలు, సుభాసులు అన్నారు. కాగా దేశానికి మరింత తీవ్రవాద విధానం నాయకత్వం కావాలని ఆ ఇరువురూ పిలుపు ఇచ్చారు. జాతీయ విధానాలను గురించి మాట్లాడవలసి వచ్చినప్పుడు, గాంధీగాని లేదా అటువంటి అగ్ర నాయకుల విధానాలను గురించి మాట్లాడవలసి వచ్చినా, వారంటే తనకు ఆరాధనా భావం వున్నా, సుభాసు ఎప్పుడూ, ముక్కుసూటిగా, కుండ బ్రద్దలు కొట్టినట్లు మాట్లాడేవాడు. కాని మహాత్ముడు నిరాహార దీక్షలో ఉండగా, అలా బహిరంగంగా విమర్శించటం చాలా ఘోరమైన విషయమని అనేక మంది భావించారు.

శాసనోల్లంఘనోద్యమాన్ని నిలిపివేయగానే, లండన్‌లో జరిగే ఒక భారత రాజకీయ మహా సభకు అధ్యక్షత వహించవలసినదిగా సుభాసుకు ఆహ్వానం వచ్చింది. ఐతే బ్రిటిష్ ప్రభుత్వం తెలివిగా ఆలోచించి, ఆయన ఐరోపాలో ఇటలీ, ఆస్ట్రియా దేశాలను మాత్రమే దర్శించవచ్చునని ఆయన పాస్‌పోర్టులో రాసింది. ఆ విధంగా సుభాను లండనుతో సహా ఇతర

ఐరోపా దేశాలను దర్శించకూడదనే అభిప్రాయాన్ని కలుగజేసింది. అందువల్ల సుభాసు తన అధ్యక్షోపన్యాసాన్ని తన పరోక్షంలో మరొకరు చదివేందుకు లండన్ పంపించాడు.

ఆ ఉపన్యాసం సుభాసు మౌలిక రచనలలో ఒకటిగా పరిగణన పొందింది. భారతదేశానికి స్వాతంత్ర్యం సంపాదించటానికి ఆయన చేసిన రాజకీయ సన్నాహం (బ్రిటన్‌కు వ్యతిరేకంగా పోరాటాన్ని నడపటంలో అవలంబించవలసిన వ్యూహం విషయంలో కాని, ఇండియా విప్లవం అంతిమ లక్ష్యాల విషయంలో కాని) చాలా పురోగమించిందని ఆ ఉపన్యాసం సృష్టించేసింది. ఇండియా విప్లవం అంతిమ లక్ష్యం సామ్యవాదం అని సుభాసు ఆ ఉపన్యాసంలో నిర్వచించాడు. భారతదేశం భవితవ్యం ఎంత గొప్పగా ఉంటుందో ఆ ఉపన్యాసంలో సుభాసు ఇలా ఊహించాడు:

"...పదిహేడవ శతాబ్దంలో రాజ్యాంగబద్ధమైన ప్రజాస్వామికమైన ప్రభుత్వాన్ని గురించి తను ప్రపంచానికి అందించిన ఆశయాల ద్వారా ఇంగ్లండు ప్రపంచ నాగరికతకు ఎంతో దోహదం చేసింది. అలాగే, పద్దెనిమిదవ శతాబ్దంలో ఫ్రాన్స్ స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాతృత్వం అనే నినాదం యిచ్చి, ప్రపంచ నాగరికత పురోగమనానికి అద్భుతమైన దోహదం చేసింది. పందొమ్మిదవ శతాబ్దంలో జర్మనీ ప్రపంచానికి మార్క్సిస్టు తత్వశాస్త్రం అనే అసాధారణమైన బహుమతిని యిచ్చింది. ఇరవయ్యో శతాబ్దంలో శ్రామిక వర్గ విప్లవం, శ్రామికవర్గ ప్రభుత్వం, శ్రామిక వర్గ సంస్కృతుల ద్వారా రష్యా ప్రపంచ సంస్కృతి, నాగరికతలను, సుసంపన్నం చేసింది. ఇప్పుడు వాటి తర్వాత ప్రపంచ సంస్కృతికీ, నాగరికతకు ఒక ఉత్కృష్టమైన బహుమతిని యివ్వవలసినదిగా భారతదేశానికి ఆహ్వానం అందుతుంది."

# 17

తన ఐరోపా యాత్ర కాలంలో సుభాసు చంద్రుడు భారత జాతీయ భావ సిద్ధాంతాలకు తనను తనే అనధికార రాయబారిగా నియమించుకొని, భారతదేశం వాణిని ఐరోపాలో వినిపించాడు. ఆయన కృషి ఆస్ట్రియాలో ప్రారంభమైనా, ఆయన దానిని జెకోస్లావేకియా, పోలండ్, హాంగరీ, ఇటలీ, స్విట్జర్లండ్, జర్మనీ, ఫ్రాన్స్, దేశాలకు విస్తరించాడు. అప్పుడు చాలా మంది భారత విద్యార్థులు జర్మనీ, ఇంగ్లండ్‌లలో ఉన్నత విద్యాభ్యాసం, లేదా సాంకేతిక శిక్షణను పొందుతున్నారు. కాగా బ్రిటిష్ ప్రభుత్వం సుభాను ఆ రెండు దేశాలలో కాలు పెట్టకుండా చెయ్యాలని ప్రయత్నించింది. ఆ విద్యార్థులను తన తీవ్రవాదం, సమరశీల భావాలతో ప్రభావితం చేసి, సుభాసు వారిని భారత జాతీయోద్యమంలోకి దించుతాడని వాళ్ళ భయం.

సుభాసు చంద్రుడు ఐరోపా రాజకీయ వేత్తలతో మాత్రమే కాక, సాహితీ వేత్తలతోను, ఆర్థిక శాస్త్రవేత్తతోను, మానవ సమాజ శాస్త్రజ్ఞులతోను, శాస్త్రవేత్తలతోను, సాంస్కృతిక ప్రపంచానికి సంబంధించిన ప్రముఖ స్త్రీ, పురుషులందరితోను పరిచయం సంపాదించుకున్నాడు. ఆయన ఎంతో మంది ఐరోపా రచయితలతోను పండితులతోను ఉత్తర ప్రత్యుత్తరాలు సాగించాడు. ఆయన ఐరోపాలో ఎన్నోచోట్ల భారత జాతీయోద్యమం, భారతీయుల చరిత్ర, నాగరికత, సంస్కృతులను గురించి ఉపన్యసించాడు. బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి ఎదురునిలిచిన భారత జాతీయ ఉద్యమానికి ఐరోపాలోని వివిధ వర్గాల ప్రజల నైతిక సహాయాన్ని అర్థించాడు. వియన్నాలో ఆస్ట్రియా-ఇండియా సొసైటీని స్థాపించాడు. జెకొస్లావేకియాలో సుభాసు ఒకవైపు కార్ల్స్‌బాద్‌లో మంచి వైద్యాన్ని పొందటమే గాక, ఎందరో ప్రముఖులతో రాజకీయ, సాంస్కృతిక సంబంధాలను ఏర్పరచుకున్నాడు. ఎడ్వర్డ్ బెనిస్‌తో ప్రాగ్ నగరంలో ఎంతో ప్రాధాన్యతగల రాజకీయ చర్చలను చేశాడు. బెనిస్ ఆనాడు జెక్

విదేశాంగ మంత్రి.

మొదటి ప్రపంచ యుద్ధం కాలంలో జెకొస్లొవేకియా వెలుపల ఒక జెక్ సైనికగళం రూపొందింది. దేశం వెలుపల నుండి ఆ దళం జెక్ స్వాతంత్ర్యంకోసం పోరాడగలదనీ, జెక్ స్వాతంత్ర్యాన్ని సంపాదించ గలదనీ ఆశించబడింది. బెనిస్‌తో చేసిన చర్చలలో సుభాను ఆ సైనిక దళాన్ని గురించి వివరంగా అడిగి తెలుసుకున్నాడు. ఇంకా జెక్‌స్లొవేకియా-ఇండియా అసోసియేషన్‌ను నిర్మించటంలో సుభాను ప్రధానపాత్ర వహించాడు. సుభాను 1934లో ఆ సంఘం ప్రారంభోపన్యాసాన్ని చేశాడు.

భారత స్వాతంత్ర్యోద్యమం యెడల పోలండ్ ఎంతో సానుభూతి కలిగి ఉందని సుభాను గ్రహించాడు. ఆ సానుభూతిని ఆసరాగా తీసికొని, సుభాను ఇండియా స్వాతంత్ర్య సమరంలో పోలిష్ మిత్రులకుగల ఆసక్తిని పెంపొందించాడు. పోలండ్ తన దేశం వెలుపల, అనగా జపానులో, మొదటి ప్రపంచ యుద్ధ కాలంలో, ఒక ప్రత్యేక సైనిక దళానికి శిక్షణ యిచ్చింది. ఆ దళాన్ని గురించి, దానికి యిచ్చిన శిక్షణ గురించి సుభాను శ్రద్ధగా అధ్యయనం చేశాడు. రష్యా పెత్తనం నుండి పోలండ్‌కు విముక్తి కల్గించటం ఆ ప్రత్యేకమైన సైనిక దళం ఆశయం.

సుభాను చంద్రుడు ఐరోపాలో ఉండగానే, జర్మనీ రాజ్యాధికారాన్ని హిట్లర్, అతని నేషనల్ సోషలిస్టు పార్టీ హస్తగతం చేసుకోవటంతో ఐరోపా రాజకీయాల తుఫాను కేంద్రం జర్మనీకి మారింది. దక్షిణ ఐరోపాలో ముసోలినీ నాయకత్వాన ఇటలీ బలపడి, మధ్యధరా సముద్రప్రాంతంలో ఇంగ్లండు ప్రాబల్యాన్ని సవాలు చెయ్యటం ప్రారంభించింది. ఇంగ్లండులో రౌండ్ టేబిల్ సమావేశం ముగిసిన తరువాత ఇండియాకు తిరిగివెళ్ళుతున్న మహాత్మాగాంధీకి ముస్సోలిని రోం నగరంలో ఉత్సాహపూరితమైన, సాదరమైన స్వాగతం చెప్పాడు. బెర్లిన్‌లో జర్మనీ విదేశాంగ శాఖ అధికారులతో సుభాను చర్చలు జరిపేందుకు అవసరమైన ఏర్పాట్లను ఇండో-జర్మన్ సొసైటీ చేసింది. కాని ఆ చర్చలు అంతగా ముందుకు పోలేదు. జర్మనీ నేషనల్ సోషలిస్టు పార్టీలో ఒక ముఖ్యమైన భాగం భారత జాతీయ వాదులకు బ్రిటిష్ సామ్రాజ్యవాదులకు మధ్య జరుగుతున్న పోరాటం విషయంలో తటస్థంగా ఉండటమే ఆ వైఫల్యానికి కారణం. వలస దేశాల యెడల, స్వాతంత్ర్యం లేని పాలితుల యెడల హిట్లరు

వైఖరి స్థిరమైనది కాకపోవటం ఆ జర్మనీ నాయకుల తాటస్థ్యానిక కారణం. అయినప్పటికి జర్మనీ నేషనల్ సోషలిస్టు పార్టీలో కొన్ని అసమ్మతి వర్గాలు ఉన్నాయి. ఆ అసమ్మతి వర్గాలు వలస దేశాలలోని పాలితులతో బ్రిటన్‌కు వ్యతిరేకంగా చేతులు కలపటానికి సిద్ధంగా ఉన్నాయి. బెంగాలులో ఏమైనా రహస్య విప్లవ సంఘాలు పనిచెయ్యటం ప్రారంభించితే వాటికి తమ రహస్య సహాయం తప్పకుండా ఉంటుందని ఆ అసమ్మతి వర్గాలు సుభాసుకు హామీ యిచ్చాయి. సుభాసు జర్మనీలో పని చేస్తున్న భారతీయులను కూడా కలిశాడు. వారిలో కొందరు రాజకీయంగా దేశంనుండి బహిష్కృతులు. వారు మొదటి ప్రపంచయుద్ధంనాటి నుండి జర్మనీ విదేశాంగ శాఖ కార్యాలయం సహకారంతో ఇండియాలో తిరుగుబాటును లేవదీయటానికి ప్రయత్నిస్తున్నారు. కొందరు జర్మనీ సోషలిస్టులతో కలిసి పనిచేస్తున్నారు. ఇంకా మిగిలినవారు ఇండియా నుండి చదువు నిమిత్తం జర్మనీకి వెళ్ళిన భారతీయ విద్యార్థులు. ఈ చివరి వర్గానికి నాయకుడు ఏ.సి.యన్. నంబియార్. ఆయన భారత జాతీయ కాంగ్రెసు తరఫున బెర్లిన్‌లో భారత సమాచార కేంద్రాన్నొక దానిని ఏర్పాటు చేశాడు.

అధికార వర్గాలతో రాజకీయ చర్చలు ఫలవంతం కానందున సుభాను ఇండియా తరఫున పత్రికా ప్రకటనలు యివ్వటం, ఉపన్యాసాలు చెయ్యటం మీద శ్రద్ధ వహించాడు. విద్యాధిక వర్గాలతో సంబంధాలు ఏర్పరచు కున్నాడు. సుభానుకు జర్మన్ అకాడెమీ డైరెక్టర్ అయిన ఫ్రాంజ్ థేర్‌ఫెల్డర్ సన్నిహిత మిత్రుడయ్యాడు. వారిద్దరూ మ్యూనిక్‌లో సమావేశమై ఇండో జర్మన్ సహకారాన్ని గురించి పథకాలు రచించారు. కాని జర్మనీ ప్రభుత్వ వర్గాలు ఆ పథకాలకు అనుకూలంగా స్పందించలేదు. తనకు నిరాశతో బాటు, చిరాకు కూడా కలగటంతో, 1936 మార్చిలో ఇండియాకు వచ్చే ముందు సుభాను చంద్రుడు ఆ డైరెక్టరుకు యీ క్రింది విధంగా రాశాడు:

"ఇటీవల హిట్లర్ మ్యూనిక్ నగరంలో చేసిన ఉపన్యాసం నాజీతత్వం సారాంశాన్ని వెల్లడిస్తుంది. నాజీతత్వం పునాది శాస్త్రీయంగా చాలా బలహీనమైనది. ఐరోపా, ఆసియాలు ఒకదానితో మరొకటి, యుద్ధాన్ని కాంక్షించని పొరుగు ఖండాలుగా ఉండలేవు అనేది చారిత్రకంగా అబద్ధమనీ, మిథ్య అనీ నేను చెప్పదలచాను. జర్మనీ నూతన జాతీయభావం

స్వార్థం, జాతి దురహంకారాలతో ఉత్తేజం పొందింది. మేం మా స్వాతంత్ర్యంకోసం, మా హక్కుల కోసం, ప్రపంచంలోనే అతి పెద్దదైన సామ్రాజ్యంతో పోరాడుతున్నాం. కాగా మరే ఇతర దేశం మమ్మలను అవమానపరిచినా, మా జాతి మీద, సంస్కృతిమీద ఎవరు దాడి చేసినా, మేం సహించలేం, సహించము కూడా."

సాధికారమైన చారిత్రక కారణాల వలన సుభాను ఇటలీ పట్ల గొప్ప ఆసక్తిని కనబరిచాడు. చీలికలు, పేలికలు అయిన ఇటలీ ప్రజలు ఏ విధంగా జాతీయ ఐక్యతను సాధించారో, ఏ విధంగా జాతీయ విముక్తి పోరాటాన్ని నిర్వహించారో, ఏ విధంగా ఐక్య జాతీయ ప్రభుత్వాన్ని స్థాపించారో, తెలుసుకోవటం భారత స్వాతంత్ర సమర యోధులకు అవసరమని సుభాను భావం. ఇటలీలో ఐక్య జాతీయ ప్రభుత్వ స్థాపనకు ఇటలీ స్వాతంత్ర్యోద్యమం కారణమైతే, ఆ స్వాతంత్ర్యోద్యమానికి అగ్రగామిగా ముందుండి దానిని ముందడుగు వేయించిన 'కార్బొనెరి' ఒక రహస్య విప్లవ విప్లవకారుల సంస్థ. సుభాను దాని నిర్మాణాన్ని, అది పని చేసే విధానాన్ని, అతిశ్రద్ధగా అధ్యయనం చేశాడు. ఐరోపాలో తన మిత్రులతోను, భారత విద్యార్థులతోను మాట్లాడేటప్పుడు, సుభాను తరచుగా ఇటలీ నిర్మాత అయిన మాజినీని గురించి ముచ్చటించేవాడు. స్వాతంత్ర్యంకోసం, ప్రజాస్వామిక ఆశయాలకోసం మాజినీ ఇటలీ ప్రజలనందరినీ ఐక్యం చేశాడు. సుభాను చంద్రుడు చారిత్రకంగా మాజినీకి తుల్యమైన వ్యక్తి. ఈ ఇద్దరూ తమ తమ దేశాలలో జాతీయ ఐక్యత, స్వేచ్ఛ సాధించడానికి అగ్రదళంగా ఉండటానికి చిన్నవే అయినా అత్యంత నిర్మాణయుతమైన సైనిక దళాలను రూపొందించారు.

ఇండియా ఆశయంకోసం పిలుపు ఇవ్వగానే తమ సర్వస్వాన్నీ త్యాగం చేయటానికి తగిన విధంగా ఉత్తేజమూ, శిక్షణా పొందిన యువతీయువకులే భారతదేశంలో నూతన, బలమైన, చైతన్యానికి ఆగ్రగాములు కాగలరని సుభాను తన ఐరోపా మిత్రులకు చెప్పాడు.

"సుభాసుగారూ! త్వరలో ఇండియా నిజంగా స్వతంత్ర దేశమౌతుందని మీరు నమ్ముతున్నారా?" అని ఒకసారి ముస్సోలినీ ప్రశ్నించాడు.

"ఔను" అన్నాడు సుభాను గట్టిగా.

"ఐతే మీరు స్వాతంత్ర్యాన్ని సంస్కరణల ద్వారా సంపాదించ దలచారా లేక విప్లవకర మార్గం ద్వారా సంపాదించలచారా?" అని ముసోలినీ మరొక ప్రశ్న వేశాడు. "విప్లవ మార్గానికే నా ఓటు" అన్నాడు సుభాసు. "ఐతే మీకు నిజంగా స్వాతంత్ర్యం వచ్చే అవకాశం ఉంది" అన్నాడు ముసోలినీ.

సుభాసును బాగా ఆకర్షించిన మరొకదేశం టర్కీ. అక్కడ మౌలికమైన సంస్కరణలు అమలు జరిగాయి. ముస్తాఫా కెమాల్ అటాటర్క్ నాయకత్వాన ఆ దేశం ఐక్యమైంది. సుభాసుకు ఇండియా సమస్యలు టర్కీ సమస్యలు ఒకే విధమైనవిగా కన్పించాయి. ఈ రెండు దేశాలలో ఒకే విధమైన సాంఘిక సంస్కరణల అవసరం వుందని ఆయన భావించాడు. ఆధునిక దేశంగా అభివృద్ధి చెందటానికి టర్కీ అవలంబించిన మార్గాలలో కొన్నింటిని ఇండియా అవలంబించటం అవసరమని సుభాసు అనుకున్నాడు. ముఖ్యంగా కెమాల్ అటాటర్క్ జర్మనీ దేశ సాంకేతిక, సైనిక నైపుణ్యాలను ఉపయోగించుకొని టర్కీని ఆధునిక దేశంగా మార్చిన విధానం సుభాసును ఆకట్టుకుంది.

టర్కీ చేసిన సంస్కరణలలో మరొకటి సుభాసును బాగా ఆకర్షించింది. అది లిపికి సంబంధించినది. అప్పటి వరకు టర్కిష్‌భాషకు ఎన్నో స్వదేశీలిపులు ఉండేవి. ఆ లిపుల భిన్నత్వం టర్కీ ప్రజల ఐక్యతకు అడ్డుగా ఉండేది. కాగా కెమాల్ అటాటర్క్ వాటి స్థానంలో రోమన్ లిపిని ప్రవేశపెట్టి, టర్కీ ప్రజలను ఐక్యం చేయటానికి తోడ్పడ్డాడు.

సుభాసు చంద్రుడు ఆ విధంగా టర్కీ ఆధునిక చరిత్రను అధ్యయనం చేసి, కెమాల్ అటాటర్క్ యెడల ఎనలేని అభిమానం ప్రదర్శించాడు.

1934లో తండ్రి జానకీనాథ్ తీవ్రమైన అస్వస్థతకు గురైనట్లు సుభాసుకు వార్త చేరింది. తండ్రి మరణశయ్య పక్కన సుభాసు ఉండాలనే భావంతో, ఆయన విమానంలో బయలుదేరి రావాలని ఆయన కుటుంబం కోరింది. ఆయన ఇండియాకు తొందరగానే బయల్దేరాడు. అయినా ఆయన రాక ఒకటిన్నర రోజులు ఆలస్యమైంది. ఫలితం! ఆయన రాకముందే జానకీనాథ్ మరణించాడు. కాగా ఆయన చివరి కోరిక నెరవేరలేదు.

సుభాసు కలకత్తాలో కాలుపెట్టగానే, ప్రభుత్వం ఆయనను ఎల్గిన్ రోడ్డులో వున్న ఆయన సొంత ఇంట్లో నిర్బంధించింది. ఆయన అక్కడ

సుమారు ఒక నెల రోజులు నిజంగా ఒక ఖైదీలాగా నివసించి, 1935 జనవరి ఆరంభంలో మళ్ళీ వైద్యం చేయించుకోవటానికి, భారతదేశం కోసం తను ఐరోపాలో చేస్తున్న కృషిని పునఃప్రారంభించటానికి ఐరోపాకు తిరిగి వెళ్ళారు.

# 18

గ్రంథరచన ఐరోపాలో అజ్ఞాతవాసం చేస్తూ, సుభాసు చంద్రుడు 'భారతదేశ పోరాటం' అనే తన విశిష్టమైన గ్రంథంలో ఎక్కువ భాగాన్ని రచించాడు. ఆయన ఆరోగ్యం అంతంత మాత్రంగా వున్న రోజుల్లో ఆ రచన చేయటానికి ఆయనకు ఒక సంవత్సరం కంటె ఎక్కువ కాలం అవసరమైంది. అది చారిత్రక కథనాత్మక గ్రంథం. కాని ఆయన దగ్గర ఆ సమయంలో చూడదగిన అధికార తేదీ, గ్రంధాలు వగైరా ఏ బాపతుగానైనా ఉపయోగపడే లిఖితపూర్వకమైన సమాచారం లేదు. కాగా ఆయన రచన అంతా ఆయన తన జ్ఞాపకశక్తిమీదే ఆధారపడి చేయవలసి వచ్చింది.

ఆ గ్రంథం లండన్‌లో 1935 జనవరిలో విడుదల అయింది. ఇండియాను పాలించుతున్న బ్రిటిష్ ప్రభుత్వం, లండన్‌లో వున్న ఇండియా కార్యదర్శి ఆమోదం పొంది, ఒక్క రోజు కూడా ఆలస్యం చెయ్యకుండా ఆ పుస్తకం భారతదేశంలోకి రాకుండా నిషేధించింది. అది "ఉగ్రవాద పద్ధతులను ప్రత్యక్షచర్యను ప్రోత్సహించుతుంది" అని అందుకు కారణంగా ప్రభుత్వం చెప్పింది.

ఆయన గ్రంథం భారతీయ పాఠకుల మీద ఎటువంటి ప్రభావాన్ని కల్గించేది అనే విషయం ఊహించవలసినదిగానే వుండిపోయింది. ఏది ఏమైనా బ్రిటిష్ పత్రికలు ఆ గ్రంథాన్ని సాదరంగా ఆహ్వానించాయి. చక్కగా సమీక్షించాయి. ముఖ్యంగా ఐరోపా రాజకీయ, సాహితీ బృందాలు ఆ గ్రంథాన్ని మెచ్చుకున్నాయి.

"ఇది బహుశా ఇండియా రాజకీయాలను గురించి ఒక భారతీయ రాజకీయవేత్త ప్రాచీన, అత్యంత ఆసక్తిదాయకమైన గ్రంథం. ఇండియా రాజకీయవేత్తలలో అతి పిన్న వయస్కులైన ముగ్గురిలో ఒకరు యీ గ్రంథ రచయిత కావటం దీని ప్రాముఖ్యతను ఎంతో పెంచింది. ఇది గత పధ్నాలుగు సంవత్సరాల ఇండియా రాజకీయ చరిత్ర. ఇది స్పష్టంగా

వామపక్ష దృక్పథంతో రాసిన గ్రంథం. దీని రచయిత ఒక క్రియాశీల రాజకీయవేత్త. అయినా అటువంటి రాజకీయవేత్త కలం నుండి ఇతరులను గురించి ఎటువంటి న్యాయమైన అంచనాలను, హేతుబద్ధంగా ఆశించగలమో దాదాపు అటువంటి నిష్పక్షపాతమైన రచన యీ గ్రంథం" అని ఇంగ్లండ్‌లో ప్రముఖ పత్రిక అయిన మాంచెస్టర్ గార్డియన్ రాసింది.

"భారతదేశ పోరాటం పాఠకుల అభిప్రాయాలకు స్పష్టతను కలుగజేసే ఒక విలువైన గ్రంథం" అని సన్‌డే టైమ్స్ పత్రిక రాసింది.

"ఇదొక ప్రశాంతమైన స్థిరచిత్తంగల, నిష్పక్షపాతమైన రచయిత వ్రాసిన గ్రంథం. ఇది వర్తమాన భారత రాజకీయ పరిస్థితిని గురించి నేను చదివిన పుస్తకాలలో అత్యంత సమర్థవంతంగా రచించిన గ్రంథం అని నా అభిప్రాయం. ఇదొక మత మూఢుడు వ్రాసిన పుస్తకం కాదు. దీని రచయిత విశేషమైన సమర్థుడు. ఆయన ఆలోచనా శక్తి తీక్షణమైనది, నిర్మాణాత్మకమైనది. ఆయన ఇంకా నలుబది సంవత్సరాలు నిండని వాడు. ఆయన ఏ దేశ రాజకీయ జీవితానికైనా ఒక పెన్నిధిగా, ఆభరణంగా చెల్లుబాటు కాగలడు" అని డైలీ హెరాల్డ్ రాజకీయ విలేఖరి రాశాడు.

"విప్లవకారుడుగా సుభాను చంద్రుడు అసాధారణమైన భావ స్పష్టత కలవాడు. ఆయన అందించే సమాచారం చక్కని ఉచ్చారణగల సాక్షి ఇచ్చే సరికొత్త సమాచారం వంటిది," అని న్యూస్ క్రానికల్ అనే పత్రిక రాసింది.

ఆ పుస్తకాన్ని ఇండియాలో నిషేధించిన తరువాత బ్రిటిష్ వామపక్ష రాజకీయ వేత్తలలోను, సాహితీ వర్గాలలోను కొంత సంచలనం కలిగింది. "నేను యీ పుస్తకాన్ని ఎంతో శ్రద్ధగా చదువుతున్నాను. దీని నుండి నేను ఎంతో నేర్చుకుంటున్నాను. ఈ పుస్తకాన్ని రచించిన సుభాను చంద్రునికి నా కృతజ్ఞత." అన్నాడు జార్జి లాన్స్‌బరీ. "భారత స్వాతంత్ర్యోద్యమాన్ని గురించి ఇది తప్పనిసరిగా చదవవలసిన పుస్తకం. ఇందులో చరిత్రకారునికి ఉండవలసిన మంచి లక్షణాలైన ఉదాత్తమైన న్యాయదృష్టి, స్పష్టతలను మీరు ప్రదర్శించారు. మీ స్థిరమైన రాజకీయ అభిప్రాయాలు మెచ్చుకోదగినవి" అని ఫ్రెంచి మేధావి రోమారోలా ఒక ఉత్తరంలో రాశాడు. "ఆద్యతన భావిలో ఇండియాకు స్వాతంత్ర్యం,

ఆనందం, లభించగలవని నేను ఆశిస్తున్నాను" అని ప్రెసిడెంట్ డివాలెరా వ్రాశాడు. రోమ్ నగరంలో సుభాను చంద్రుడు ముసోలినీని కలిసి, ఆయనకు తన పుస్తకం ప్రతినొక దానిని స్వయంగా బహూకరించాడు. ఆ పుస్తకం ప్రతిని అందుకొని ముసోలినీ భారత స్వాతంత్ర్య సమరం పట్ల తన సానుభూతిని వెల్లడించాడు.

ఐర్లండు భారత దేశానికి స్వాతంత్ర్యం యివ్వాలనే విషయంలో అత్యధికమైన ఆసక్తిని చూపించింది. ఆ ఆసక్తికి కృతజ్ఞతా పూర్వకంగా అన్నట్లు, భారతదేశపు జాతీయవాదులు, ముఖ్యంగా బెంగాలు విప్లవకారులు ఐరిష్ ప్రజల స్వాతంత్ర్యోద్యమాన్ని మెచ్చుకున్నారు. ఐర్లండు స్వాతంత్ర్య సమరం నుండి ఉత్తేజాన్ని పొందారు. ఆనాడు బ్రిటన్‌దేశం ఐర్లండు, ఇండియాలకు ఉమ్మడి శత్రువు. కాగా తను ఐరోపాలో ఉన్నప్పుడు, సుభాను చంద్రుడు ఐర్లండు ప్రజల పోరాటాల అనుభవాలను అతి సమీపం నుంచి అధ్యయనం చేశాడు. ఐర్లండు విప్లవకారులు విదేశాల నుండి, ముఖ్యంగా జర్మనీ నుండి సహాయం పొందుటకు అవలంబించిన పద్ధతులను జాగ్రత్తగా పరిశీలించాడు. మొదటి ప్రపంచ యుద్ధ కాలంలో ఐరోపాలో బ్రిటన్‌కు మొదటి నుంచీ ఎదురు నిలిచిన దేశం జర్మనీ.

ఇండియా, ఐర్లండుల స్వాతంత్ర్య సమరాలను తులనాత్మకంగా అధ్యయనం చేసి, ఆ రెండు పోరాటాలలో కొన్ని పోలికలు ఉన్నట్లు సుభాను తెలుసుకున్నాడు. తను బెర్లిన్‌లో ఉండగానే డివాలెరాతో వ్యక్తిగత సంబంధాలు పెట్టుకున్నాడు. ఆ నాయకులిరువురు 1936 ప్రారంభంలో డబ్లిన్ నగరంలో సమావేశమై ఉభయులకూ ఆసక్తిదాయకమైన విషయాలెన్నింటినో చర్చించారు.

తరువాత ఇంగ్లీషు, ఫ్రెంచి, జర్మన్ భాషలలో భారత దేశాన్ని గురించి కరపత్రాలను అచ్చువేయించి, ఐర్లండునుండి అంతర్జాతీయ పత్రికారంగానికి వాటిని పంపించటానికి సుభాను ఏర్పాట్లు చేశాడు. ఆ రోజులలో ఇండో-ఐరిష్ స్వాతంత్ర్య సమితి ఒకటి ఐర్లండులో పనిచేస్తూ ఉండేది. ఐర్లండు విప్లవకారిణి అయిన మదాం మాడ్ గాన్ మాక్ బ్రైడ్ దాని నాయకురాలు. ఆమె ఎంతో పేరు ప్రఖ్యాతులుగల మహిళ. సుభాను ఐర్లండు సందర్శన ఆమె నాయకత్వాన పనిచేస్తున్న ఆ ఇండో-ఐరిష్ స్వాతంత్ర్య సమితికి ఎంతో ఉత్తేజాన్ని కలుగజేసింది.

సుభాను చంద్రుడు ఐరోపాలో ఉండగానే, 1934లో ఇండియా జాతీయ వేదిక మీద కాంగ్రెసు సోషలిస్టు పార్టీ అవతరించింది. ఇండియా రాజకీయాలలో అవతరించిన యీ వామపక్ష తరంగాన్ని సుభాషు చంద్రుడు ఆహ్వానించాడు. దాని అవతరణకు దారితీసిన స్వాభావిక ప్రవృత్తి చారిత్రకంగా సరియైనదేనని భావించాడు. కాని ఆ సోషలిస్టులలో నజాతీయత లోపించిందనీ, వారి భావాలలో కొన్ని కాలం చెల్లినవనీ, వారికి స్పష్టమైన సిద్ధాంతం, కార్యక్రమం, కార్యాచరణ పథకం అవసరం అని ఆయన అనుకున్నాడు. రేఖామాత్రంగా చెప్పాలంటే, భావిభారత రాజకీయపక్షం స్వార్థపరుల ప్రయోజనాల కోసంకాక సామాన్య ప్రజల ప్రయోజనాలకోసం పోరాడాలన్నాడు. అది భారతీయుల సంపూర్ణ రాజకీయ, ఆర్థిక విముక్తికోసం పోరాడాలన్నాడు. స్వతంత్ర భారతదేశాన్ని స్థిరమైన పునాదిపై నిర్మించే నిమిత్తం కొంతకాలం స్వతంత్ర భారతకేంద్ర ప్రభుత్వానికి నిరంకుశ అధికారాలను కట్టబెట్టటానికి అంగీకరించినా, ఆ రాజకీయ పక్షం స్వతంత్ర భారతదేశం అంతిమ గమ్యం విభిన్న రాష్ట్రాల సమాఖ్య అనే విషయాన్ని విస్మరించరాదన్నాడు. అది ప్రభుత్వరంగం మీద, ప్రణాళికాబద్ధమైన పారిశ్రామిక, వ్యావసాయక అభివృద్ధి మీదా శ్రద్ధ చూపాలన్నాడు. ఆ పార్టీ సాంఘిక అడ్డుగోడలైన కులం వంటి వాటిని నిర్మూలించాలనీ, ప్రాచీన భారతీయ సాంప్రదాయానికి తగినట్లుగా గ్రామ పంచాయతీల మీద ఆధారపడే నూతన సాంఘిక వ్యవస్థను నిర్మించాలనీ, సుభాను చంద్రుడు ఉద్ఘాటించాడు. ఆ పార్టీ భూస్వామిక విధానాన్ని రద్దుచేసి, భారతదేశం అంతటికీ వర్తించే ఒకే విధమైన భూస్వామ్యాన్ని అమలు చెయ్యాలన్నాడు. భారతదేశానికి కావలసింది విక్టోరియా మహారాణి కాలంలో ఇంగ్లండులో వున్న ప్రజాస్వామిక విధానం కాదంటూ, ఇండియాను ఒకే ఒక దేశంగా ఉంచగల సైనిక క్రమశిక్షణ వంటి క్రమశిక్షణగల రాజకీయ పక్షం ఇండియాకు అవసరమన్నాడు. ఆ రాజకీయ పక్షం దేశంలోని వివిధ తీవ్రవాద సంస్థలను ఒక జాతీయ కార్యనిర్వాహక సమితి నాయకత్వాన ఏకం చేసి, ఒకే సమయంలో దేశం అంతటా జాతీయ స్థాయిలో దేశ పునర్నిర్మాణ కార్యక్రమాలు నడిచేటట్లు చెయ్యాలని సుభాను ఆశించాడు.

కమ్యూనిజాన్ని గురించి చెప్పుతూ, అది ఇండియాకు తగిన విధానం

కాదనటానికి విభిన్నమైన కారణాలున్నాయన్నాడు. ఇండియా స్వాతంత్ర్యోద్యమం ముఖ్యంగా జాతీయ ఉద్యమమనీ, ప్రధాన ఆశయం భారతీయ ప్రజలకు పరజాతి పాలన నుండి విముక్తి కల్గించటం అనీ వివరించాడు. ఒక విధంగా చెప్పాలంటే, సంశ్లేషణను లేక సమానత్వాన్ని బోధించే సిద్ధాంతాన్ని రూపొందించటం ఇండియా కర్తవ్యం అవుతుందనీ, ఆ సిద్ధాంతం మీదనే భావిభారత సమాజం ఆధారపడాలనీ సుభాను వివరించాడు. ఆ సిద్ధాంతానికి ఆయన 'సామ్యవాదం' అని పేరు పెట్టాడు. అది సాంఘిక వైరుధ్యాలను తొలగించిన తరువాత ఏర్పడే సుసంయోజిత వ్యవస్థను గురించి అభివ్యక్తీకరించే పురాతన భారతీయ పదం.

1935లో సుభానుకు శస్త్ర చికిత్స చేసి చెడిపోయిన పిత్తాశయాన్ని తీసివేయవలసి వచ్చింది. ఆ రోజులలో శస్త్ర చికిత్స ప్రక్రియలు చాలా హానికరంగా ఉండేవి. పైగా సుభాను ఆ సంకటస్థితిని స్వదేశానికి, బంధు మిత్రులకు దూరంగా ఉన్నచోట ఎదుర్కొనవలసి వచ్చింది. కాగా ఏదైనా అనుకోని ఆపద సంభవించితే, ఆయన ఆయన బంధు మిత్రులకు యివ్వదలచిన సందేశం ఏమిటో రాత పూర్వకంగా యివ్వమని ఆ ఆస్పత్రి వైద్య బృందం ఆయనను కోరింది. అప్పుడు ఆయన ఒక చిన్న కాగితం ముక్క మీద ఇలా రాశాడు. "నా సొత్తు నా దేశ ప్రజలకు, నా అప్పులు మా అన్న శరత్‌కు చెందాలని!"

తన ఐరోపా యాత్రలో భాగంగా సుభాను చంద్రుడు స్విట్జర్లాండ్‌ను కూడా సందర్శించాడు. జెనీవాలో వున్న నానాజాతి సమితి ఆఫీసు వసారాలలో అటూ, ఇటూ తిరుగుతూ, ప్రతి గది తలుపునూ తట్టి, భారత దేశానికి స్వాతంత్ర్యం యివ్వవలసిన అవసరాన్ని గురించీ, స్వాతంత్ర్యం పొందటానికి భారతదేశానికి గల హక్కును గురించీ, వినిపించాడు. కాని నానాజాతి సమితిలో బలం న్యాయాన్ని ప్రభావితం చేస్తూ వుందనీ, అస్వతంత్రుల వాక్కు దానికి వినిపించటం లేదనీ, గ్రహించి సుభాను చంద్రుడు చాలా నిరాశ చెందాడు.

ఐరోపాలో సుభాను కలిసిన మేధావులలో రోమారాలో ఒకరు. ఆయన ఒక గొప్ప ఫ్రెంచి రచయిత, ఇండియాకు మిత్రుడు. సుభాను చంద్రుని కలిసిన తరువాత, ఆయన తన దిన చర్య పుస్తకంలో ప్రపంచం విస్మరించిన ఓ దూర దేశం నుండి వచ్చిన ఒక యువయాత్రీకుని గురించి

అంటూ, యీ క్రింది ఆసక్తికరమైన వాక్యాలు రాశాడు:

"ఆ యువకుడు చాలా గంభీరమైనవాడు, కార్య నిమగ్నత కలవాడు, తెలివి కలవాడు. ఆయన ఇటీవల ప్రచురించిన పుస్తకం యీ విషయాలను రుజువు చేసింది. ఆయన మనుషులను, సంఘటనలను కూడా ఒక నిజమైన రాజనీతిజ్ఞునివలె గణనీయమైన వస్తుగత దృష్టితో పరిశీలించాడు. ఆయన ఉగ్రవాదాన్ని ఆరోగ్యకరమైన విధానంగా పరిగణించాడు. నిర్మాణాత్మక ప్రతిఘటనకు ఆయన అనుకూలుడు. పోరాటానికి దౌర్జన్యం అవసరమైతే, అది హింసాత్మకం అయినా ఆయనకు ఆభ్యంతరం లేదు. ఆయన బోళా మనిషి. అందుకే యూరపులో ఒక యుద్ధం ఇంగ్లండుకు పని కల్పిస్తే, ఇండియాకు స్వాతంత్ర్యం లభించే అవకాశాలు పెరుగుతాయనే తన ఆశను దాచుకోలేదు. ఇండియా స్వాతంత్ర్యం పొందటానికి సోవియట్ యూనియన్ సహాయం అందించటం వల్ల ఎలాంటి అపకారం లేదని ఆయన భావించాడు."

# 19

1936 ఆరంభంలో తనకు తగినంతగా స్వస్థత చేకూరిందని భావించి, సుభానుచంద్రుడు స్వదేశానికి తిరిగి వెళ్ళి పోవాలనుకున్నాడు. ముఖ్యంగా కొద్ది నెలల తరువాత జవహర్లాల్ అధ్యక్షతను లక్నోలో జరుగనున్న కాంగ్రెసు మహాసభకు హాజరై తీరాలనుకున్నాడు. కాని ఆయన పథకాలను తెలిసికొని బ్రిటిష్ ప్రభుత్వం తన ఆస్ట్రియా రాయభారి కార్యాలయం ద్వారా ఆయనకొక లిఖితపూర్వకమైన హెచ్చరికని పంపించింది. ఆయన ఇండియాకు వెళ్ళితే, ఇండియాలో ఆయన స్వేచ్ఛగా ఉండటానికి వీలులేక పోవచ్చునని ఆ హెచ్చరిక ద్వారా ఆయనకు తెలియజేసింది. ఐనప్పటికి సుభాను చంద్రుడు ఆ మార్చి నెలలో ఇండియా వెళ్ళే ఓడ ఎక్కాడు. ఆయన బొంబాయిలో అడుగు పెట్టగానే, అరెస్టు చేశారు. తరువాత ప్రభుత్వం ఆయనను డార్జిలింగ్ దగ్గర కుర్సియోంగ్‌లోగల శరత్ భవనానికి మార్చింది. అక్కడ ఆయనను గృహ నిర్బంధంలో ఉంచింది. అంతకు ముందు ఒకసారి, అనగా పూర్వం శాసనోల్లంఘన ఉద్యమం కాలంలో శరత్ చంద్రుని గృహనిర్బంధంలో ఉంచటానికి ఉపయోగపడింది కూడా ఆ భవనమే.

ఆ రోజులలో యీ జీవిత చరిత్ర రచయిత ఒక చిన్న విద్యార్థిగా ప్రభుత్వ ప్రత్యేక అనుమతితో కుర్సియోంగ్‌లో సుభాను చంద్రుని కలిసే అదృష్టానికి నోచుకున్నాడు. అప్పుడు యీ రచయితకు సుభాను చంద్రుని సుకుమార హృదయాన్ని గురించి, ఆయన వ్యక్తిత్వపు సౌకుమార్యాన్ని గురించి, ఆయన అంతస్తు, స్వభావాలను గురించి, వివిధ జాతీయ, అంతర్జాతీయ సమస్యల పట్లగల అవగాహనను గురించి తెలిసింది. అప్పటికే ఇండియా జాతీయ నాయకుడు కావటానికి కావలసినంత పరిపక్వత సుభానులో ఉందని యీ రచయితకు అప్పుడు స్పష్టమైంది.

పూర్వం జైళ్ళల్లోవలె, మళ్ళీ సుభాను ఆరోగ్యం క్షీణించింది. ఆ సంవత్సరాంతంలో ఆయనను కలకత్తాకు మార్చి, అక్కడ వైద్య కళాశాలలో పోలీసు రక్షణలో ఉండవలసిన ఖైదీగా ఉంచారు. ఆయన జబ్బు

తిరగబెట్టటానికి కారణం తెలునుకునే నిమిత్తం వైద్యులు ఎన్నో పరీక్షలు చేశారు. ఇది ఇలా ఉండగా, 1935 ఇండియా చట్టం ప్రకారం జరిగిన ఎన్నికల అనంతరం ఇండియా రాజకీయ రంగంలో ఎన్నో మార్పులు జరుగనున్న తరుణంలో తను కేవలం ఒక పరిశీలకుడుగా ఉండిపోవలసి వచ్చినందుకు సుభాను చంద్రుడు చాలా బాధపడ్డాడు. అప్పటికి ఒక నంవత్సరం ముందు జైలు నుండి విడుదల అయిన ఆయన అన్నగారైన శరత్ బెంగాల్ కాంగ్రెసు నాయకత్వం బాధ్యతను పార్టీ తరఫున ఎన్నికల ప్రచారాన్ని నిర్వహించే బాధ్యతను స్వీకరించి వున్నాడు.

జైలులో వున్న సుభాను యెడల ఇండియా ప్రభుత్వం పగపట్టిన శత్రువు వలె ప్రవర్తించింది. ఆ ప్రవర్తనను భారతదేశం యావత్తూ ఖండించింది. బోను మీద చేసిన ఆరోపణలను కోర్టులో రుజువు చెయ్యమని నవాలుచేస్తూ, ప్రతిపక్షం కేంద్ర శాసన సభలో ఒక వాయిదా తీర్మానాన్ని ప్రవేశపెట్టింది. ఆ తీర్మానం నెగ్గింది. ఆయన నిర్బంధం కొనసాగింపుకు వ్యతిరేకంగా ఆ మే నెలలో భారతదేశం అంతటా ఒక రోజు హార్తాళ్ జరిగింది. అయినా పరాయి ప్రభుత్వం కదలలేదు.

తరువాత, దాదాపు ఒక సంవత్సరం గడిచిన పిదప, 1937 మార్చి నెలలో ఆయన ఆరోగ్యం క్షీణించుతూ ఉందంటూ, ఆ ప్రభుత్వం సుభానును బేషరతుగా విడుదల చేసింది. వెంటనే దిలీప్ కుమార్ రాయ్ అనే పేరుగల ఆయన ప్రాణ స్నేహితుడు సుభాను చంద్రుని కలిశాడు. తరువాత "ఆయన కళ్ళచుట్టూ నల్లని వలయాలు ఏర్పడినప్పటికి, కళ్ళు లోతుకు పోయినట్లు కన్పించినప్పటికీ, సుభాను చంద్రుడు బాగా ఆధ్యాత్మికంగా ఎదిగినట్లు కన్పించాడు. అంతకు ఎనిమిది నంవత్సరాలకు ముందు కన్పించని ఆధ్యాత్మిక కాంతి, ఆయన కళ్ళల్లో కన్పించింది." అన్నాడు దిలీప్ కుమార్ రాయ్.

జైలునుండి విడుదల అయిన సుభాను చంద్రునికి కలకత్తా నగరం బ్రహ్మాండమైన స్వాగతం పలికింది. కాని సుభాను ఆరోగ్యం అంత బాగా లేదు. కాగా వైద్యుల నలహానుసరించి డల్‌హౌసిలో కొన్ని నెలలు ఆయన విశ్రాంతి తీసుకున్నాడు. డల్‌హౌసి ఉత్తర హిందూస్థానంలో ఒక ఆరోగ్య కేంద్రం. సుభాను ఇంగ్లండులో విద్యార్థిగా వుండగా పరిచయమైన ధర్మవీర దంపతులు ఆయనకు డల్‌హౌసిలో ఆతిథ్యం

యిచ్చారు. వారు సుభాసుకు ఆప్త మిత్రులై ఆయనను మళ్ళీ మనిషిగా చెయ్యటానికి కంకణం కట్టుకున్నారు.

ఈ లోపల దేశంలో సాధారణ ఎన్నికలు జరిగాయి. బ్రిటిష్ ఇండియాలోగల పదకొండు రాష్ట్రాలలో ఆరింటిలో కాంగ్రెసుకు సంపూర్ణ ఆధిక్యత లభించింది. బెంగాలు, అస్సాం వంటి రాష్ట్రాలలో కాంగ్రెసు అత్యధిక శాసనసభ స్థానాలను గెలిచిన పార్టీగా అవతరించింది. బెంగాలు కాంగ్రెసు శాసనసభ పక్షానికి శరత్ నాయకుడుగా ఎన్నికయ్యాడు. అప్పుడు బెంగాలులో వున్న కృషిక్ ప్రజాపార్టీకి వి.కె. ఫజ్లుల్ హక్ నాయకుడు. ఆ పార్టీతో కలిసి సంకీర్ణ ప్రభుత్వాన్ని ఏర్పరచి, మతతత్వ రాజకీయపక్షమైన ముస్లిం లీగ్‌ను ఏకాకిని చెయ్యాలని బోసు సోదరులు ఆలోచించారు. కాని కాంగ్రెసు నాయకత్వం సంకీర్ణ ప్రభుత్వాలను ఏర్పరచటానికి అంగీకరించనందున, బోసు సోదరుల పథకం నిష్ఫలమైంది.

1937వ సంవత్సరం చివరలో అఖిల భారత కాంగ్రెసు కమిటీ సమావేశం జరిగింది. మరుసటి సంవత్సరం గుజరాత్‌లోని హరిపురలో జరుగనున్న కాంగ్రెసు మహాసభకు సుభాసు చంద్రుడు అధ్యక్షుడుగా ఎన్నిక అవుతాడనే వదంతి సర్వత్రా వ్యాపించింది. ఆ పరిస్థితులలో తన ఆరోగ్యాన్ని కొంచెం మెరుగుపరచుకోవటం కోసం, ఐరోపా రాజకీయ పరిస్థితిని ఒకసారి స్వయంగా అవలోకించటం కోసం, భారమైన కాంగ్రెసు అధ్యక్ష పదవి బాధ్యతలను స్వీకరించకముందే, ఐరోపా వెళ్ళి రావాలని సుభాసు చంద్రుడు నిర్ణయించుకున్నాడు. ఆ నిర్ణయం ప్రకారం సుభాసు మొదట ఆస్ట్రియాను దర్శించాడు. అక్కడ తనకు ఇష్టమైన బడ్గా స్టెయిన్ ఆరోగ్య కేంద్రంలో కొద్దికాలం ఉన్నాడు. ఇక్కడే ఆయన సుమారు పది రోజులలో 'ఒక ఇండియా యాత్రీకుడు' ('యాన్ ఇండియన్ పిల్‌గ్రిమ్') అనే శీర్షికతో తన స్వీయ చరిత్రను రాశాడు. అయితే అది అసంపూర్ణం. ఒక బ్రిటిష్ ప్రచురణాలయంతో తను చేసుకున్న ఒప్పందం షరతులను నెరవేర్చటంలో భాగంగా ఆయన ఆ పుస్తకాన్ని రాశాడు. ఆయన పది అధ్యాయాలను మాత్రమే వ్రాశాడు. తను 1921లో ఐ.సి.యస్. ఉద్యోగానికి రాజీనామా పెట్టిన సంఘటనతో పదవ అధ్యాయం ముగిసింది. దురదృష్ట వశాత్తు తరువాత ఆయన రాజకీయ జీవితం, పని ఒత్తిడి, ప్రయాసలతో కూడి ఉన్నందున ఆయన తన స్వీయ చరిత్ర

రచనను పూర్తి చెయ్యనే లేదు.

ఇండియాకు రాకముందు సుభాసు చంద్రుడు 1938 జనవరిలో లండన్ వెళ్ళాడు. ఆయన లండన్‌లో ఉన్నప్పుడు కాంగ్రెసు ఆయనను లాంఛనప్రాయంగా అధ్యక్షునిగా ఎన్నుకుంది. లండన్‌లోనే, భారతదేశం తన స్వాతంత్ర్య సమరాన్ని నిర్వహించటానికి తన స్వశక్తి మీదనే ఆధారపడుతుంది కాని ఇంగ్లండులో వుంటూ, తమంతట తాము ఇండియా మిత్రులుగా ప్రకటించుకొనే వారి దయాదాక్షిణ్యాల మీద ఆధారపడదు అని సుభాసు ముక్కు సూటిగా స్పష్టంగా ప్రకటించాడు.

అప్పుడు ఆయన ఇద్దరు ప్రముఖులను కలిశాడు. వారిలో ఒకరు 'ఐరిష్ ఫ్రీ స్టేట్' అనే ఐర్లండు సమానాంతర ప్రభుత్వం తరఫున బ్రిటిష్ పాలకులతో అతి సున్నితమైన చర్చలు జరుపుతున్న ఐర్లండు ప్రజానాయకుడు ఈమన్ డివాలెరా ఒకరు. అప్పుడు ఇంటర్వ్యూ కోసం సుభాసును కలిసిన మాంచెస్టర్ గార్డియన్ పత్రిక యిలా రాసింది. "సుభాసు చంద్రుని ప్రశాంతమైన ధోరణి, నిశ్చయాత్మకంగా ఆయన భారతదేశం సమస్యలను చర్చించిన విధానం కూడా, ఆయనకు మొదటిసారిగా కలిసిన ఆంగ్లేయులను మంత్రముగ్ధులను చేసింది."

బ్రిటిష్ కమ్యూనిస్టు పార్టీ నాయకులలో ఒకరైన రజనీ పామీదత్తు ఆయన లండన్‌లో కలిసిన రెండవ ప్రముఖుడు. ఆయనతో జరిపిన ఇంటర్వ్యూలో భారత జాతీయోద్యమం తదుపరి దశలో, భారత జాతీయ కాంగ్రెసు నిర్వహించవలసిన పాత్రకు సుభాసు ఆయనకు స్పష్టంగా వివరించాడు. తదుపరి దశలో ప్రజాచైతన్యం, గతి వేగం యింకా పెరుగుతుందన్నాడు. విశాలమైన, సామ్రాజ్యవాద వ్యతిరేక వేదిక మీద పెరుగుతున్న ప్రజా చైతన్యాన్ని సమీకరించి, దానిని సరియైన పంథాలో నడిపించటం కాంగ్రెసు కర్తవ్యం అన్నాడు. ఈ ప్రకటనకు వివరణను యిస్తూ భారత కార్మిక, కర్షక సంఘాలనన్నింటిని సామూహికంగా కాంగ్రెసుకు అనుబంధించి, కాంగ్రెసు పునాదిని ప్రజాబలం మీద ఆధారపడేటట్లు చెయ్యాలనీ, కాంగ్రెసు ఒక నిజమైన అఖిలపక్ష జాతీయ సంఘటనగా మారాలనీ, సుభాసు ఉద్ఘాటించాడు. ఇంకా మనకు ఇండియాలో మొదట కావలసింది జాతీయ విముక్తి అనీ, తరువాత మనం సోషలిస్టు పంథాలో నడుస్తామనీ చెప్పాడు. కాగా, భారత జాతీయ కాంగ్రెసు

సామ్రాజ్యవాద వ్యతిరేక సంఘటనగా వృద్ధి చెందాలనీ, రాజకీయ స్వాతంత్ర్యం సంపాదించటం, సోషలిస్టు రాజ్య స్థాపన - ఇవి రెండూ - కాంగ్రెసు ఆశయాలు కావాలనీ సుభాసు తన సొంత అభిప్రాయంగా పునరుద్ఘాటించాడు.

1938 జనవరి ఆఖరి వారంలో సుభాసు చంద్రుడు ఇండియాకు తిరిగి వచ్చాడు. కలకత్తా ఆయనకు అపూర్వమైన, అత్యద్భుతమైన స్వాగతం ఏర్పాటు చేసింది. ఆయన భారత జాతీయ కాంగ్రెసు అధ్యక్షుడు కావటం బెంగాలు రాజకీయ స్వభావాన్ని వాతావరణాన్ని మార్చింది. జాతీయ వాదులనే ఎన్నో విభిన్నమైన బృందాలుగా, దళాలుగా విడదీసిన ఆ సమస్యాత్మక రాష్ట్రం ఒక్కసారి మహత్తరమైన ఘనతను అంతకుముందు 1922లో గయ కాంగ్రెసుకు దేశబంధు అధ్యక్షుడైన తరువాత, మరొక బెంగాలీ ఎవరూ కాంగ్రెసు అధ్యక్ష పదవికి ఎన్నిక కాలేదు. హారిపుర కాంగ్రెసు మహాసభ కాంగ్రెసు ఏబది ఒకటవ వార్షిక సమావేశం. కాంగ్రెసు వార్షిక మహా సభలను గ్రామ సీమలలో జరిపే విధానానికి ప్రత్యేకమైన ప్రాముఖ్యత వుంది. తత్ఫలితంగా కాంగ్రెసు నాయకులు, కార్యకర్తలు పల్లెలలో నిరుపేదలుగా, నిర్లక్ష్యం చేయబడిన జనంగా పడివున్న ప్రజలు ముఖాముఖి ఒకరినొకరు కలుసుకునే అవకాశం, ఒకరిని గురించి ఒకరు తెలుసుకొనే అవకాశం వారికి లభించాయి.

అప్పుడు వెంటనే సుభాసు నిర్వర్తించవలసిన అతి ముఖ్యమైన పని హారిపుర కాంగ్రెసు మహాసభకు అధ్యక్షోపన్యాసం రాయటం. ఆయన దానిని ఆఖరి నిమిషంలో రాశాడు. అంతేకాదు. ఆయన దానిని అతి ఉత్సాహంతో, రాసింది దిద్దకుండా, చిత్తు ప్రతి, శుద్ధ ప్రతి అంటూ లేకుండా, ఒకేసారి రాశాడు. ఎల్గిన్ రోడ్డులో వున్న ఆయన పూర్వీకుల ఇంట్లో తన గదిలో కూర్చొని, పేజీ వెంట పేజీ రాసి, ఉడ్ బర్న్ పార్కు దగ్గర వున్న తన సోదరుని ఇంటికి ఆ ఉపన్యాసం పేజీలను త్వరత్వరగా పంపించాడు. అక్కడ శరత్ కార్యాలయం దానిని టైప్‌చేసి ముద్రణాలయానికి పంపించింది. అయినా దాని అచ్చు ప్రతిని అందుకోకుండానే సుభాసు, ఆయన తల్లి, ఇంకా ఆయన ఇతర బంధువులు హారిపురకు బయల్దేరి వెళ్ళారు. ఆ మరునాడు కాంగ్రెసు బహిరంగ సభలో దానిని పంచిపెట్టవలసిన సమయానికి అది హారిపురకు చేరింది.

# 20

1938 ఫిబ్రవరిలో కాంగ్రెసు మహాసభలు జరిగే హరిపుర గ్రామానికి సుభాసు చంద్రుడు చేరగానే ఆయనకు సాంప్రదాయకమైన స్వాగతం లభించింది. అది ఘనమైన స్వాగతం కూడా.

ఏబది ఒక జతల తెల్లని ఎడ్లు లాగే రథంపైన ఆయనను ఎక్కించి, మేళతాళాలతో కాంగ్రెసు కార్యకర్తలు ఆయనను సభాస్థలికి తీసికొని వెళ్ళారు. దారి పొడవునా ఆయనకు వేలాది గ్రామీణ ప్రజలు అభినందనలు తెలియజేశారు.

పతాకావిష్కరణోత్సవానికి జాతీయ నాయకులంతా హాజరయ్యారు. వారి సమక్షంలో ఆనాడు రాష్ట్రపతిగా సంబోధించబడే కాంగ్రెసు అధ్యక్షుడు (సుభాసు చంద్రుడు) "ఇండియాను ఇంకా బానిసత్వంలో వుంచగల శక్తి యీ భూమి మీద లేదు" అని ఉద్ఘాటించాడు.

ఆయన హరిపుర కాంగ్రెసు అధ్యక్షోపన్యాసం ఒక బ్రహ్మాండమైన, చారిత్రక విలువగల, భావితరాల వారు అధ్యయనం చేయదగిన పత్రం. ప్రప్రథమంగా ఆయన ఆ ఉపన్యాసంలో మానవ జాతి చరిత్ర విహంగ దృశ్యాన్ని యిచ్చాడు. సామ్రాజ్యవాదంలో దాగివున్న పరస్పర వైరుధ్యాలను, సామ్రాజ్యాల అవతరణ, పతనాలను శ్రోతలకు గుర్తు చేశాడు. బ్రిటిష్ సామ్రాజ్యవాదం దాని భారాన్ని అది మొయ్యలేక, దాని అంతర్గత వైరుధ్యాల వల్లనే, పతనమై తీరుతుందన్నాడు. బ్రిటన్‌లో వున్న అభివృద్ధి నిరోధక శక్తులను ఎన్నో దేశాల బానిసత్వం పోషించి, బలిపించిందని లెనిన్ చెప్పిన విషయాన్ని ఆయన శ్రోతలకు గుర్తు చేశాడు. ఇండియా భవిష్యత్తు కోసం, బానిసత్వంలో మగ్గుతున్న ఎన్నో దేశాల శ్రేయస్సు కోసం, చివరకు బ్రిటన్ శ్రేయస్సు కోసం కూడా. ఎన్నో విషయాలను విస్మరించి బ్రిటిష్ సామ్రాజ్య విచ్ఛిత్తికోసం పోరాడటం, భారతీయులందరి చారిత్రక కర్తవ్యమని, సుభాసు చంద్రుడు ఉద్ఘాటించదలచినట్లు ఆ ఉపన్యాసం మొదటి బాగమే స్పష్టం చేసింది.

'విభజించి-పాలించు' అనే సూత్రాన్ని ప్రపంచం నలుమూలలా దక్షతతో, పద్ధతి ప్రకారం, నిర్దాక్షిణ్యంగా ఆచరణలో పెట్టిన బ్రిటిష్ సామ్రాజ్యవాదుల చర్యను సుభాసు చంద్రుడు ప్రత్యేకంగా తన శ్రోతల దృష్టికి తెచ్చాడు. ఆ విభజన సూత్రమే బ్రిటిష్ ప్రభుత్వం ప్రవేశపెట్టిన నూతన భారత రాజ్యాంగంలో దాగి ఉందని సుభాసు చెప్పాడు. ఇంతేకాదు, విభిన్న మతస్థులను విడదీసి ఉంచటానికి మాత్రమే గాక, సమాఖ్య విధానంలో సంస్థానాధిపతులను, ఎన్నికైన ప్రతినిధులను ఒకరిపైకి ఒకరిని ఉసిగొలిపి, 'విభజించి-పాలించు' అనే సూత్రానికి శాశ్వతత్వం కల్గించడం బ్రిటిష్ ప్రభుత్వం యోచన అని సుభాసు బయటపెట్టాడు. ఆ రాజ్యాంగాన్ని తిరస్కరించినట్లయితే "బ్రిటిష్ వాళ్ళు వాళ్ళ చాతుర్యంతో భారతదేశాన్ని విభజించేందుకు, భారత ప్రజానీకానికి జరిగే అధికార బదిలీని నిర్వీర్యం చేసేందుకు, ఏదో ఒక రాజ్యాంగ సూత్రాన్ని రూపొందించగలరు" అని సుభాసు దేశ ప్రజానీకాన్ని హెచ్చరించాడు.

అదే సమయంలో ఐర్లండు, ఇండియా, పాలస్తీనా, ఈజిప్టు, ఇరాక్ దేశాలలో ఇంగ్లండు ఒకేసారి ఇబ్బందులలో ఇరుక్కున్న విషయాన్ని శ్రోతలకు గుర్తుచేసి, సుభాసు తన ఉపన్యాసంలో ఒక ఆశావహామైన అంశాన్ని ధ్వనింపచేశాడు. ఆనాడు బ్రిటిష్ సామ్రాజ్యం వెలుపలనుండి, అనగా మధ్యధరా సముద్ర ప్రాంతమైన ఇటలీ నుండి, దూర ప్రాచ్య ప్రాంతమైన జపాను నుండి కొంత ఒత్తిడిని ఎదుర్కొంటున్నది. ఈ ఒత్తిళ్ళకు తోడు, సోవియట్ రష్యా ఉనికి సామ్రాజ్యవాద పాలకుల గుండెల్లో రైళ్ళను పరిగెత్తిస్తూ వుంది. పైగా ఆనాడు బ్రిటన్ ఇంకా ఎంతమాత్రం సముద్రాల రాణి కాదు. వైమానిక శక్తి మానవ చరిత్రలో ఒక నూతన శక్తిగా అవతరించి, బ్రిటిష్ సామ్రాజ్యానికి ఒక నూతన సవాలుగా నిలబడింది. కాగా రాష్ట్రపతిగా (కాంగ్రెసు అధ్యక్షుడుగా) సుభాసు చంద్రుడు స్వాతంత్ర్యం కోసం పోరాడుతున్న నాటి ఇండియా, ఆ అంతర్జాతీయ రాజకీయ పరిస్థితుల అన్యోన్య ప్రభావం వలన పూర్వం కంటె చాలా ఎక్కువ బలమైన దేశంగా అవతరించింది అని ఉద్ఘాటించాడు.

భారతీయుల ఐక్యతను గురించి మాట్లాడుతూ, భారత జాతీయ స్వాతంత్ర్యమునకు సంబంధించిన రాజనీతి సూత్రాలకు భిన్నం కాని తుది పరిష్కారం చేసుకోవటానికి అది తగిన సమయం అన్నాడు. మన

ఉమ్మడి ఆర్థిక, రాజకీయ ప్రయోజనాలను నొక్కి చెప్పుకోవటం, పరిరక్షించుకోవటం ద్వారానే మనం మత విభేదాలను అధిగమించగల మన్నాడు. "నువ్వు బ్రతుకు ఇతరులను బ్రతకనివ్వు. ఎవరికి వారిని వారి అంతరాత్మ ప్రబోధం ప్రకారం, మత సాంప్రదాయాల ప్రకారం బ్రతకనివ్వు. విభిన్న భాషా ప్రాంతాలవారికి సాంస్కృతిక స్వయం పాలనను యిద్దాం" అని చెప్పే కాంగ్రెసు విధానాన్ని ఆయన పునరుద్ఘాటించాడు.

స్వాతంత్ర్యం కోసం జరిగే జాతీయోద్యమంలో కాంగ్రెసు అవలంబించే పద్ధతిని నిర్వచించుతూ, అది అహింసాయుతమైన సహాయ నిరాకరణోద్యమంలా ఉంటుందనీ, శాసనోల్లంఘనం కూడా అందులో భాగంగానే ఉంటుందనీ సుభాసు చంద్రుడు చెప్పాడు. పరపాలనను సాత్వికంగా ప్రతిఘటించటం మాత్రమే భారత జాతీయ స్వాతంత్ర్య పోరాట విధానంగా ఉండదని ఆయన స్పష్టంగా ప్రకటించాడు. ఆయన దృష్టిలో సత్యాగ్రహం అంటే, సాత్విక నిరోధం మాత్రమే కాదు. అందులోనే క్రియాశీల ప్రతిఘటన కూడా ఇమిడి ఉంది. తన దృష్టి ప్రకారం మన జాతీయ ఉద్యమ చరిత్రలో కాంగ్రెసు పాత్ర ఎలా ఉంటుంది అనే ప్రశ్నకు ఆయన వివరంగా సమాధానం యిస్తూ, కాంగ్రెసు దేశానికి స్వాతంత్ర్యాన్ని సంపాదించిన సంస్థగానే కాకుండా, ఆ స్వాతంత్ర్య సమరం తరువాత జరగవలసిన దేశ పునర్నిర్మాణానికి అవసరమైన యావత్తు కార్యక్రమాన్ని అమలు చేయవలసిన సంస్థగా కూడా ఉంటుందని సుభాసు ప్రకటించాడు. కాంగ్రెసు సంస్థాగత పునాది ప్రజాస్వామికంగా ఉంటుందని హామీ యిస్తూ భావిభారత రాజ్యం నిరంకుశంగా ఉండదనీ, భవిష్యత్తులో ప్రజలపైన నాయకత్వాన్ని పైనుండి రుద్దడం జరగదనీ ప్రజలే నాయకులను ఎన్నుకుంటారనీ నొక్కి చెప్పాడు.

భారత స్వాతంత్ర్య సమరానంతరం భారతదేశంలో పేదరికం, అనారోగ్యం, నిరక్షరాస్యతలను తొలగించటం, ఉత్పత్తి, పంపకం కార్యక్రమాలను శాస్త్రీయమైన పద్ధతిలో, సమర్థవంతంగా కొనసాగించటం సోషలిస్టు పద్ధతులలో మాత్రమే సుసాధ్యం అని ఉద్ఘాటించాడు. మన జాతీయ ప్రభుత్వం ప్రప్రథమంగా చేయవలసిన పని ఒక ప్రణాళికా సంఘాన్ని ఏర్పాటు చెయ్యటం అని నొక్కి చెప్పాడు. ఆ ప్రణాళికలో తక్షణం అమలు చేయవలసిన భాగం ఒకటి, దీర్ఘకాలిక భాగం ఒకటి

ఉంటాయని ప్రకటించాడు. దేశ సమగ్ర అభివృద్ధికి అవసరమైన త్యాగాలను చెయ్యటానికి ప్రజలను సిద్ధం చెయ్యటం, దేశాన్ని ఐక్యం చెయ్యటం, దేశంలో వివిధ ప్రాంతాలకు కావలసిన సాంస్కృతిక, పరిరక్షణతో బాటు స్థానిక స్వపరిపాలనను స్థాపించడం, అందుకు అవసరమైన హామీలు యివ్వటం, స్వతంత్ర భారతదేశం తక్షణం సాధించవలసిన ఆశయాలు అని ప్రకటించాడు. ఎప్పుడైనా సంభవించగల విదేశ దండయాత్ర నుండి స్వతంత్ర భారత దేశాన్ని రక్షించాలంటే బలమైన కేంద్ర ప్రభుత్వం యాజమాన్యంలో, పైన వివరించబడిన పద్ధతుల ప్రకారం జాతి సమైక్యతను సాధించటం అవసరం అని ప్రకటించాడు. అదే సమయంలో మనం అల్ప సంఖ్యాకులకు, రాష్ట్రాలకు వారి సాంస్కృతిక, పరిపాలనా రంగాలలో సాధ్యమైనంత ఎక్కువ స్వపరిపాలన అవకాశాలను యిచ్చి, స్వతంత్ర భారతదేశంలో సుఖంగా ఉండేందుకు మనం తోడ్పడాలని ప్రకటించాడు. భారతదేశంలోగల విభిన్న ప్రాంతాలను దగ్గరకు తేవటానికి, వాటి మధ్య జాతీయ సమైక్యతను సాధించటానికి విమానం, టెలిఫోన్, రేడియో, సినిమా, టెలివిజన్ మొదలగు ఆధునిక సాంకేతిక పరికరాలను వాడటమేగాక, రోమన్‌లిపిలో హిందూస్థానీని భారతదేశం ప్రజలభాషగా అభివృద్ధి చెయ్యాలని సుభాను చంద్రుడు తన అధ్యక్షోపన్యాసంలో సూచించాడు.

స్వతంత్ర భారతదేశం అమలు చేయవలసిన దీర్ఘకాలిక ప్రణాళికను వివరించుతూ, స్వతంత్ర భారతదేశం ప్రప్రథమంగా పరిష్కరించవలసిన సమస్య రోజురోజుకూ పెరుగుతున్న దాని జనాభా సమస్య అన్నాడు. అతి త్వరగా, అతి విస్తృతంగా పెరిగే జనాభాను స్వతంత్ర భారతదేశం భరించలేదని ప్రకటించాడు.

దేశ పునర్నిర్మాణంలో పేదరికాన్ని నిర్మూలించటం మన ప్రధాన సమస్య అవుతుందన్నాడు. దీనిని పరిష్కరించేందుకు సమూలమైన భూ సంస్కరణలు. వ్యవసాయ ఋణాలను రద్దు చెయ్యటం. గ్రామీణ ప్రజలకు తక్కువ వడ్డీపైన ఋణాలు అందుబాటులో ఉండేటట్లు చెయ్యటం, సహకార ఉద్యమాన్ని విస్తరించటం, వ్యవసాయాన్ని ఆధునికం చేయుటం అవసరమన్నాడు. అదే సమయంలో వ్యవసాయాభివృద్ధి మాత్రమే స్వతంత్ర భారతదేశం ఆర్థిక సమస్యలన్నింటినీ పరిష్కరించలేదని గ్రహించి,

ప్రభుత్వ రంగంలో పారిశ్రామికాభివృద్ధిని సాధించటం తప్పనిసరి అవుతుందని ప్రకటించాడు. అందు నిమిత్తం ఒక నూతన పారిశ్రామిక విధానాన్ని రూపొందించటం తప్పదన్నాడు. కాగా ప్రజల శ్రేయస్సు కోసం కుటీర పరిశ్రమలను, చిన్న తరహా, మధ్య తరహా, భారీ పరిశ్రమలను సమర విధానంలో అభివృద్ధి చెయ్యటం ప్రణాళికా సంఘం కర్తవ్యం అవుతుందని సుభానుచంద్రుడు నొక్కి చెప్పాడు. చివరికి, క్రమేణా ఉత్పత్తి పంపిణీ రంగాలలో మన యావత్తు వ్యావసాయక, పారిశ్రామిక విధానాలను సామ్యవాదమునకు అనుగుణముగా మార్చటానికి ఒక సమగ్ర పథకం అవసరమని సుభాను సూచించాడు.

సుభాను చంద్రుడు కాంగ్రెసు అధ్యక్షుడు అయ్యేటప్పటికి, ఇండియాలోగల పదకొండు బ్రిటిష్ రాష్ట్రాలలో ఏడింటిలో కాంగ్రెసు పార్టీ అధికారాన్ని స్వీకరించింది. కాగా కాంగ్రెసు విధానాలను, సిద్ధాంతాలను అమలు పర్చటానికి వీలుగా ఆయా రాష్ట్రాల ఉద్యోగుల దొరతనాల కూర్పును, స్వభావాన్ని, ప్రవర్తనా పద్ధతులను మార్చటం కాంగ్రెసు మంత్రుల ప్రథమ కర్తవ్యం కావాలని సుభాను చంద్రుడు ఆకాంక్షించాడు. తరువాత కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గం తీర్మానాలకు అనుకూలంగా, విద్యా విధానాన్ని నీటి పారుదల శాఖ, ఆరోగ్యశాఖ పరిపాలనను, కాంగ్రెసు మంత్రులు సంస్కరించాలని సుభాను ఉద్ఘాటించాడు. ఇంకా భూ సంస్కరణలు, పారిశ్రామికాభివృద్ధి, కార్మికుల శ్రేయస్సును కాపాడటం, మద్య నిషేధాన్ని అమలుపర్చటం, జైళ్ళ సంస్కరణ వంటి విషయాలలో కూడా కాంగ్రెసు మంత్రులు కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గం చేసిన తీర్మానాల ప్రకారం ఒకే విధంగా నడవాలని సుభాను ప్రకటించాడు. ఇటువంటి విషయాలలో, తన ఆలోచన ప్రకారం, కాంగ్రెసు కార్య నిర్వాహక వర్గం భారత స్వాతంత్ర్య సమర సైనికులను నడిపించే మెదడు మాత్రమే కాకుండా, స్వాతంత్ర్య సమరకాలంలో ఏర్పడిన స్వతంత్ర భారత తాత్కాలిక మంత్రిమండలి కూడా అని సుభాను చంద్రుడు ప్రకటించాడు.

అప్పుడు బ్రిటిష్ ప్రభుత్వం తయారుచేసి అమలుపర్చిన నూతన ఇండియా రాజ్యాంగంలో రాష్ట్రాల సమాఖ్య అనే భావానికి సంబంధించిన భాగాన్ని భారత దేశం వ్యతిరేకించాలని సుభాను వక్కాణించాడు.

ఇండియాను రాజకీయంగా ముక్కలు, ముక్కలుగా చీల్చి, బలహీన పరచటమే, ఆ రాజ్యాంగంలో ఆ భాగం అంతర్యమని సుభాను గట్టిగా వాదించాడు. కాగా బ్రిటిష్ వాళ్ళు తయారు చేసిన 'భారతదేశ సమాఖ్య' పథకాన్ని పూర్తిగా, రాజ్యాంగ పద్ధతుల ద్వారా మాత్రమే కాకుండా, అవసరమైతే శాసనోల్లంఘనంతో కూడిన ప్రత్యక్ష చర్యద్వారా కూడా బ్రిటిష్ ఇండియాలోనే కాకుండా, భారత స్వదేశ సంస్థానాలలో కూడా, గట్టిగా ఎదుర్కోవాలి అనేది సుభాను చంద్రుని పట్టుదల.

# 21

తన హరిపుర కాంగ్రెసు అధ్యక్షోపన్యాసంలో నాటి జాతీయ, అంతర్జాతీయ పరిస్థితులను అవలోకించిన తరువాత, కాంగ్రెసు పార్టీ నిర్మాణాన్ని గురించి సుభాసు చంద్రుడు కొన్ని నిర్దిష్టమైన ప్రతిపాదనలను చేశాడు. అసాధారణమైన జన బాహుళ్యం బలాన్ని సమీకరించి, సరియైన మార్గంలో నడిపించటానికి కాంగ్రెసు ఒక సుశిక్షితమైన సేవాదళాన్ని కలిగి ఉండాలనేది వాటిల్లో మొదటి ప్రతిపాదన. భారతదేశానికి స్వాతంత్ర్యం లభించగానే జాతీయ సేవలో ఉన్నతోద్యోగులుగా పనిచెయ్యటానికి తగిన సైనిక విద్యార్థి దళం కావాలనేది రెండవ ప్రతిపాదన. మరొక విధంగా చెప్పాలంటే, అంకురించుతున్న భావి భారత నాయకులకు కాంగ్రెసు శిక్షణ యివ్వాలని సుభాసు ప్రతిపాదన.

సుభాసు చంద్రుడు మరొక ముఖ్యమైన ప్రతిపాదన చేశాడు. అదేమనగా, ప్రజా ఉద్యమాన్ని నడిపించుతున్న కాంగ్రెసు విధానాలు, ఆశయాలు కార్మిక, కర్షక సంఘాలను ప్రభావితం చేసి, వాటిని సామూహికంగా కాంగ్రెసుకు అనుబంధం చెయ్యాలి. అప్పుడు కార్మిక, కర్షక సంఘాలు కూడా చిన్న చిన్న పాయలుగా వచ్చి భారత ప్రజా ఉద్యమం ప్రధాన వెల్లువలో చేరిపోతాయి. ఇది విశాలప్రాతిపదికమైన సామ్రాజ్యవాద వ్యతిరేక సంఘటనను నిర్మించటానికి దారితీస్తుంది అని సుభాసు భావించాడు.

కాంగ్రెసులోగల వామపక్ష శక్తులను గురించి మాట్లాడుతూ, వాటిని స్పష్టంగా సోషలిస్టు స్వభావంగల ఒక కూటమిగా సంఘటిత పర్చాలని సుభాసు చంద్రుడు అభిప్రాయపడ్డాడు.

సుభాసు చంద్రుడు కాంగ్రెసుకు అంతర్జాతీయ అవగాహన కూడా అవసరమం అని భావించి, కాంగ్రెసు అంతర్జాతీయ సంబంధాలను పెంపొందించుకోవాలని గట్టిగా వాదించాడు. భారతదేశానికి సర్వతంత్ర స్వతంత్ర విదేశాంగ విధానం అవసరమని ఉద్ఘాటించాడు. ఈ అంశాన్ని

వివరిస్తూ, మన విదేశాంగ విధానం మరొక దేశ విదేశాంగ విధానం లేదా రాజ్యాంగ స్వరూపం వలన ప్రభావితం కాకూడదని నొక్కి చెప్పాడు. అంతర్జాతీయ సంబంధాలను పెంపొందించుకోవటానికి వ్యక్తిగత పరిచయాలు అవసరం కాబట్టి, విదేశాలలో వున్న భారత విద్యార్థులు యీ విషయంలో బాగా ఉపయోగపడగలరని సుభాసు చంద్రుడు భావించాడు.

ప్రపంచం అంతా ఇండియాను గురించి తెలుసుకోవాలంటే, ఇండియాకు ఇతర దేశాలతో సాంస్కృతిక, విద్యావిషయిక సంబంధాలు ఉండాలని చెప్పుతూ, భారత జాతీయ కాంగ్రెసు దానికి విశ్వాస పాత్రులైన ప్రతినిధులను ఐరోపా, ఆసియా, ఆఫ్రికా, మధ్య అమెరికా, దక్షిణ అమెరికాలలో నియమించాలని సుభాసు సూచించాడు. ముఖ్యంగా మన పొరుగు దేశాలైన పర్షియా, ఆఫ్ఘనిస్తాన్, నేపాల్, చైనా, బర్మా, సయాం, మలయా, తూర్పు ఇండియా దీవులు, సింహళంలతో ఇండియా దగ్గర సంబంధాలను కలిగి ఉండాలని సుభాసు చంద్రుడు నొక్కి చెప్పాడు.

తన అధ్యక్షోపన్యాసాన్ని ముగించుతూ, యావత్తు దేశాన్నీ కాంగ్రెసు పతాకం క్రింద సంఘటిత పరచమని సుభాసు మనఃపూర్వకంగా కాంగ్రెసువాదులనందరినీ కోరాడు. అయితే, కాంగ్రెసులో మితవాద పక్షం, అతివాద పక్షం అంటూ రెండు బృందాలు వున్నా, ఇండియా విముక్తి కోసం సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో పాల్గొంటున్న అన్ని సంఘాలకు కాంగ్రెసు ఉమ్మడి వేదికగా ఉంటుందని సుభాసు భావించాడు.

అదే సమయంలో కాంగ్రెసును ప్రజాస్వామిక సంస్థగా మార్చటానికి వాళ్ళ యావత్తు బలంతో వనరులను సమీకరించమని, సుభాసు వామపక్ష బృందాలకు ప్రత్యేకంగా విజ్ఞప్తి చేశాడు. చివరికి సుభాసు తన అధ్యక్షోపన్యాసాన్ని యీ క్రింది మాటలతో ముగించాడు:

"మనం బ్రిటిష్ సామ్రాజ్యవాదం మీదనేగాక, బ్రిటిష్ సామ్రాజ్య వాదం మూలస్తంభంగా గల ప్రపంచ సామ్రాజ్యవాదం మీద కూడా పోరాడుతున్నాం. కాగా మనం ఇండియా కోసం మాత్రమే కాకుండా, ప్రపంచ మానవాళికోసం పోరాడుతున్నాం. భారత్‌కు స్వాతంత్ర్యం సిద్ధించింది అంటే, మానవాళికి విముక్తి లభించినట్లే."

కాంగ్రెసు అధ్యక్షుని హోదాలో సుభాసు చంద్రుడు భారతదేశం

అంతటా పర్యటించాడు. బ్రిటిష్ ప్రభుత్వంతో రాజీ పడాలనే శక్తులపైన ఇండియా తుదిసారిగా, ఖండితంగా, ఎదురు తిరగాలనీ, అప్పుడు ఐరోపాలో జరుగనున్న యుద్ధ కాలంలోనే బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా భారత జాతీయ పోరాటాన్ని నడపటానికి తగినట్లుగా భారత ప్రజానీకాన్ని కాంగ్రెసు తయారు చెయ్యాలనీ, ఆయన ఆనాడు చేసిన ఉపన్యాసాల ముఖ్యాంశాలు. కాంగ్రెసు అధ్యక్షుడుగా ఆయన కాంగ్రెసు సభలకు, కాంగ్రెసు కార్య నిర్వాహక వర్గ సమావేశాలకు అధ్యక్షత వహించి, నియమబద్ధంగా, నిష్పక్షపాతంగా వ్యవహరించాడు. తనతోటి కాంగ్రెసు నాయకుల యెడల, కార్యకర్తల యెడల ఎంతో సాదరంగా వ్యవహరించాడు. సెంట్రల్ ప్రావిన్సెస్ (ఈనాటి మధ్యప్రదేశ్)లో తల ఎత్తిన మంత్రివర్గ సంక్షోభాన్ని ఆయన ఎంతో నేర్పుతో పరిష్కరించాడు.

ఆయన అస్సాం వ్యవహారాలలో వ్యక్తిగతంగా జోక్యం చేసుకోగా ముస్లిం లీగ్ మంత్రి వర్గం పతనమైంది. కాంగ్రెసుకు మంత్రి వర్గం లభించింది. విసుగు కలిగించుతున్న హిందూ ముస్లిం సమస్యకు పరిష్కారం కనుక్కొనే నిమిత్తం, కాంగ్రెసు అధ్యక్షుని హోదాలో సుభాను చంద్రుడు, 1938 ఉత్తరార్థంలో ముస్లింలీగ్ నాయకుడైన జిన్నాను, వరుసగా చాలాసార్లు కలిశాడు. కాని ముస్లింలీగ్‌ను భారత మహమ్మదీయుల అధికార, ఏకైక సంఘంగా గుర్తించి తీరాలని జిన్నా పట్టుబట్టాడు. తత్ఫలితంగా వారి సంభాషణలు విఫలమయ్యాయి.

అయినప్పటికి ఎంతో ఓర్పుతో వ్యవహారదక్షతతో వ్యవహరించి, సుభాను చంద్రుడు 1939లో కలకత్తా మునిసిపల్ కార్పొరేషన్‌తో కలిసి పనిచేయటానికి ముస్లింలీగ్, కాంగ్రెసు పక్షాల మధ్య ఒక ఒడంబడికను సాధించాడు. దానికి బోసు - లీగ్ ఒడంబడిక అనేపేరు సార్థకమైంది.

హరిపుర కాంగ్రెసు మహా సభ జరిగిన తరువాత మూడు నెలలలో సుభాను చంద్ర బోస్ ఢిల్లీలో కాంగ్రెసు రాష్ట్ర ప్రధానమంత్రులను సమావేశపర్చాడు. తరువాత పారిశ్రామిక మంత్రుల సమావేశాన్ని ఏర్పాటు చేశాడు. పేదరికంలో మగ్గిపోతున్న ఇండియా వంటి దేశాన్ని ఆర్థికంగా పారిశ్రమికంగా అభివృద్ధి చెందిన దేశంగా మార్చటానికి ఒక ప్రణాళికా సంఘం అవసరమనే విషయం గురించి సుభాను చంద్రుడు ఆ సమావేశాలలో నొక్కి చెప్పాడు. 1938 మధ్య కాలం నాటికే, కాంగ్రెసు

ఆధ్వర్యాన ఒక జాతీయ ప్రణాళికల కమిటీని ఏర్పాటు చెయ్యాలని సుభాను నిశ్చయించాడు. అందు నిమిత్తం ఆయన ప్రముఖ శాస్త్రవేత్తలతోను ఆర్థిక శాస్త్రవేత్తలతోను, సమగ్రంగా సంప్రదించాడు. జవహర్‌లాల్ నెహ్రూను ఆ కమిటీ అధ్యక్షుడుగా ఉండమని ఆహ్వానించాడు. కాంగ్రెసు అధ్యక్షుని ప్రతిపాదనను కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గం ఆమోదించింది. 1938 డిసెంబరు నెలలో లాంఛన ప్రాయంగా బొంబాయిలో ప్రణాళికల కమిటీ ప్రారంభోత్సవం జరిగింది.

జాతీయ పునర్నిర్మాణం గురించి సుభాను చంద్రునికి స్పష్టమైన, కచ్చితమైన అభిప్రాయాలు ఉన్నాయి. ఆయన వాటిని స్పష్టంగా ప్రకటించాడు కూడా. మనం పారిశ్రామిక విప్లవపు పురిటి నొప్పులను పడనిదే భారతదేశంలో ఎటువంటి పారిశ్రామిక ప్రగతి సాధ్యం కాదని ఆయన స్పష్టం చేశాడు. ఈ విషయం గురించి కాంగ్రెసువారి అందరి అభిప్రాయాలు ఒకే విధంగా లేవని ఆయన అంగీకరించాడు. కాని అప్పటి యువతరం మూడు ప్రధాన కారణాలను పురస్కరించుకొని పారిశ్రామిక విప్లవానికి అనుకూలంగా ఉందని ఆయన ప్రకటించాడు.

"నిరుద్యోగ సమస్యను పరిష్కరించటానికి పారిశ్రామిక అభివృద్ధి అవసరం అనేది ఆ కారణాలలో మొదటిది. శాస్త్రీయ వ్యావసాయక విధానం ఆహారోత్పత్తిని పెంచుతుంది. కాని ఇండియాలో ప్రతిస్త్రీకి, పురుషునికి అన్నం పెట్టాలంటే, మన జనాభాలో ఎక్కువ భాగాన్ని వ్యావసాయక రంగం నుండి పారిశ్రామిక రంగానికి బదిలీ చెయ్యక తప్పదు. ఇది ఇలా ఉండగా, యువతరం సోషలిజం పునాదిగా గల జాతీయ పునర్నిర్మాణం కోసం నిలబడుతూ వుంది. పారిశ్రామిక ప్రగతి లేనిదే సోషలిస్టు సమాజ స్థాపన అసాధ్యం. కాగా పారిశ్రామిక విప్లవం అవసరం అనటానికి ఇది రెండవ కారణం. విదేశాలతో జయప్రదంగా పోటీ చెయ్యాలంటే పారిశ్రామికాభివృద్ధి అవసరం. పారిశ్రామిక విప్లవానికి మన యువతరం అనుకూలంగా ఉండటానికి ఇది మూడవ కారణం," అని ఆయన ఆనాటి యువతరం పారిశ్రామిక విప్లవానికి ఎందుకు అనుకూలంగా ఉన్నదీ వివరించాడు.

జాతీయ సమైక్యత, సంఘీ భావాలను సాధించటానికి కృషి చేయవలసిన బాధ్యత తమది అని కాంగ్రెసు వాదులందరూ పూర్తిగా

గుర్తించాలని సుభాను చంద్రుడు భావించాడు. భారతదేశం, చైనా మార్గాన్నికాక, టర్కీ మార్గాన్ని అనుసరించాలన్నాడు. జాతీయ సమైక్యత, సంఘీభావాలను పెంపొందించటానికి ఒకే ఒక ప్రజాభాష, వస్త్రధారణ విధానం, తిండి అవసరం అంటూ, ఒక జాతి ప్రజలు ఒకే జాతిగా బ్రతకాలన్నా, ఒకే జాతిగా కలసి కట్టుగా ఉండాలన్నా, అన్నింటిలోకి ముఖ్యంగా కావలసింది ఒకే జాతిగా ఉండాలనే పట్టుదల, అని సుభాను చంద్రుడు ఉద్ఘాటించాడు.

కాగా ఆయన ఆలోచన ప్రకారం దేశ సమైక్యత సమస్య ఎక్కువగా ప్రజల ఆలోచనా విధానానికి సంబంధించిన సమస్య. తామంతా ఒకే జాతి అనే విషయాన్ని ప్రజలకు చెప్పాలి. వారు తామంతా ఒకే జాతి అని భావించేటట్లు చేయటానికి జాతీయ భావాలను మరీ, మరీ వారికి నూరిపొయ్యాలి.

జాతి సమైక్యతను, సంఘీభావాన్ని సాధించటానికి, యీ పట్టుదలతో పాటు, ఒక అఖిలభారత రాజకీయ పక్షం కూడా అవసరమని సుభాను భావించాడు. కాంగ్రెసు అటువంటి అఖిల భారత రాజకీయ పక్షం. కాగా పారిశ్రామికాభివృద్ధి బ్రిటన్‌లో వలె క్రమేణ రావాలా లేక సోవియట్ రష్యాలో వలె బలవంతంగా ఒకేసారి రావాలా అనేది నిర్ణయించవలసింది కాంగ్రెసు వాదులమైన మనమే అంటూ, సుభాను చంద్రుడు, ఇండియాలో పారిశ్రామికాభివృద్ధి అతిత్వరగా సోవియట్ రష్యాలో జరిగినట్లు జరగాలన్నాడు. అందుకే "మనకు మన జాతీయ ప్రభుత్వం అంటూ ఒకటి ఏర్పడినప్పుడు, దేశం అంతటి పారిశ్రామిక అవసరాలను గురించి ఆలోచించగల ప్రణాళికా సంఘాన్ని నియమించటం మన ప్రభుత్వం ప్రథమ కర్తవ్యం అవుతుంది" అన్నాడు సుభాను చంద్రుడు. దేశం పారిశ్రామికం కావాలని తను అంటున్నప్పటికీ, కుటీర పరిశ్రమలను తను వ్యతిరేకించటం లేదని సుభాను చంద్రుడు స్పష్టం చేశాడు. వాస్తవానికి శాస్త్ర సహాయంతో వాటిని జర్మనీ, జపానులవంటి అభివృద్ధి చెందిన దేశాలలో పునరుద్ధరించి, బలపరచినట్లు, ఇండియాలో కూడ వాటిని పునరుద్ధరించి, బలపర్చాలని సుభాను వాదించాడు.

భారత జాతీయాభివృద్ధి ప్రణాళిక రచన యీ క్రింది సూత్రాల మీద ఆధారపడి ఉండాలని సుభాను చంద్రుడు ప్రతిపాదించాడు:

(1) మన పారిశ్రామికాభివృద్ధినిమిత్తం మనకు కావలసిన యంత్రాలను, ముడి సరుకులను సంపాదించే సమయంలో మన జాతీయ స్వపరిపాలన హక్కును విస్మరించకూడదు.

(2) విద్యుత్ ఉత్పాదన, లోహాలను ఉత్పత్తి చెయ్యటం, యంత్రాలను, పనిముట్లను తయారుచెయ్యటం, అత్యవసరమైన రసాయనిక పదార్థాలను తయారుచెయ్యటం, రవాణా సౌకర్యాలను, వార్తా సాధనాలను అభివృద్ధి చెయ్యటం వంటి పారిశ్రామిక అభివృద్ధికి అవసరమైన కీలక పరిశ్రమల అభివృద్ధి, పెంపుదలలను గురించి మనం ప్రధానంగా శ్రద్ధ వహించాలి.

(3) సాంకేతిక విద్య, సాంకేతిక పరిశోధన రంగాలలో అభివృద్ధిని సాధించే నిమిత్తం అవసరమైనంత మేరకు ఒక పథకం ప్రకారం శిక్షణ నిమిత్తం మన విద్యార్థులను విదేశాలకు పంపించాలి.

(సాంకేతిక పరిశోధనా రంగం పైన ఎటువంటి ప్రభుత్వపు అజమాయిషీ ఉండకూడదని కూడ సుభాసుచంద్రుడు భావించాడు).

(4) శాశ్వతమైన జాతీయ పరిశోధనా మండలిని ఏర్పాటు చెయ్యాలి.

శాస్త్ర విజ్ఞానానికి రాజకీయాలకు మధ్య సహకారం ఉంటే, అది ముందు ముందు ఎంతో అభివృద్ధికి దారి తీయగలదని ఆయన నమ్మకం. కాగా శాస్త్ర విజ్ఞానానికి రాజకీయాలకు మధ్య అటువంటి సహకారం అవసరమని సుభాసు చంద్రుడు నొక్కి చెప్పాడు.

# 22

కాంగ్రెసు అధ్యక్షుడుగా పనిచేస్తున్న కాలంలో దేశం నలుమూలలా విస్తృతంగా పర్యటించి సుభాసు చంద్రుడు నూతన అనుభవాన్ని గడించాడు. వివిధ స్థాయిల్లో నాయకుల, కార్యకర్తల మనస్తత్వాలు ఎలా ఉంటాయో గ్రహించాడు. స్వాతంత్ర్య సమరంలో ప్రజలను ముఖాముఖి కలిసి, వారి ఆలోచనా ధోరణులను అర్థం చేసుకున్నాడు. తగిన సమయం ఆసన్నమైనప్పుడు సామ్రాజ్యవాదం మీద చివరిసారిగా దండెత్తి అంకిత స్వభావంతో, రాజీలేని తుది పోరాటాన్ని జరిపి, అధికారాన్ని చేజిక్కించు కోవటానికి సిద్ధమౌతున్న పులి బిడ్డలకు ప్రతినిధిగా సుభాసు చంద్రుడు నిలబడ్డాడు. అదే సమయంలో స్వాతంత్ర్య సమరంలో అలసిపోయి, బ్రిటిష్ వాళ్ళు రూపొందించిన బ్రిటిష్ పాలిత రాష్ట్రాల సమాఖ్య ప్రతిపాదనను కూడ చర్చించటానికి, బ్రిటన్‌తో బేరసారాలు సాగించటానికి సిద్ధపడుతున్న వృద్ధ నాయకులు కాంగ్రెసు ఉన్నత స్థాయి నాయకత్వంలోనే చాలామంది ఉన్నారని సుభాసు చంద్రుడు తెలుసుకున్నాడు.

వీరుగాక, బ్రిటిష్ సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో నిమగ్నులు కావటానికి బదులు కేవలం సైద్ధాంతిక చర్చలతో కాలం గడిపే కాంగ్రెసు వాదులు కూడా ఉన్నారు. వారిలో కొందరు మితవాదులు, కొందరు అతివాదులు. అది తదుపరి సంవత్సరం ఐరోపా ఖండంలో యుద్ధం రావటం అనివార్యమని అందరూ ఊహించుతున్న సమయం. అటువంటి పరిస్థితులలో తనవంటి, రాజీకి పాకులాడని జాతీయ విప్లవకారుడే, కాంగ్రెసు అధ్యక్షుడుగా కొనసాగవలసిన అవసరం ఉందని సుభాసు చంద్రుడు గట్టిగా అనుకున్నాడు.

కాని కాంగ్రెసులోని మిత వాదులకు సుభాసు మళ్ళీ కాంగ్రెసు అధ్యక్షుడు కావటం యిష్టం లేదు. అందుకు మూడు కారణాలు ఉన్నాయి. బ్రిటన్‌తో ఎటువంటి రాజీ వద్దు అనే వాదనకు సుభాసు ఒక ఉద్యమం

రూపం యిచ్చి, ఆ ఉద్యమాన్ని నిరంతరం బలపరచటం కాంగ్రెసు మిత వాదులకు గిట్టలేదు. భారతదేశంలోని బ్రిటిష్ రాష్ట్రాలను ఒక సమాఖ్యగా ఏర్పరచాలనే బ్రిటిష్ ప్రతిపాదనను, బేషరతుగా నిరాకరించాలని సుభాసు చంద్రుని పట్టుదల. జాతీయ ప్రణాళికా సంఘం ఆధ్వర్యంలో భారతదేశం పారిశ్రామిక అభివృద్ధిని సాధించాలనే సుభాసు వాదన మితవాదులను ఆయనకు దూరం చేసింది. 1938 సెప్టెంబరులో బ్రిటన్ హిట్లర్‌తో అపవిత్రమైన మ్యూనిక్ ఒడంబడికను చేసుకున్నప్పుడే అది ఐరోపాలో రానున్న యుద్ధానికి నాంది అని సుభాసు చంద్రుడు గట్టిగా విశ్వసించాడు. అంతేకాదు, ఆ యుద్ధం జరిగే కాలంలోనే భారతదేశం తన స్వాతంత్ర్య సమరాన్ని సాగించాలి, అందుకు ఇప్పటినుండే భారతదేశం తయారు కావాలని, సుభాసు చంద్రుడు కాంగ్రెసు అధ్యక్షుడుగా దేశం అంతటా బహిరంగంగా ప్రచారం చెయ్యటం ప్రారంభించాడు. సుభాసు ప్రతిపాదన సామాన్య జనాన్ని ఆకర్షించింది. కాని పదవులలో, శాసన సభలలో వున్న కాంగ్రెసు మితవాద నాయకులకు అది మింగుడుపడలేదు. ఆ విధంగా సుభాసు చంద్రుని అధ్యక్ష పదవీ కాలం ముగిసేనాటికి, ఆయనకు, కాంగ్రెసు మిత వాదులకు మధ్య ఏర్పడిన భేదం మరింత విశాలమైంది.

అయినా తను కాంగ్రెసు అధ్యక్ష పదవికి మళ్ళీ పోటీ చేస్తున్నట్లు సుభాసు చంద్రుడు ప్రకటించాడు. వెంటనే కాంగ్రెసు నాయకులలో అధిక సంఖ్యాకులు ఆయన నిర్ణయాన్ని ఆక్షేపించారు. అది వ్యక్తి ప్రాబల్యంకోసం చేస్తున్న పోటీ కాదని సుభాసు నొక్కి చెప్పాడు. కాంగ్రెసువంటి ప్రజాస్వామిక, సామాన్య జన సమూహానికి చెందిన, రాజకీయ పక్షం అధ్యక్షుని ఎన్నికకు, విధానాలు, కార్యక్రమాలు ప్రాతిపదికలుగా ఉండాలని కోరాడు. బ్రిటిష్ ప్రభుత్వంతో రాజీలేని తుది పోరాటాన్ని నడిపించగల ఆచార్య నరేంద్ర దేవ్ వంటి జాతీయ నాయకుడు ముందుకు వస్తే, తను పోటీ నుండి తప్పుకుంటానని ప్రకటించాడు. కాని అది జరగలేదు. అంతేకాదు, మహాత్ముని ఆశీస్సులు పొందిన, కాంగ్రెసు మితవాదుల ప్రతినిధి అయిన డాక్టర్ పట్టాభి సీతారామయ్య సుభాసుకు పోటీగా నిలిచాడు. ఆ ఎన్నికకు ముందు సుభాసుకు కాంగ్రెసులో మితవాద నాయకులైన వల్లభ్‌భాయి పటేల్‌వంటి వారికి మధ్య తీవ్ర వివాదం చెలరేగింది. ఇరు పక్షాలు ఎవరి వాదనను వారు బలపర్చారు. చివరికి, సుభాసు చంద్రుడు

పదివేల ఓట్ల ఆధిక్యతతో కాంగ్రెసు అధ్యక్ష పదవికి ఎన్నికయ్యాడు.

కాంగ్రెసు అధ్యక్ష పదవికి సుభాను చంద్రుడు మరొకసారి ఎన్నిక కావటం ఆయనకు దేశంలో ఎంత పలుకుబడి ఉన్నదీ, ఎందరు అనుచరులు ఉన్నదీ స్పష్టంగా తెలియజేసింది. ఆ పోటీ సమయంలో గాంధీజీ తటస్థంగా ఉన్నాడు. ఆయన అసలు నోరు విప్పి మాట్లాడనే లేదు. కాని ఎన్నికల ఫలితం ప్రకటించబడిన తరువాత పట్టాభి ఓటమి తన ఓటమి అని ప్రకటించాడు. ఆ సంఘటనలు అలా పరిణమించటం జవహర్‌లాల్‌కు కూడా చిరాకు కల్గించింది. ఆయన దాదాపు తటస్థంగానే ఉన్నాడు. కాని సుభాను చంద్రుని దృష్టిలో ఆనాటి జవహర్‌లాల్ తాటస్థ్యం వ్యతిరేకత క్రిందే లెక్క.

1939 ఫిబ్రవరి నెల మధ్యలో సుభాను చంద్రుడు మహాత్ముని వార్ధా ఆశ్రమంలో కలిశాడు. కాని ఆ సమావేశం ఫలించలేదు. తరువాత సుభాను కలకత్తా వెళ్ళాడు. అక్కడ ఆయన తీవ్రంగా జబ్బుపడ్డాడు. కాగా తరువాత జరగవలసిన కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గ సమావేశాన్ని వాయిదా వెయ్యాలని ఆ నెలాఖరులో సుభాను ప్రతిపాదించాడు. ఆ ప్రతిపాదనకు సమాధానంగా కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గం సభ్యులలో అత్యధిక సంఖ్యాకులు మూకుమ్మడిగా రాజీనామా చేశారు. జవహర్‌లాల్ విడిగా ఒక ప్రకటన చేశాడు. రాజీనామా ప్రభావం కంటె ఆ ప్రకటన ప్రభావం తక్కువ ఏమీ కాదు. తత్ఫలితంగా మంచం పట్టిన కాంగ్రెసు అధ్యక్షునికి తోడుగా కాంగ్రెసు కార్య నిర్వాహక వర్గంలో ఒకే ఒక సభ్యుడు మిగిలాడు. ఆ సభ్యుడు ఆయన సోదరుడైన శరత్ చంద్ర బోసు.

సుభాను ఆరోగ్యం యిలా ఉండగా, కాంగ్రెసు వార్షిక మహాసభ ఆ మార్చి నెలలో మధ్యప్రదేశ్‌లో జబల్పూరు పట్టణం దగ్గర గల త్రిపురిలో జరగాలనే నిశ్చయం జరిగింది. ఏది ఏమైనా సరే సుభాను చంద్రుడు ఆ మహాసభకు హాజరు కారాదని ఆయన వైద్యులు సలహా యిచ్చారు. ఆయన రెండు ఊపిరితిత్తులలోను నీరు చేరింది. వెంటనే ఆయనకు ఆరోగ్యం చేకూరటం అసాధ్యం. అయినా కాంగ్రెసు అధ్యక్షుడుగా ఎన్నిక అయిన సుభాను చంద్రుడు డాక్టర్ల సలహాను తిరస్కరించి, త్రిపురికి వెళ్ళటానికే నిర్ణయించుకున్నాడు.

సుభాను చంద్రుని అంబులెన్స్‌లో పడుకోబెట్టి రైలుబండి దగ్గరకు

తీసికొని వెళ్ళారు. జబల్పూరు రైల్వే స్టేషన్‌లో అయనను ఒక స్ట్రెచర్ మీద పడుకోబెట్టి, అంబులెన్సులోకి మార్చి, తరువాత కాంగ్రెసు అధ్యక్షుని విడిదికి తీసుకొని వెళ్ళారు. ఆయన వెంట ఒక డాక్టర్ల బృందం, ఆయన కుటుంబ సభ్యులు ఉన్నారు. త్రిపురిలో సుభాను చంద్రుని జ్వరం ఏమాత్రం తగ్గలేదు. అయినా ఆయన కాంగ్రెసు విషయ నిర్ణాయక సమావేశానికి హాజరు కావాలని పట్టుబట్టాడు. వేదిక మీద పరుండి, ఆ సమావేశం కార్యకలాపాలను నిర్వహించాడు. ఆ జటిల సమస్యను పరిష్కరించటానికి ఊపిరి సలపనంత చురుకుదనంగా, నిరంతరమైన రాజకీయ చర్చలు, సంప్రదింపులు జరిగాయి. కాని పాత కార్య నిర్వాహక వర్గంలో అధిక సంఖ్యాకులు అధ్యక్షునితో ఎటువంటి పరిష్కారం చేసుకోవటానికి అంగీకరించలేదు. సంప్రదింపులకు మహాత్ముడు అందుబాటులో లేడు. ఆయన ఎక్కడో దూరంగా, రాజకోటలో పూర్తిగా భిన్నమైన రాజకీయ సమస్య పరిష్కారం నిమిత్తం నిరాహార దీక్ష పూని ఉన్నాడు.

సుభాను తన అధ్యక్షోపన్యాసాన్ని చదవలేనంత జబ్బుగా ఉన్నందున, ఆయన ఉపన్యాసాన్ని శరత్ చంద్రుడు చదివాడు. మామూలుకు చాలా భిన్నమైన, అసాధారణ పరిస్థితులలో ఆ కాంగ్రెసు మహాసభ జరుగుతున్నదని తన అధ్యక్షోపన్యాసం ప్రారంభంలోనే సుభాను చంద్రుడు చెప్పాడు. భారత జాతీయ కాంగ్రెసు అతిథులుగా ఆ సభకు హాజరైన ఈజిప్టు వాఫ్ట్ పార్టీ సౌహార్ద్ర ప్రతినిధులకు స్వాగతం పలికాడు. అంతకు ముందు ఐరోపా, ఆసియా ఖండాలలో సంభవించిన, అంతర్జాతీయ ప్రాభవంగల సంఘటన ఫలితంగా, బ్రిటిష్, ఫ్రెంచి సామ్రాజ్యవాదాలు ఎటువంటి తీవ్రమైన దెబ్బతిన్నదీ, వాటి బలం, ప్రతిష్ఠలు ఎంత తరిగి పోయిందీ వివరించాడు.

స్వదేశంలో రాజకీయ పరిస్థితిని అంచనా వేస్తూ, సుభాను చంద్రుడు భారతదేశం స్వరాజ్యం కోరదగిన సమయం ఆసన్నమైనదనీ, భారతదేశానికి వెంటనే స్వరాజ్యం యివ్వమని బ్రిటిష్ ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తూ, ఆ ప్రభుత్వానికి తుది హెచ్చరిక చేయవలసిన సమయం అదేననీ, ఉద్ఘాటించాడు. ఇంకా, నియమిత కాలంలో బ్రిటిష్ ప్రభుత్వం సంతృప్తికరమైన సమాధానాన్ని యివ్వకపోతే, భారతదేశం సత్యాగ్రహం ద్వారాగాని, మూకుమ్మడి శాసనోల్లంఘనం ద్వారాగాని మన కోర్కెను

ఈడేర్చుకోవలసి ఉంటుందని ప్రకటించాడు. ఆ సమయంలో ఇండియాలో సత్యాగ్రహాన్ని కాని, దీర్ఘకాలిక ప్రజాపోరాటాన్ని కాని ఎదుర్కొనగల స్థితిలో బ్రిటిష్ ప్రభుత్వంలేదని, సుభాను చంద్రుడు తన దేశస్థులకు, పార్టీవారికి కూడ నమ్మకంగా చెప్పాడు. ఆ సమయంలో భారతీయులందరూ తమ విభేదాలను విస్మరించి, తమ వనరులనన్నింటినీ సమీకరించి, జాతీయ స్వాతంత్ర్య సమరంలో దూకితే, తమ పోరాటం ఎదురులేని దౌతుందంటూ, సుభాను తన ఆశావాదాన్ని బయట పెట్టాడు. ఈ సందర్భంలో భారత స్వదేశ సంస్థానాల ప్రజలలో వచ్చిన అపూర్వచైతన్యాన్ని ప్రత్యేకంగా ఆ మహాసభ దృష్టికి తెచ్చి, స్వదేశ సంస్థానాల స్వాతంత్ర్య సమరయోధులతో కాంగ్రెసు చేతులు కలపవలసిన అవసరం ఆసన్నమైందని సుభాను చంద్రుడు గట్టిగా వాదించాడు. తన అధ్యక్షోపన్యాసాన్ని ముగించుతూ, భారతదేశం గమ్యమైన స్వాతంత్ర్యం వైపుకు తుది అడుగు వెయ్యటానికి అవసరమైన సన్నాహాలు చేయవలసిన అవసరాన్ని కూడ ఆ సభ దృష్టికి తెచ్చాడు. ఆ కర్తవ్యాన్ని నిర్వర్తించటానికి కాంగ్రెసులో వున్న అవినీతిని, బలహీనతలను నిర్దాక్షిణ్యంగా తొలగించాలనీ, కార్మిక, కర్షక ఉద్యమాలను నడుపుతున్న సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తులతో కాంగ్రెసు దగ్గర సంబంధాలను పెంపొందించుకోవాలనీ, సుభాను చంద్రుడు కాంగ్రెసు వారిని కోరాడు.

అధ్యక్షుని ఉద్బోధలు చెవిటివాడి ముందు ఊదిన శంఖంవలె నిరుపయోగం అయ్యాయి. ఆ కాంగ్రెసు ప్రతినిధుల సభ ఒక విచిత్రమైన తీర్మానాన్ని ఆమోదించింది. ఆ తీర్మానం ప్రకారం సుభాను, కాంగ్రెసు అధ్యక్షుడుగా, నియమించబోయే కార్యనిర్వాహక వర్గం మహాత్ముని సంపూర్ణ విశ్వాసాన్ని పొందినదిగా ఉండి తీరాలి. వామపక్ష కాంగ్రెసువాదులుగా తమకు తామే యోగ్యతా పత్రాలను యిచ్చుకునే వాళ్ళ ఊగిసలాట, బలహీనతలను గురించి ఏమనుకోవాలి! కాగా, గాంధీ మహాత్ముని అభిలాష ప్రకారం కాంగ్రెసు అధ్యక్షుడు తన కార్య నిర్వాహక వర్గాన్ని నియమించవలసి వచ్చింది. ఆ విధంగా, కాంగ్రెసు అధ్యక్షుడు ఏం చెప్పినప్పటికీ, మహాత్మునిలో విశ్వాసాన్ని ప్రకటించటమే కాంగ్రెసు ముందున్న ప్రధాన సమస్య అని కాంగ్రెసు మితవాద వర్గం చెప్పక చెప్పింది. కాంగ్రెసు అధ్యక్షుని అధికారాలను కుదించింది. ఆ కుదింపు

ఎంత దూరం వెళ్ళిందంటే, మహాత్ముడు కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గంలో ఉండదగిన వారి విషయంలో తన ఆలోచనలను స్పష్టంగా తెలియజేసే వరకు కాంగ్రెసు అధ్యక్షుడు తన విధులను నిర్వర్తించలేని స్థితి ఏర్పడింది.

# 23

త్రిపురిలో సుభాసు చంద్రుడు అనుభవించిన మానసిక వ్యధ ఆయన వ్యాధి నుండి కోలుకోవటాన్ని మరింత కష్టం చేసింది. కాగా ఆయన వైద్యులు, కుటుంబ సభ్యులు ఆయనను కలకత్తాకు తీసికొని వెళ్ళరాదని నిర్ణయించి, కొంతకాలం విశ్రాంతి, స్వస్థతల నిమిత్తం ధన్‌బాద్‌కు దగ్గరగా వున్న జమాదోబాలో ఉంచారు. సాపేక్షికంగా జమాదోబా ఏకాంతమైన స్థలం. అప్పుడు ఆయన మానసిక స్థితి ఎలా ఉందో, ఆయనే తరువాత రాసిన యీ క్రింది వాక్యాలను బట్టి తెలుస్తుంది: "త్రిపురిలో వున్న నైతికంగా బాధించే వాతావరణం కారణంగా, నాకు రాజకీయాలంటే గత పందొమ్మిది సంవత్సరాలలో ఎప్పుడూ కలగనటువంటి విసుగు, అసహ్యం కలిగాయి. అలా రాజకీయాలను అసహ్యించుకుంటూనే, నేను త్రిపురి నుండి వెళ్ళిపోయాను. నా మనస్సు చీకటితో నిండి పోయింది. నా చీకటి మనస్సులో వెలుతురు ప్రకాశించాలని ప్రార్థించాను. అప్పుడు నెమ్మదిగా నా మనస్సులో ఒక కొత్త దృశ్యం అవతరించింది. వెంటనే నేను మానసికంగా కోలుకోవటం ప్రారంభించాను. మనుషులలోను, నా దేశస్థులలోను నాకు తిరిగి నమ్మకం కలగటం ప్రారంభమైంది. ఏది ఏమైనా త్రిపురియే భారతదేశం కాదు... త్రిపురిలో నేను చాలా బాధలను అనుభవించినప్పటికీ, మనిషిలో నాకు గల మౌలికమైన నమ్మకాన్ని ఎలా వదులుకోగలను? మనిషిని అనుమానించటం అంటే మనిషిలో గల దైవాన్ని అనుమానించటమే, మనిషి తన ఉనికిని అనుమానించటమే."

మహాత్ముని కోరిక ప్రకారం కాంగ్రెసు కార్య నిర్వాహక వర్గాన్ని అధ్యక్షుడు నియమించాలనే త్రిపురి కాంగ్రెసు తీర్మానం ప్రకారం, సుభాసు చంద్రుడు జమాదోబాలో మంచం నుండి లేవకుండానే మహాత్మునితో సుదీర్ఘమైన ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపాడు. కాంగ్రెసు కార్య నిర్వాహక వర్గం సజాతీయంగా ఉండాలా లేక సంకీర్ణంగా ఉండాలా అనేది వారి ఇద్దరి మధ్య తేలని సమస్య. ఆనాడు వున్న జాతీయ, అంతర్జాతీయ క్లిష్ట

పరిస్థితులలో బ్రిటిష్ ప్రభుత్వాన్ని కాంగ్రెసు ఐక్యంగా ఎదుర్కొనేందుకు కాంగ్రెసులో వున్న బలమైన వివిధ భాగాలకు, వైఖరులకు ప్రాతినిధ్యం వహించేవారు కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గంలో ఉండాలని అధ్యక్షుని భావం. ఏది ఏమైనా కాంగ్రెసు కార్య నిర్వాహక వర్గం సజాతీయంగా, అనగా ఒకే ఒక వైఖరిగల వారికి ప్రాతినిధ్యం వహించే తీరుగా ఉండాలని మహాత్ముని వాదన. అలా వాదించుతూ, తన ఇష్టం ప్రకారం కార్య నిర్వాహక వర్గాన్ని ఏర్పాటు చేసుకోమని సుభాను చంద్రునికి మహాత్ముడు సలహా యిచ్చాడు కూడా. కాని త్రిపురి కాంగ్రెసు తీర్మానం ప్రకారం కాంగ్రెసు కార్య నిర్వాహక వర్గం మహాత్ముని సంపూర్ణ విశ్వాసాన్ని పొందినదై ఉండాలి. తత్ఫలితం ప్రతిష్టంభన. ఆ ప్రతిష్ఠంభనను పరిష్కరించేందుకు జవహర్‌లాల్ నెహ్రూ, రాజేంద్ర ప్రసాద్‌లు జమాదోబాను సందర్శించి, సుభాను చంద్రునితో చర్చలు జరిపారు.

అఖిల భారత కాంగ్రెసు కమిటీ 1939 ఏప్రిల్ నెలాఖరున కలకత్తాలో సమావేశమైంది. ఆ సమావేశానికి ముందు మహాత్ముడు, సుభాను చంద్రుడు కలకత్తాకు దగ్గర, సోదేపూర్‌లో ముఖాముఖి ఆ సమస్యను చర్చించారు. జవహర్‌లాల్, రాజేంద్ర ప్రసాదులు, యిద్దరూ వారికి ఆ చర్చల సందర్భంలో సహాయ పడ్డారు. అయినా దురదృష్ట వశాత్తు పరిష్కారం సాధ్యం కాలేదు. చివరికి అఖిల భారత కాంగ్రెసు కమిటీ బహిరంగ సమావేశంలో సుభాను చంద్రుడు తన కాంగ్రెసు అధ్యక్ష పదవికి రాజీనామా చేశాడు. అలా చేస్తూ సుభాను యీ విధంగా అన్నాడు:

"త్రిపురి కాంగ్రెసు అయన మీద ఉంచిన బాధ్యతను అయన నిర్వహించాలని మాత్రమే నేను మరీ మరీ మహాత్ముని కోరుతున్నాను. కాని మన దురదృష్టం కొలది మహాత్ముడు కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గాన్ని నియమించటానికి తన అశక్తతను తెలియజేస్తున్నారు. కాగా పరిణతమైన ఆలోచన తరువాత, కాంగ్రెసు సంస్థ అభివృద్ధికి సహకారిగా ఉండాలనే భావంతో, నేను నా రాజీనామా పత్రాన్ని మీ చేతులలో ఉంచుతున్నాను." ఆ రాజీనామా సుభాను చంద్రుని జీవితంలో ఒక అతి ముఖ్యమైన అధ్యాయానికి ముగింపునూ, భారతదేశం స్వాతంత్ర్యం కోసం అన్వేషిస్తూ అయన గడిపిన జీవితంలో ఒక నూతన అధ్యాయం అరంభాన్నీ తెలియజేస్తుంది.

సుభాను చంద్రుని రాజీనామా వార్త విని ఆయనకు రవీంద్రనాథ్ టాగూరు యీ క్రింది సందేశాన్ని పంపించాడు:

"మనిషిని అత్యధికంగా విసిగించి, రెచ్చగొట్టే పరిస్థితిలో మీరు ప్రదర్శించిన గాంభీర్యం, సహనం నాకు మీ నాయకత్వంలో విశ్వాసాన్ని కలిగజేశాయి. బెంగాలు కూడా అటువంటి నిర్దుష్టమైన మర్యాదను పాటించి, తన గౌరవాన్ని కాపాడుకోవాలి. ఈ విధంగా జరిగినప్పుడు మీ అపజయం మీకు శాశ్వత విజయంగా మారుతుంది."

సుభాను రెండవసారి కాంగ్రెసుకు అధ్యక్షుడుగా ఎన్నిక కావాలనే భావాన్ని బలపర్చుతూ టాగూరు మహాత్మునికి రాశాడని తరువాత బయటపడింది. టాగూరు దృష్టిలో ఇద్దరు ఆధునికులు మాత్రమే కాంగ్రెసు నాయకులలో ఉన్నారు. వారిలో ఒకరు జవహర్‌లాల్ కాగా మరొకరు సుభాను చంద్రుడు. దేశం ప్రయోజనాలను పరిరక్షించటానికి యీ ఇద్దరి నాయకత్వం అవసరమే. నెహ్రూ అప్పటికే ప్రణాళికా సంఘం అధ్యక్షుడు. కాగా టాగూరు దృష్టిలో సుభాను కాంగ్రెసు అధ్యక్షుడుగా కొనసాగాలి.

ఇది ఇలా ఉండగా, 1939లో భారతదేశం ప్రధాన రాజకీయ అవసరం ఒక సుసంఘటిత వామపక్షం కాంగ్రెసులో అంతర్భాగంగా అవతరించటమేనని, త్రిపురి కాంగ్రెసు మహా సభకు ముందు కాలంలోను, ఆ మహా సభ జరిగిన రోజులలోను, తరువాత కాలంలోను సుభాను చంద్రుడు తనకు కలిగిన అనుభవం ద్వారా గ్రహించాడు. కాగా కాంగ్రెసులో వున్న అన్ని అభ్యుదయకర, తీవ్రవాద శక్తులను కాంగ్రెసులో ఒక వర్గంగా కూడగట్టేందుకు తను కాంగ్రెసు అధ్యక్ష పదవికి రాజీనామా చేసిన నాటి నుండి సుభాను ప్రయత్నించటం ప్రారంభించాడు. అప్పుడు త్వరలో ముంచుకు వస్తుందనుకొన్న అంతర్జాతీయ యుద్ధ విపత్తును ఇండియా పూర్తిగా ఉపయోగించుకోవాలని 1939కి చాలా ముందే సుభాను విశ్వసించాడు. భారతీయులలో చాలా మంది సుభాను అభిప్రాయంతో ఏకీభవించినా, కాంగ్రెసు మితవాద వర్గం ఆయనతో ఏకీభవించలేదు.

కాగా కాంగ్రెసులో వామపక్షవాదుల బృందంగా ఫార్వర్డ్‌బ్లాక్ అవతరించింది. రెండు ఆశలతో సుభాను చంద్రుడు ఫార్వర్డ్ బ్లాక్‌ను నిర్మించాడు. తన పంథాకు అనుకూలంగా శక్తివంతంగా ప్రచారం చేసి, ఏదో ఒకనాడు కాంగ్రెసులో అధిక సంఖ్యాకులు తన పంథాను

ఆమోదించేటట్లు చేయవచ్చు అనేది ఆయన మొదటి ఆశ. ఒకవేళ ఆయన కోరిక యీడేరకపోతే, ఏదైనా పెద్ద క్లిష్ట పరిస్థితి ఎదురైనప్పుడు, తన మార్గాన తను నడవవచ్చును అనేది ఆయన రెండవ ఆశ. ఫార్వర్డ్ బ్లాక్ నిర్మాణం కాంగ్రెసులో అనైక్యతను సృష్టించిందనే విమర్శ వచ్చింది. దానికి సమాధానంగా, క్రియాశూన్యతకు దారి తీసే పైపై ఐక్యతకు, కార్య రంగంలో కన్పించే నిజమైన ఐక్యతకు మధ్యగల తేడాను గమనించాలని సుభాసు చంద్రుడు చెప్పాడు. అంతేకాదు, కాంగ్రెసులో అతివాదులను సంఘటితపరచటం నిర్లక్ష్యం చెయ్యబడినా, సకాలంలో జరగకపోయినా, ఇండియా ఏదైనా అంతర్జాతీయ సంక్షోభాన్ని వాస్తవంగా ఎదుర్కొనవలసి వచ్చినప్పుడు, మనం కళ్ళు నులుపుకుంటూ మేల్కొనవలసిన దుస్థితి దాపురించవచ్చునని సుభాసు చంద్రుడు వివరించాడు. అటువంటి పరిస్థితులలో 1914లో జరిగిన ప్రపంచయుద్ధం కాలంలో ఇండియా చేసిన పొరపాటునే మళ్ళీ చేయవలసి ఉంటుందని సుభాసు చంద్రుడు హెచ్చరించాడు.

1939 మే నెల నుండి ఫార్వర్డ్ బ్లాక్ ప్రచార యుద్ధం సుభాసు చంద్రుని నాయకత్వంలో పూర్తిగా ఊపును అందుకుంది. కాంగ్రెసు మంత్రి వర్గాలు, కాంగ్రెసు అధిష్టాన వర్గం విధానాలను విమర్శించేందుకు, బహిరంగంగా చర్చించేందుకు, ప్రజాస్వామికమైన హక్కు కాంగ్రెసు వాదులందరికీ ఉండాలని కోరుతూ దేశం అంతటా ప్రదర్శనలు జరిగాయి. ఆ ప్రదర్శనకు పిలుపు యిచ్చింది ఫార్వర్డ్ బ్లాక్. అటువంటి ప్రదర్శనలను కొనసాగించవద్దని సుభాసును కాంగ్రెసు నూతన అధ్యక్షుడైన రాజేంద్ర ప్రసాద్ హెచ్చరించాడు. సుభాసు చంద్రుడు కాంగ్రెసు అధ్యక్షుని ఆదేశాన్ని ధిక్కరించాడు. సుభాసుకు ఆ ఆదేశం అప్రజాస్వామికంగా కన్పించింది. వెంటనే సుభాసు క్రమశిక్షణ చర్యకు గురయ్యాడు. సుభాసు చంద్రుడు కాంగ్రెసు సంస్థలో ఏ స్థానానికీ మూడు సంవత్సరాల పాటు ఎన్నుకోబడకూడదని అధ్యక్షుని ఆజ్ఞ.

బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా రాజీలేని పోరాటం సాగించాలని, స్వాతంత్ర్య సమరం అనంతరం భారతదేశం సోషలిస్టు సిద్ధాంతాల ప్రకారం అభివృద్ధి చెందాలనీ ప్రజలకు చెప్పటమే ఆ ఉద్యమ తక్షణ లక్ష్యం. సుభాసు చంద్రుని సందేశం ప్రజలను బాగా ఆకర్షించింది.

సుభాసుకు ప్రజలలో ఆదరణ బాగా పెరిగింది. ఆయన దేశంలో పర్యటించినప్పుడు ప్రజలు ఆయనను ఆహ్వానించిన తీరు సుభాసుకు ప్రజాదరణ పెరిగిందనే విషయాన్ని స్పష్టం చేసింది. సుభాసు చంద్రుడు కాంగ్రెసు అధ్యక్ష పదవికి రాజీనామా చేసిన తరువాత, ప్రజలలో ఆయన ప్రతిష్ట తగ్గటానికి బదులు పెరిగిందని, కొన్ని నెలల తరువాత మహాత్ముడు చెప్పాడు.

ఆ రోజు 1939 సెప్టెంబరు 3వ తేదీ. సుభాసు చంద్రుడు మద్రాసు నగరం సముద్ర తీరాన ఒక బ్రహ్మాండమైన సభలో ఉపన్యసిస్తూ ఉండగా, ఇంగ్లండు-జర్మనీల మధ్య యుద్ధం ప్రారంభమైందనే వార్త ఆయనకు చేరింది. వెంటనే భారతదేశం తన స్వాతంత్ర్యం కోసం ఇంగ్లండు మీద పోరాటం ప్రకటించవలసిన సమయం వచ్చిందని సుభాసు ప్రకటించాడు. అది ఇండియాకు లభించిన సువర్ణావకాశం అని సుభాసు వర్ణించాడు. ఆ సమయంలో సుభాసు తన ఉత్సాహాన్ని దాచుకోలేదు, మాటల కోసం తడుముకోలేదు.

సుభాసు చంద్రుని ఉత్సాహం అలా ఉండగా, భారత జాతీయ నాయకులను సంప్రదించినట్లు నటించటం కూడా చెయ్యకుండా, ఇండియాలో బ్రిటిష్ వైస్‌రాయ్‌గా వున్న లిన్ లిత్ గో, ఇండియా యుద్ధంలో చేరిందని ప్రకటించాడు. అంతరంగిక కల్లోలాలను అణచివేయటానికి అతి కఠినమైన చర్యలు తీసుకోవటానికి తగిన అధికారాలను తనకు తానే యిచ్చుకుంటూ, ఒక ఆజ్ఞను జారీ చేశాడు. వెంటనే వైస్‌రాయ్‌ని కలిసిన మహాత్ముడు, ఇండియా బ్రిటన్ల మధ్య అభిప్రాయ భేదాలు ఉన్నప్పటికీ, బ్రిటన్ ఆపదలో చిక్కుకున్నది కాబట్టి, ఇండియా బ్రిటన్‌తో సహకరించాలని ప్రకటించాడు.

కాని సుభాసు చంద్రుడు అందుకు వ్యతిరేకమైన అభిప్రాయాన్ని ప్రకటించాడు. యుద్ధం మొదల భారత జాతీయ కాంగ్రెసు అవలంబించవలసిన విధానం భారత జాతీయ కాంగ్రెసు 1927వ సంవత్సరం నుండి ప్రతి సంవత్సరం ఆమోదించిన తీర్మానాలలో స్పష్టంగా ఉందన్నాడు. ఆ తీర్మానాలు యుద్ధాన్ని వ్యతిరేకించాయనీ, సామ్రాజ్యవాద యుద్ధాలలో బ్రిటన్ ప్రయోజనాలను కాపాడే నిమిత్తం భారత దేశాన్ని దోపిడీ చెయ్యటాన్ని అడ్డుకోవాలనీ, ఆ తీర్మానాలు కోరినట్లు సుభాసు

చంద్రుడు వివరించాడు.

ఆ విధంగా, మన దేశం ఒక క్లిష్టాతి క్లిష్టమైన పరిస్థితిని ఎదుర్కొంటున్న క్షణంలో మన జాతీయ నాయకత్వపు ప్రధాన స్రవంతి రెండు పాయలుగా చీలింది. ఆ రెండు పాయలూ ఒకదానికి ఒకటి ఎదురు ప్రవహించటం ప్రారంభించాయి.

# 24

1939 జూన్ 22న మొదటి అఖిల భారత ఫార్వర్డ్ బ్లాక్ మహా సభ బొంబాయిలో జరిగింది. సామ్రాజ్యవాద యుద్ధంలో ఇండియా చిక్కుకోవటాన్ని వ్యతిరేకిస్తూ త్వరలో బ్రిటన్‌తో అంతిమ పోరాటానికి దిగాలనే కాంగ్రెసు వాదులందరూ సుభాసు పిలుపుకు జేజేలు పలుకుతూ స్పందించారు. ఉత్సాహభరితమూ, ఆశాజనకమూ అయిన వాతావరణంలో ఫార్వర్డ్‌బ్లాక్ ప్రారంభోత్సవం జరిగింది. కాని ఇతర అతివాద పక్షాలు తమ ప్రత్యేక ఉనికిని రద్దు చేసుకొని ఫార్వర్డ్ బ్లాక్‌లో విలీనమై పోవటానికి నిరాకరించాయి. అయినా ఒక వామపక్షాల ఏకీకరణ కమిటీ ఏర్పాటు జరిగింది. ఆ కమిటీకి సుభాసు చంద్రుడు అధ్యక్షుడు. అందులో ఫార్వర్డ్ బ్లాక్, కాంగ్రెసు సోషలిస్టు పార్టీ, యం.యన్.రాయ్‌గారి రాడికల్ డెమొక్రటిక్ పార్టీ, కమ్యూనిస్టుల ప్రాబల్యంలో వున్న నేషనల్ ఫ్రంటు వున్నాయి. కాంగ్రెసులో వున్న మితవాదుల బలానికి సరితూగేందుకు ఆ వామపక్ష ఏకీకరణ కమిటీ ఒక త్రాటిమీద నడవాలని నిర్ణయం జరిగింది.

కాని ఆ ఆశ నెరవేరలేదు. కాలం గడిచిన కొలది వైరస్యం, విభేదాలు పెరిగి, కాంగ్రెసు మిత వాద వర్గానికి ఆ వామపక్ష ఏకీకరణ కమిటీ ఒక బలహీనమైన ప్రత్యామ్నాయంగా తయారైంది. కాగా యుద్ధ వ్యతిరేక ప్రచారాన్ని కొనసాగించే పని, స్వాతంత్ర్య సమరాన్ని తిరిగి ప్రారంభించాలని ప్రచారం చేసే పని కూడ సుభాసు చంద్రుడు, ఫార్వర్డ్ బ్లాక్ మాత్రమే చేయవలసి వచ్చింది. యుద్ధం యెడల కాంగ్రెసు అనుసరించవలసిన వైఖరిని నిర్ణయించటానికి కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గం 1939 సెప్టెంబరు 8న సమావేశమైంది. ఆ సమావేశానికి సుభాసు చంద్రుడు ప్రత్యేక ఆహ్వానితుడు.

సుభాసు చంద్రుడు తన ఉద్దేశాన్ని వివరించుతూ, తక్షణం కాంగ్రెసు స్వాతంత్ర్యం కోసం పోరాటాన్ని ప్రారంభించాలనీ, లేకపోతే తనకు వున్న బలంతోనే ఫార్వర్డ్ బ్లాక్ ఆ పనిని చేయవలసి వస్తుందనీ, స్పష్టంగా,

తెగేసి చెప్పాడు. చివరికి కాంగ్రెసు కార్య నిర్వాహక వర్గం బ్రిటిష్ యుద్ధ కృషికి షరతులతో కూడిన సహకారాన్ని అందించటానికి అంగీకరిస్తూ ఒక తీర్మానాన్ని ఆమోదించింది. బ్రిటిష్ వైస్‌రాయ్ ఒక నెల తరువాత ఆ తీర్మానానికి సమాధానం యిచ్చాడు. అంతకు ఒక దశాబ్దం ముందు ఇర్విన్ దొర యివ్వజూపిన అధినివేశ ప్రతిపత్తినే మళ్ళీ ఎప్పుడో యిస్తామంటూ, వైస్‌రాయ్ తన సమాధానంలో అన్నాడు.

వైస్‌రాయ్ సమాధానాన్ని ఆ సంవత్సరం అక్టోబరు నెల చివరిలో కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గం సమావేశమై చర్చించింది. కాంగ్రెసు మంత్రి వర్గాలను రాజీనామా చెయ్యమని ఆదేశించింది. 'శాసనోల్లంఘనం ప్రారంభిస్తాం' అంటూ పరోక్షంగా తన తీర్మానంలో కాంగ్రెసు కార్య నిర్వాహక వర్గం బ్రిటిష్ ప్రభుత్వాన్ని బెదిరించింది. కాగా కాంగ్రెసు మంత్రి వర్గాలు రాజీనామా పెట్టగానే, శాసనోల్లంఘన ఉద్యమం ప్రారంభమౌతుందని సుభాను చంద్రుడు ఆశించాడు. ఆ విధంగా, ప్రత్యక్షంగా కాని పరోక్షంగా కాని బ్రిటన్‌తో సహకరించాలనే విధానం త్రోసివేయబడుతుందని ఆశించాడు.

కాని సుభానుకు నిరాశయే ఎదురైంది. కాగా భారతదేశం వివిధ ప్రాంతాలలో బ్రహ్మాండమైన బహిరంగ సభలను నిర్వహించి యుద్ధ కృషికి సహాయం చెయ్యవద్దనీ, తక్షణం స్వాతంత్ర్య సమరాన్ని ప్రారంభించాలనీ సుభాను ప్రచారం చెయ్యటం ప్రారంభించాడు. 1939 అక్టోబరులో నాగపూరులో ఒక సామ్రాజ్యవాద వ్యతిరేక మహాసభ జరిగింది. ఫార్వర్డ్ బ్లాకూ, స్వామి సహజానంద సరస్వతి నాయకత్వాన పనిచేస్తున్న కిసాన్ సభల ఆధ్వర్యాన రాంఘర్ (బీహారు)లో 1940 మార్చి నెలలో ఒక బ్రహ్మాండమైన అఖిల భారత రాజీ వ్యతిరేక మహాసభ జరిగింది. అదే సమయంలో, అదే చోట జరిగిన కాంగ్రెసు మహా సభల కంటె, ఆ అఖిల భారత రాజీ వ్యతిరేక మహా సభ పెద్దది కావటం గమనార్హం. ఆ మహాసభను ఉద్దేశించి మాట్లాడుతూ "మనకు అకస్మాత్తుగా చుట్టుముట్టిన సంక్షోభం ఇండియా చరిత్రలో అరుదు కావచ్చును. కాని ఇటువంటి సంక్షోభం ప్రపంచ చరిత్రలో అరుదుకాదు. ఇండియాలో మనం ఇప్పుడు అస్తమించుతున్న ఒక శకానికి వీడ్కోలు చెప్పుతున్నాం. అదే సమయంలో మనం ఒక నూతన శకాన్ని ఉదయింపచేస్తున్నాం.

సామ్రాజ్యవాదం అస్తమించుతూ వుంది! స్వాతంత్ర్యం, ప్రజాస్వామికం, సామ్యవాదాల యుగం - అదిగో! మనకు కన్పించుతూ వుంది. ఈ సంక్షోభం ఇండియా జాతీయ నాయకత్వానికి ఒక కఠినమైన పరీక్షను నిర్వహించింది., మన నాయకత్వం యీ పరీక్షలో నెగ్గలేకపోయింది. ఈ క్లిష్ట సమయంలో, ఇంతవరకు వామపక్షవాదులం అనుకుంటున్నవాళ్ళు ముక్కలు, చెక్కలుగా చీలిపోవటం అత్యంత బాధాకరమైన దృశ్యం. ఇండియా వామపక్షవాదులందరికీ రేపొక కఠినమైన పరీక్షా దినం. ఇప్పుడు మన ఉద్యమం సామ్రాజ్యవాద వ్యతిరేక దశలో వుంది. సామ్రాజ్యవాదాన్ని అంతమొందించి, ఇండియాకు జాతీయ స్వాతంత్ర్యాన్ని సంపాదించటం యీరోజున మన ప్రధాన కర్తవ్యం. మనకు స్వాతంత్ర్యం వచ్చిననాడు, జాతీయ పునర్నిర్మాణ శకం ప్రారంభమౌతుంది. అది మన ఉద్యమ సోషలిస్టు దశ అవుతుంది." అని సుభాను చంద్రుడు ఉద్రేకపూరితంగా ఉద్ఘాటించాడు.

1939 ఆగస్టు నెలలో సుభాను చంద్రుడు 'ఫార్వర్డ్‌బ్లాక్' వార పత్రికను ప్రారంభించాడు. ఆ పత్రికకు ఆయనే సంపాదకుడు. ఆ పత్రికలో ఆయన వారం, వారం, తను స్వయంగా రాసిన సంపాదకీయ వ్యాసాలను ప్రచురించేవాడు. ఆ వ్యాసాలు ఒక పత్రిక సంపాదకుడుగా ఆయనకు గల నైపుణ్యాన్ని, తార్కికంగా ఆయన తన ప్రత్యర్థులను ఎదుర్కొనే విధానాన్ని, తన రాజకీయ ఆలోచనలను తన పాఠకుల ముందు శక్తివంతంగా ఉంచటానికి వ్యంగ్యం, వక్రోక్తి, వక్కాణింపులను రచనలలో చక్కగా వాడుకోగల ఆయన శక్తిని, బయటపెట్టాయి. ఆ పత్రిక పుటలలో ఆయన తన పర్యటనల అనుభవాలను, స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొని త్యాగం చెయ్యమని తను ప్రజలకు యిచ్చిన పిలుపునకు వచ్చిన స్పందననూ, వర్ణనాత్మకంగా వివరించేవాడు.

తాత్కాలిక రాజ్యాంగ నిర్మాణ సభను ఏర్పాటు చెయ్యాలనే ప్రతిపాదనను సుభాను వ్యతిరేకించాడు. నిజమైన రాజ్యాంగ నిర్మాణసభ ఏర్పాటు తాత్కాలిక జాతీయ ప్రభుత్వం రాజకీయాధికారాన్ని చేజిక్కించుకున్న తరువాతనే సాధ్యమౌతుందని ఆయన విశ్వాసం.

అఖిల భారత రాజీ వ్యతిరేక మహాసభ జరిగిన వెంటనే, బ్రిటిష్ ప్రభుత్వం ఫార్వర్డ్ బ్లాక్ మీద విరుచుకుపడి, దేశం నలుమూలలా ఫార్వర్డ్

బ్లాక్ కార్యకర్తలను నిర్బంధించింది, ఫార్వర్డ్ బ్లాక్ మీద చాలా భీకరంగా దాడి చేసింది. అదే సమయంలో కాంగ్రెసు మితవాద వర్గం ఫార్వర్డ్ బ్లాక్ యెడల తన వైర భావాన్ని విస్మరించలేదు. అయినప్పటికి 1940 జూన్ నెలలో సుభాను చంద్రుడు నాగపూర్‌లో ఫార్వర్డ్ బ్లాక్ రెండవ మహా సభను జరిపాడు. "అధికారం మొత్తం భారతీయులకు దక్కాలి" అనే నినాదాన్ని ఆ సభలో మారుమ్రోగించాడు. ఆ సమయంలో ఐరోపా యుద్ధం మంచి కీలకదశలో ప్రవేశించింది. హిట్లరు దాదాపు పశ్చిమ ఐరోపానంతటినీ కబళించాడు. ఇటలీ యుద్ధంలో ప్రవేశించింది. సుభాను నాగపూరు నుండి కలకత్తా వెళ్ళుతూ, సేవాగ్రాంలో మహాత్ముని కలిశాడు. మహాత్ముడు, సుభానుల మధ్య అదే ఆఖరి సమావేశం. ఆ చక్కని అదనులో మళ్ళీ భారత జాతీయోద్యమానికి నాయకత్వం వహించమని సుభాను చంద్రుడు మహాత్ముని కోరాడు. మహాత్ముడు అందుకు అంగీకరించకుండా, "మీ ఆత్మ ప్రబోధం ప్రకారం మీరు ముందడుగు వెయ్యటానికి మీకు పూర్తి స్వాతంత్ర్యం వుంది" అని సుభానుకు చెప్పాడు. సుభాను తన విధానం ద్వారా భారతదేశానికి స్వాతంత్ర్యాన్ని సంపాదించితే, సుభానును అభినందించేవారిలో తనే మొదటివాడుగా ఉండగలనని కూడా గాంధీ చెప్పాడు.

1937లో సుభాను చంద్రుడు నిర్బంధం నుండి విడుదల కాగానే, బెంగాలు కాంగ్రెసువాదులు కలకత్తాలో ఒక కాంగ్రెసు భవనాన్ని నిర్మించే నిమిత్తం 'సుభాను కాంగ్రెసునిధి'ని వసూలు చేసి, దానిని సుభానుకు బహూకరించాలని నిర్ణయించారు. ఆనాడు కాంగ్రెసు అధ్యక్షుడైన జవహర్లాల్ నెహ్రూ ఆ ప్రతిపాదనను సమర్థించుతూ, విరాళాలకోసం బెంగాలు ప్రజలకు చేసిన విజ్ఞప్తికి తన పిలుపును కూడా జతచేశాడు. ఒక సంవత్సరం తరువాత కలకత్తా కార్పొరేషన్ ఒక స్థలాన్ని సుభానుకు అప్పగించింది. వెంటనే సుభాను ఆ కాంగ్రెసు భవన నిర్మాణం నిమిత్తం ఒక పటాన్ని గీయించాడు. ఆ భవనం కాంగ్రెసు ప్రధాన కేంద్రంగానే కాకుండా ఒక గొప్ప జాతి ఉద్ధరణ కార్యక్రమాల కేంద్రం కావాలని సుభాను ఆకాంక్ష. కాగా ఆ ప్రతిపాదనను జాతీయ కవి రవీంద్రనాథ్ టాగూరుకు తెలియజేసి, ప్రతిపాదిత భవనానికి ఒక పేరును సూచించవలసినదిగా సుభాను చంద్రుడు రవీంద్రుని కోరాడు. సుభాను

అందించిన పటాన్ని టాగూరు హృదయపూర్వకంగా ఆమోదించాడు. ఆ భవనానికి 'మహాజాతి సదన్' అని నామకరణం చేశాడు. (అనగా 'భారత జాతి భవనం'). తన ఆరోగ్యం అంతబాగాలేక పోయినా సుభాను చంద్రుని ఆహ్వానాన్ని ఆమోదించి టాగూరు శాంతినికేతన్ నుండి కలకత్తా వరకు ప్రయాణం చేశాడు. కన్నుల పండుగగా జరిగిన ఉత్సవంలో ఆ భవనానికి టాగూరు శంకుస్థాపన చేశాడు. అది 1939 ఆగస్టు నెల. ఆ శంకుస్థాపన మహోత్సవ సందర్భంలో ఉపన్యసిస్తూ, టాగూరు, సుభాను చంద్రులు, ఇద్దరూ, భారతజాతి విముక్తికోసం, ప్రతి భారతీయుని వ్యక్తిగత స్వాతంత్ర్యం కోసం, ఇంకా ఇండియా ధీరత్వం కోసం, ఇండియా ఒక జాతిగా బహుముఖమైన అభివృద్ధిని సాధించటం కోసం, జరిగే ప్రయోజనకరమైన కార్యక్రమాలన్నింటికీ, ఆ భవనం సజీవమైన కేంద్రంగా వర్థిల్లుతుందని ఊహించారు, వర్థిల్లాలని ఆకాంక్షించారు.

1938 నుండి ముఖ్యంగా 1939 జనవరి వరకు కాంగ్రెసు మితవాదవర్గం. సుభాసు చంద్రుల మధ్య ఒక తీవ్రమైన వివాదం చెలరేగిన సందర్భంలో వ్యక్తిగతంగాను, సైద్ధాంతికంగాను కూడా, సుభాసు చంద్రునికి టాగూరు తన మద్దతును ప్రకటించాడు. 1939 జనవరిలో సుభాసు గౌరవార్థం శాంతి నికేతన్‌లో పెద్ద ఎత్తున స్వాగత, సత్కారాలను ఏర్పాటు చేశాడు. అప్పుడొక పెద్ద వివాదం జరుగుతూ వున్నప్పటికీ, కలకత్తాలో సుభానును బహిరంగంగా గౌరవించి, టాగూరు తన వైఖరిని స్పష్టం చెయ్యాలనుకున్నాడు. సుభాసు చంద్రునికి ఆ బహిరంగ సభలో సమర్పించే నిమిత్తం 'దేశనాయక్' లేదా 'జాతినేత' అనే శీర్షిక క్రింద టాగూరు ఒక స్వాగత పత్రాన్ని రచించాడు. టాగూరు నిర్వహణలోవున్న విశ్వ భారతికి ఎటువంటి చెడు జరగకుండా నివారించే నిమిత్తం ఆ స్వాగత సమారోహాన్ని నిర్వహించవద్దని సుభాసు చంద్రుడు స్వయంగా టాగూరును చెప్పినట్లు అప్పుడు అనుకున్నారు.

ఆ స్వాగత పత్రం రెండవ ప్రపంచ యుద్ధానంతరం విడుదలైంది. ఆ స్వాగత పత్రంలో ఎన్నో ఇతర విషయాలను ప్రస్తావించుతూ, రవీంద్రనాథ్ టాగూరు సుభాసు చంద్రుని గురించి యీ విధంగా చెప్పాడు: "మీ రాజకీయ 'సాధన' ప్రారంభానికి సాక్షిగా వెలుగును వెదజల్లిన మహోదయాన్ని నేను శ్రద్ధగా గమనించాను. ఆ అనిశ్చితమైన సంధ్యలో

నా మనస్సులో కొన్ని సందేహాలు ఉండేవి. కాగా మీరు ఈనాడు ఉన్నంత ఉన్నతవ్యక్తిగా ఆనాడు నాకు కన్పించలేదు. ఈనాడు మీరు స్వచ్ఛమైన మధ్యాహ్నపు వెలుగులో, ఏ భావ గ్రహణం ప్రభావం వలన మరుగున పడకుండా, స్పష్టంగా కన్పిస్తున్నారు. ఈ మధ్యకాలంలో మీరు ఎంతో వైవిధ్యంగల అనుభవాన్ని సంపాదించారు. ఈ రోజున మీరు చేసే ప్రతి పని మీదా అణచి వేయటానికి సాధ్యపడని మీ జీవశక్తి, మీ పరిణతమైన మేథస్సుల ముద్ర ఉంటుంది. కారాగారవాసం, బహిష్కరణ, వ్యాధి, మీ దేహదారుఢ్యాన్ని దెబ్బతీశాయి. అయినా ఇవి మీ హృదయాన్ని సంకోచింప చేయటానికి బదులు, విశాలం చేశాయి. మీ దృష్టిని విస్తరింపజేసాయి. తత్ఫలితంగా మీరు యీనాడు మీ దృష్టిని పరిమితమైన భూభాగాల సరిహద్దుల వెలుపలకు కూడా సారించగల్గుతున్నారు. మీరొక సత్కార్యాన్ని సాధించటానికి, అనగా మీ మాతృభూమిలో ఒక నూతన ఆశా దీపాన్ని వెలిగించటానికి, యీ భూమి మీద మీరు అవతరించారని నేను భావిస్తున్నాను. తన దేశంలో పూర్తిగా వెలుగులోకి వచ్చిన ఒక మహా వ్యక్తిని నేను యిప్పుడు సంబోధిస్తున్నాను రానున్న సమరంలో నేను ఆయన పక్కన నిలబడకపోవచ్చును. నేను ఆయనను ఆశీర్వదించటం మాత్రమే చేసి, సెలవు తీసుకుంటాను. తన దేశం దుఃఖభారాన్ని తనదిగానే ఆయన గుర్తించాడని తెలిసికొని కూడా, ఆయన మాతృభూమికి లభించనున్న స్వాతంత్ర్యరూపంలో, ఆయనకు రావలసిన ఆఖరి బహుమతి ఆయనకు త్వరగా అందుతుందని తెలిసికొని కూడా, నేను ఆయన నుండి వీడ్కోలు తీసుకుంటున్నాను."

# 25

ఇండియాలో బ్రిటిష్ అధికారం, ఇండియా జాతీయ ఉద్యమానికి మధ్యగల సంబంధం, సాయుధమైన ఒక కోటకు, దానిని జయించటానికి చుట్టుముట్టిన నిరాయుధులైన ప్రజాసమూహానికి మధ్యగల సంబంధం వంటిదని 1930వ సంవత్సరం నుండి సుభాసుచంద్రుడు చెపుతూ ఉండేవాడు. ఆయన దృష్టిలో ఇండియాకు స్వాతంత్ర్యం సంపాదించటానికి రెండు మార్గాలున్నాయి. ఆ కోటను పూర్తిగా బహిష్కరించి, ఆర్థిక దిగ్బంధనానికి గురిచెయ్యటం, అనగా వీలైనంత విస్తృతపరిధిలో సామూహిక శాసనోల్లంఘునంచేసి, సంపూర్ణ సహాయ నిరాకరణోద్యమాన్ని నిర్వహించటం ఒక మార్గం. ఆ కోటను సాయుధ బలంతో జయించటం రెండవ మార్గం. 1939లో సుభాసు కాంగ్రెసు అధ్యక్ష పదవికి రాజీనామా చేయవలసి వచ్చినప్పుడు, జాతీయ దృక్పథంలో ఆలోచించగా భారతదేశం పరిస్థితి ఆయన దృష్టిలో యీక్రింది విధంగా వుంది: సామూహిక ప్రజా ఉద్యమాన్ని ప్రారంభించి, బ్రిటిష్ ప్రభుత్వంతో ఘర్షణ పడటానికి కాంగ్రెసు మితవాదులు, మహాత్ముడు కూడా అయిష్టంగానే ఉన్నారు. మరొకవంక వామపక్షాలను ఐక్యం చెయ్యటానికి తను (సుభాసు చంద్రుడు) చేసిన కృషి విఫలమైంది. ఆ రోజున ఇండియాలో ఎన్నో వామపక్షాలు, వామపక్ష భావాలు గల బృందాలు ఉన్నాయి. అవన్నీ వామపక్ష సిద్ధాంతాలనే వల్లె వేస్తున్నాయి. కాని బ్రిటిష్ సామ్రాజ్యవాదంపైన స్థిరచిత్తంగల, నిర్దిష్టమైన, రాజీలేని, పోరాటాన్ని ప్రారంభించి, కొనసాగించటానికి, లేదా అటువంటి పోరాటంలో పాల్గొనటానికి అవి సిద్ధంగా లేవు. అంతేకాదు. ఆ స్థితిని పూర్తిగా బ్రిటిష్ ప్రభుత్వం దానికి అనుకూలంగా ఉపయోగించుకుంటూ ఉండగా, ముస్లింలీగు, హిందూ మహాసభ వంటి మతతత్వ సంస్థలు జాతీయ స్వాతంత్ర్యం సమస్యను, అంతర్జాతీయ పరిస్థితిని విస్మరించి, మత సంబంధమైన ప్రశ్నలను, వేర్పాటు వాదాన్ని లేవనెత్తటం, సుభాసు చంద్రునికి ఎంతో దిగులు కల్గించింది. మొత్తం మీద ఆ విధంగా,

నిరాశాజనకంగా వున్న పరిస్థితులలో బయట నుండి బ్రిటిష్ ఇండియా మీద సైనికంగా దెబ్బతియ్యటానికి తను ఈదేశం నుండి తప్పించుకొని విదేశాలకు వెళ్ళాలని తనలో తను ఆలోచించుకోవటం ప్రారంభించాడు. బ్రిటిష్ ప్రభుత్వానికి అఖరి అండగా ఇండియాలో మిగిలివున్న భారతీయ కిరాయి సైనికుల విధేయతను ఆ దెబ్బతో అంతమొందించటం సుభాను చంద్రుని ఆశయం.

1939 ప్రథమార్ధంలో చైనా వెళ్ళాలని సుభాను చంద్రుడు ఆలోచించాడు. కాని బ్రిటిష్ ప్రభుత్వం పాస్‌పోర్టును యివ్వలేదు. అప్పుడు చైనా, బ్రిటన్ల మధ్య ఒక ఒడంబడిక అమలులో వుంది. దాని షరతులను దృష్టిలో వుంచుకొని, చైనా కూడా సుభానుచంద్రుని రాజకీయ శరణార్థిగా అనుమతించడానికి నిరాకరించింది.

1940 ప్రారంభంలో ఇండియాను విడిచిపెట్టి సోవియట్ యూనియన్, ఐరోపాలవైపుకు రహస్యంగా వెళ్ళిపోవటానికిగల సాధ్యాసాధ్యాలను గురించి, సుభాను చంద్రుడు తన బెంగాలు, పంజాబు మిత్రులతో సంప్రదించాడు.

ఈలోగా ఫార్వర్డ్ బ్లాక్ 1940లో ఏప్రిల్ ప్రారంభించిన శాసనోల్లంఘనోద్యమం ఊపును అందుకొంది. బెంగాలును స్వతంత్రంగా పాలించిన మహా రాజైన సిరాజుద్దౌలాకు కలకత్తాలో శాశ్వతంగా కళంకం కల్గిచుతున్న హాల్వెల్ విగ్రహాన్ని తొలగించాలని ఆ ఉద్యమం డిమాండ్ చేసింది. హిందూ, ముస్లిం యువతీ యువకులందరూ ఆ నినాదాన్ని బలపర్చారు. ఆ జూలై నెల మొదటివారంలో హాల్వెల్ విగ్రహం దగ్గర సత్యాగ్రహం నిర్వహించేందుకు సుభాను చంద్రుడే ఒక సేవా దళానికి నాయకత్వం వహించాడు. ప్రభుత్వం వెంటనే సుభాను చంద్రుని ఇండియా రక్షణ చట్టం కింద నిర్బంధించి కలకత్తా ప్రెసిడెన్సీ జైలుకు పంపించింది. రాజద్రోహం నేరంకింద అయన మీద రెండు కోర్టు కేసులు కూడా బనాయించింది. అయన జైలులో ఉండగానే, తూర్పు బెంగాలులో వున్న ఢక్కా నియోజక వర్గం నుండి కేంద్ర శాసన సభకు ఎన్నికయ్యాడు.

అయన జీవితంలో అత్యంత ప్రధానమైన నిర్ణయం కలకత్తా ప్రెసిడెన్సీ జైలులో జరిగింది. అప్పుడు జరుగుతున్న యుద్ధ ఫలితంగా బ్రిటిష్ సామ్రాజ్యం ముక్కలైపోతుందని అయన దృఢ విశ్వాసం. కాని

పోరాటం లేకుండా బ్రిటిష్ సామ్రాజ్యవాదులు ఇండియాకు స్వాతంత్ర్యం యివ్వరని కూడా ఆయన నమ్మకం. కాగా స్వాతంత్ర్యాన్ని సంపాదించటం కోసం ఇండియా అంతర్జాతీయ రాజకీయాలలో చురుగ్గా పాల్గొనాలి అని ఆయన భావించాడు. ఆ సమయంలో స్తబ్దంగా తను జైలులోపల ఉండటం పెద్ద నేరం అవుతుందని ఆయన అనుకున్నాడు. కాని చట్టబద్ధంగా తను జైలునుండి విడుదల అయ్యే అవకాశం కన్పించుట లేదు. కాగా ఇండియా ప్రభుత్వానికి ఒక తుది హెచ్చరిక పంపుతూ, తనను నిర్బంధించటం నైతికంగా గాని, చట్టరీత్యాగాని సమర్ధనీయం కాదు కాబట్టి, తనను వెంటనే విడుదల చెయ్యకపోతే, తను ఆమరణ నిరాహార దీక్షకు పూనుకో బోతున్నట్లు, తెలియజేసాడు. ఈ సందర్భంలో ప్రభుత్వానికి సుభాను చంద్రుడు ఎన్నో చారిత్రాత్మక ప్రాముఖ్యంగల లేఖలను రాశాడు. వాటిల్లో ఒకదానిని తన వీలునామాగా వర్ణించాడు. అందులో ఎన్నో విషయాలను ప్రస్తావిస్తూ, యీ క్రింది ప్రవచనాలను కూడా రాశాడు:

"తక్షణం కంటికి కన్పించే ప్రయోజనం కలగకపోయినా, ఏ బాధ, ఏ త్యాగం ఎప్పుడూ వృధా పోదు."

"ఈ అశాశ్వతమైన ప్రపంచంలో ప్రతిదీ వినాశనమయ్యేదే, వినాశనమౌతుంది. కాని భావాలు, ఆదర్శాలు, కలలు, వినాశనం కావు. ఒక వ్యక్తి ఒక ఆదర్శం కోసం మరణించవచ్చును కాని ఆయన మరణం తరువాత కూడా ఆ ఆదర్శం ఓ వెయ్యిమందిలో తిరిగి అవతరించుతుంది."

"ఒక వ్యక్తి ఒకానొక సిద్ధాంతం కోసం జీవించి, ఆ సిద్ధాంతం కోసమే మరణించాడన్న భావం కంటె గొప్ప ఓదార్పు ఏముంటుంది?... ఒక వ్యక్తి ప్రశాంతంగా తన ఆశయం బలిపీఠం మీద ఆత్మాహుతి కావటం కంటె ఉదాత్తమైన సిద్ధిని ఏ జీవితం సాధించకల్గుతుంది?"

1940వ సంవత్సరం నవంబరు నెల చివర, కాళీదేవి పూజ రోజున, సుభాను చంద్రుడు తన నిరాహార దీక్షను ప్రారంభించాడు. మొదట ప్రభుత్వం చాలా కఠినమైన వైఖరిని అవలంబించి, సుభాను తుది హెచ్చరికకు జవాబు కూడ యివ్వలేదు. యుద్ధం అంతమయ్యే వరకు సుభాను చంద్రుని ప్రభుత్వ సంరక్షణలోనే ఉంచాలని కేంద్ర ప్రభుత్వం బెంగాలు ప్రభుత్వానికి గట్టిగా తెలియజేసింది. కేంద్ర ప్రభుత్వం వైఖరి అలా సుభానుకు ప్రతికూలంగా ఉన్నది కాబట్టి, నిరాహార దీక్షను కొనసాగించవద్దని సుభానుకు

తెలియజెయ్యవలసినదిగా బెంగాలు ప్రభుత్వం శరత్ చంద్రుని కోరింది. కాని సుభాను నిరాహార దీక్ష ఒక వారం సాగిన తరువాత, తన ఖైదీ జైలులో మరణించుతాడేమోనని బెంగాలు ప్రభుత్వం హఠాత్తుగా భయపడింది. వెంటనే బెంగాలు ప్రభుత్వపు ఉన్నతోద్యోగుల రహస్య సమావేశం జరిగింది. ఆయనకు స్వస్థత చేకూరిన తరువాత మళ్ళీ నిర్బంధించవచ్చుననే దురాలోచనతో, సుభానును విడుదల చెయ్యటానికి ఆ సమావేశం నిర్ణయించింది. అందుకు కేంద్ర ప్రభుత్వం బెంగాలు ప్రభుత్వాన్ని గట్టిగా ఆక్షేపించింది. తాము సుభానుతో "పిల్లి-ఎలిక ఆటను" ఆడుతున్నామనీ, ప్రభుత్వం ఆదుర్దా పడవలసిన అవసరం ఏమీ లేదనీ బెంగాలు ప్రభుత్వం కేంద్ర ప్రభుత్వానికి తెలియజేసింది.

జైలునుండి విడుదల అయిన తరువాత, ఇండియానుండి తప్పించుకు పోవటానికి సుభాను చంద్రుడు పథకాలు వెయ్యటం ప్రారంభించాడు. ఆ విరామ సమయంలో సుభాను చివరిసారిగా మహాత్మునితో ఉత్తర ప్రత్యుత్తరాలు కొనసాగించాడు. జాతీయ స్వాతంత్ర్యం కోసం, కనీసం వ్యక్తిగత సత్యాగ్రహ ఉద్యమాన్ని ప్రారంభించినా సరే, తను గాంధీతో బేషరతుగా సహకరించటానికి సిద్ధంగా ఉన్నట్లు సుభాను చంద్రుడు గాంధీకి తెలియజేసాడు. తనయందు విశ్వాసంగల బెంగాలు కాంగ్రెసు కమిటీలమీదా, కాంగ్రెసు వాదులమీదా ఎడాపెడా తీసుకున్న క్రమశిక్షణా చర్యలను రద్దు చేయించి, బెంగాలు కాంగ్రెసులో ఐక్యతను పునరుద్ధరించమని సుభాను చంద్రుడు మహాత్ముని కోరాడు. కాని వారిద్దరి మధ్య మౌలికమైన భేదాలు ఉన్నందున, వారిలో ఒకరు మరొకరి వైఖరిని ఆమోదించే వరకు, వారిరువురు భిన్న మార్గాలలో నడవవలసిందేనని మహాత్ముడు సుభానుకు సమాధానం యిస్తూ రాశాడు.

జైలు నుండి విడుదల కాగానే, సుభాను వాస్తవంగా ఇండియానుండి తప్పించుకుపోవటానికి పథకాలను సిద్ధం చేయటానికి పూనుకున్నాడు. ముందు ఆయన కలకత్తాలో తన ఇంటినుండి రహస్యంగా బయటకు వెళ్ళాలి. చివరికి తను ఇండియానుండి విదేశాలకు వెళ్ళాలి. అందుకు ఇండియాకు వాయువ్య సరిహద్దున గల గిరిజన ప్రాంతాలు సహాయపడగలవనే భావంతో, సుభాను ఇద్దరు యువకులను తన దగ్గరకు రమ్మన్నాడు. ఒకరు శరత్ చంద్రుని కుమారుడైన శిశిర్, మరొకరు

పెషావర్‌లో ఫార్వర్డ్ బ్లాక్ నాయకుడైన మియాన్ అక్బర్ షా. మియాన్ అక్బరు షా సుభాసుకు దగ్గరగా ఉండే సహచరుడు.

సుభాసు తనకు దగ్గరలో వున్న శిశిర్‌కు మొదట తన పథకాన్ని బయటపెట్టాడు. తన ఇంటినుండి అతి రహస్యంగా బయటకు వెళ్ళటాన్ని గురించి ముందు వారిద్దరూ చర్చించారు. ఒకరాత్రి వేళ, సుభాసును ఇంటినుండి కారులో బయటకు తీసుకొని వెళ్ళి, ఒక రైల్వే స్టేషన్‌లో పెషావర్‌కు రైలుబండిలో ఎక్కించటం శిశిర్ బాధ్యతగా నిర్ణయం జరిగింది. సూక్ష్మాతి సూక్ష్మమైన అంశాలను కూడా విస్మరించకుండా వారిరువురూ ఎన్నో ప్రత్యామ్నాయ పథకాలను చర్చించారు. చివరికి వారి తర్కానికి అందినంత వరకు విఫలం కావటానికి వీలులేని పథకం ఒకటి వారు రూపొందించగల్గారు. వారి దగ్గర బంధువుల అమ్మాయి అయిన ఇలాకు కూడ సుభాసు రహస్యంగా తప్పించుకు పోవటాన్ని గురించి శిశిర్ తెలియజెయ్యాలని నిర్ణయించుకున్నా, ఒంటరిగా తపస్సు చేయటానికి సుభాసు ఇంటినుండి వెళ్ళి పోయాడనే కథ సుభాసు ఇంటి దగ్గర ప్రచారం కావాలి అని కూడా నిర్ణయించుకున్నారు.

ఈలోగా ఒక టెలిగ్రాం సందేశాన్ని అందుకొని, పెషావరు నుండి మియాన్ అక్బర్ షా వచ్చాడు. సుభాసు చంద్రుడు, శిశిర్‌ను అక్బర్‌షాకు పరిచయం చేశాడు. సుభాసు మారు వేషానికి అవసరమైన దుస్తులను ఆ యువకులిద్దరూ కొన్నారు. సుభాసు చంద్రుడు ఉత్తర హిందూస్థానపు ముస్లిం వేషంలో ఓ ఇన్సూరెన్స్ కంపెనీ ఇన్‌స్పెక్టర్ వలె, మహమ్మద్ జియా ఉద్దీన్ అనే పేరుతో, ప్రయాణం చెయ్యాలని నిర్ణయించుకున్నారు.

ఆఫ్ఘనిస్తాన్ గిరిజన ప్రాంతాల గుండా సుభాసు ప్రయాణానికి ఏర్పాట్లు చేసే బాధ్యత మియాన్ అక్బర్‌షాది. డిసెంబరు నెలలో ఎక్కువ కాలం కలకత్తాకు దూరంగా వున్న శరత్ తిరిగి రాగానే, సోదరులిద్దరూ వెంటనే రహస్యంగా సమావేశమయ్యారు. సుభాసు ఇండియా నుండి తప్పించుకుపోవటానికి తయారు చేసిన సమగ్ర పథకంలో శరత్ చిన్న చిన్న మార్పులు చేసి, ఆ పథకాన్ని ఖాయం చేయటానికి తోడ్పడ్డాడు.

ఏ రోజున సుభాసు బయల్దేరాలి అనే విషయం సుభాసు, మియాన్ అక్బర్ షాలు కలిసి నిర్ణయించారు. ఆ తేదీ అత్యంత నిగూఢ రహస్యం.

# 26

అతి రహస్యంగా ఉంచిన ఆ తేదీ 1941 జనవరి 16. దానికి ఒక రెండు రోజులు ముందుగా తను కొన్ని రోజులు ఏకాంతంగా ఉండబోతున్నానని సుభాను చంద్రుడు తన కుటుంబ సభ్యులకు తెలియజేసాడు. ఆ రోజులలో తను ఎవరికీ కనపడననీ, ఎవరితోను టెలిఫోన్ ద్వారా కూడా మాట్లాడనని చెప్పాడు. కాగా ఆయన గదిలో తెరలు ఏర్పాటు చేశారు. అ గదిలో తెరల సహాయంతో చిన్న చిన్న గదులు ఏర్పడ్డాయి. ఒక తెర క్రిందగా సుభానుకు వంట మనిషి ఆహార పానీయాలు అందించేందుకు, వాడిన పళ్ళెం, గ్లాసులు వగైరాలను ఆ వంట మనిషే మరునాడు తీసుకొని వెళ్ళిపోయేటట్లు ఏర్పాట్లు జరిగాయి.

ఒక నిర్ణీతమైన రోజు రాత్రి ఆచార ప్రకారం సుభాను చంద్రుడు తన అమ్మ, యింకా తన కుటుంబపు యితర సభ్యులతో కలిసి విందు ఆరగించాడు. వారిలో దాదాపు అందరూ నిద్రకు ఉపక్రమించగానే, ఇంటి నుంటి వెళ్ళి పోవటానికి సుభాను ఏర్పాట్లు చేసుకోవటం ప్రారంభించాడు. సుభాను ఏకాంతంలోకి వెళ్ళిపోతున్నాడనే దొంగ కథను ప్రచారం చెయ్యటానికి, ఇలాకు తోడుగా సుభాను అన్నల కుమారులలో మరొక ఇద్దరికి ఆ కథను తెలియచెయ్యాలనే నిర్ణయం జరిగింది. శిశిర్ ఆ రాత్రి 9 గంటలకు తన జర్మనీ వాండరర్ కారును తీసికొని వచ్చాడు. సుభాను పెట్టెల మీద పెద్ద పరిమాణంలో 'ఎమ్.జడ్.' అనే అక్షరాలను రాయించారు. అక్కడ ఏంటో జరుగుతూ వుందనే అనుమానంతో వారి కుటుంబ సభ్యులలో ఒకరిద్దరు అక్కడే తారట్లాడుతున్నారు. సుభాను మరి కొంచెం సేపు ఓపిక పట్టాడు. అర్ధరాత్రి దాటింది. సమయం ఒంటి గంటన్నర. క్యాలండర్ తేదీ మారింది. అది 1941 జనవరి 17వ తేదీ. పోలీసులు కన్పించటం లేదు. వీధులు నిర్మానుష్యంగా ఉన్నాయి. శిశిర్ కారును ముందుకు నడిపించాడు. సుభాను తన ఇంటి నుండి వెళ్ళిపోయాడు. సుభాను ముదురు గోధుమ రంగు షేర్వానీని, వదులుగా వున్న పైజమాను,

ఊలుదారాలతో అందంగావున్న ఐరోపా పాదరక్షలను, ఆస్త్రఖాన్ బొచ్చు టోపీ వంటి టోపీని ధరించి ఉన్నాడు.

ఇంటి నుండి బయల్దేరిన తరువాత, మామూలు దుస్తులలో పోలీసులు ఎవరైనా ఆ ప్రాంతంలో వుండివుంటే, వాళ్ళను తప్పుదారి పట్టించటానికి శిశిర్ కావాలనే కారును దక్షిణం వైపుకు తిప్పాడు. ప్రభుత్వం తప్పనిసరి పరిస్థితులలో సుభాసును జైలునుండి విడుదల చేసినా, పోలీసులు రాత్రింబవళ్ళు సుభాసు కదలికలు అతి జాగ్రత్తగా గమనించుతూనే ఉన్నారు. సుభాసు ఇంట్లోనే పోలీసుల ఏజంట్లు ఉంటున్నట్లు ఇప్పుడు తెలిసింది. వాళ్ళెవరు అనేది ఇప్పటికీ తెలియలేదనుకొండి. కాని పోలీసుల దగ్గర తనను గురించి వివరించే పత్రం ఒకటి ఉందని సుభాసుకు తెలుసు. అంతే కాదు, దానిలో ఏముందీ కూడ సుభాసుకు తెలుసు. తనను గురించి పోలీసులకు ఏం తెలుసో, అదంతా ఎవరిద్వారా తెలుస్తూ వుందో కూడా సుభాసుకు తెలుసు. ఆయన నమ్మకస్తుల ద్వారా పోలీసు ఫైళ్ళల్లో తనను గురించి ఉన్న పత్రం తనకు వచ్చేది. సుభాసు దానిని ఒక రాత్రి జాగ్రత్తగా చదివి, మరునాటి ఉదయం దాని యధాస్థానానికి అది చేరే ఏర్పాటు చేసుకున్నాడు.

ఆ రాత్రి పిండి ఆరబోసినట్లు వెన్నెల కాస్తూ వుంది. శిశిర్ కారు గ్రాండ్ ట్రంక్ రోడ్డు మీద నడుస్తూ, ఎత్తు ఎక్కుతూ వుంది. అటువంటి ప్రయాణం ఎవరికైనా ఒళ్ళు జలదరించే అనుభవాన్ని యిస్తుంది. శిశిర్, సుభాసుల అనుభవం కూడా అలాంటిదే.

త్వరలో తెల్లవారింది. అప్పుడు వారిద్దరూ అసన్‌సోల్ పట్టణం చేరారు. కారులో పెట్రోలు నింపుకున్నారు. సూర్యుడు పైకి లేస్తున్నాడు. సమయం ఉదయం తొమ్మిదిన్నర గంటలు. తేదీ 1941 జనవరి 17న వారి కారు అసలు జన సంచారమే లేని బరారి అనే చోటుకు చేరింది. అది ధన్‌బాద్ (బీహార్)కు కొన్ని మైళ్ళ దూరంలో వుంది. అక్కడ శరత్ చంద్రుని కుమారుడైన అశోక్ కుటుంబ సహితంగా ఉంటున్నాడు.

శిశిర్ తన బాబాయిని రోడ్డు మీద అశోక్ బంగ్లాకు ఓ అరమైలు దూరంలో వదిలి, తన కారును అశోక్ బంగ్లాలోకి ఉదాసీనంగా నడిపించాడు. వెంటనే బాబాయి మారువేషంలో వస్తున్నాడని అశోక్‌కు చెప్పాడు. కొంత సేపయిన తరువాత సుభాసు అక్కడికి ఒంటరిగా చేరాడు.

వ్యాపారం కోసం వచ్చిన ఇన్సూరెన్సు ఏజంటుగా తనను తనే పరిచయం చేసుకున్నాడు. వాళ్ళంతా అశోక్ జీతగాళ్ళు, పని మనుషులు వినేటట్లుగా ఒక దొంగ నాటకం ఆడారు. వాళ్ళ సంభాషణ అంతా ఇంగ్లీషులోనే జరిగింది. ఆ అపరిచుతునికి శిశిర్‌ను లాంఛనప్రాయంగా అశోక్ పరిచయం చేశాడు. వారితో మాట్లాడటానికి వచ్చిన వ్యక్తి కోరిక మీద అనుమతించినట్లుగా అశోక్ అపరిచత వ్యక్తిని తన అతిథుల గదిలో ఒక రోజు ఉండనిచ్చాడు.

ఆ సాయంత్రం అందరికీ కన్పించేటట్లు సుభాసు చంద్రుడు వాళ్ళకు వీడ్కోలు చెప్పాడు. వెంటనే పథకం ప్రకారం కాలి నడకన అక్కడ నుండి వెళ్ళిపోయాడు. తరువాత కొంత సేపటికి అశోక్, అశోక్ భార్య, శిశిర్, శిశిర్ కారులో బయల్దేరి, దారిలో సుభాసును ఎక్కించుకొని, గోమా రోడ్డు వెంట బయల్దేరారు. ఆ రాత్రి బాగా అర్ధరాత్రి తరువాత ఢిల్లీ-కల్కా మెయిల్ గోమా చేరింది. సుబాసు చంద్రుడు తన టిక్కట్‌ను తనే కొన్నాడు. ఓ మొదటి తరగతి పెట్టెలో ఎక్కి కూర్చున్నాడు. ఢిల్లీ-కల్కా మెయిల్ కదిలింది.

వారి పథకం ప్రకారం సుభాసు ఢిల్లీలో ఫ్రాంటియర్ మెయిల్ ఎక్కి, 1941 జనవరి 19న పెషావర్‌లో దిగాలి. మియాన్ అక్బర్‌షా పెషావర్ స్టేషన్ గేటు దాటి వస్తున్న ప్రయాణీకులలో సుభాసు కోసం చూస్తున్నాడు. వాళ్ళల్లో ప్రముఖంగా కన్పిస్తున్న ఒక ముస్లిం పెద్ద మనిషిని అక్బర్‌షా గుర్తించాడు. ఒక టాంగా ఎక్కమని ఆయన చెవిలో ఊదాడు. తను మరొక టాంగా ఎక్కేముందు, ఆ మొదటి టాంగావాలాను డీన్ హోటల్‌కు రమ్మన్నాడు. దారిలో వారి ఆలోచన మారింది. సుభాసు చంద్రుని తాజ్ మహల్ హోటల్‌కు తీసికొని వెళ్ళారు. పురాతనమైన పెషావర్ నగర ప్రాంతంలో నడుస్తూ, అక్బర్‌షా తనకు నమ్మకస్తుడైన ఒక పాత మిత్రుని కలిశాడు. ఆయన పేరు అబాద్‌ఖాన్. అక్బర్ ఆయనకు సుభాసు రహస్య ప్రయాణం గురించి చెప్పాడు. ఆయన సలహా మేరకు సుభాసు ఆయన ఇంటికి వెళ్ళి, అక్కడ ఆరు రోజులు ఉన్నాడు. సుభాసు కాబూల్‌కు బయల్దేరవలసిన సమయం ఆసన్నమౌతూంది. కాబూలు చేరటానికి గిరిజన ప్రాంతంలో కొంతదూరం నడవాలి. కాబూలు ప్రయాణం కాలంలో సుభాసుకు మార్గదర్శకులు, అంగరక్షకులు అవసరం

కాగా మహమ్మద్‌షా, భగత్‌రామ్ తల్వార్, అనే ఇద్దరు యువకులను, సుభాను వెంట ఉండటానికి ఎంచుకున్నారు. వారికి రహస్యం వెల్లడించారు. ఆఖరికి సుభానును క్షేమంగా కాబూలు చేర్చే బాధ్యత భగత్‌రామ్‌కు అప్పగించారు.

పెషావర్‌లో సుభాను మారు వేషంలో మార్పు జరిగింది. సుభాను ఒక పఠాన్‌గా మారిపోయాడు. పఠాన్ల అలవాట్లను, ఆచారాలను గురించి సుభాను, అబాద్‌ఖాన్ ఇంటి దగ్గర క్షుణ్ణంగా తెలుసుకున్నాడు. అప్పటి నుండి ఆయన నడక అచ్చంగా ఓ పఠాన్ నడకవలే ఉండాలి గదా! ఆయన అంతకు ముందు తను ధరించిన బట్టలను విడిచివేశాడు. పఠాన్ బట్టలు ధరించాడు. పఠాన్ల తలపాగాను కూడా ధరించాడు. అప్పటివరకు ఇన్సూరెన్స్ ఏజంటుగా వున్న సుభాను భగత్‌రామ్‌గారి మూగ, చెవిటి అన్న అయ్యాడు. భగత్ రామ్ ఆ అన్నను ముందుగా ఒక పుణ్య క్షేత్రానికి తీసికొని వెళ్తున్నాడు. చివరికి ఆయనను కాబూలు తీసికొని వెళ్ళి, అక్కడ వైద్యం చేయించుతానంటూ, భగత్‌రామ్ ఒక కథను అల్లాడు.

తేదీ 1941 జనవరి 26 ఉదయం. భగత్ రాం, మహమ్మద్ షా, ఒక మార్గ దర్శకుడు వెంటరాగా, సుభాను చంద్రుడు కారులో అఫ్రిడి గిరిజన ప్రాంతం సరిహద్దుకు బయల్దేరాడు. అబాద్‌ఖాను ఆ కారును ఏర్పాటు చేశాడు. ఇది ఇలా ఉండగా పథకం ప్రకారం సుభాను కలకత్తా నుండి అదృశ్యమై పోయినట్లు ఆయన కుటుంబం ఆయన అదృశ్యమైన రోజునే ప్రకటించింది.

ఆ ప్రయాణీకులు ముగ్గురూ గిరిజన ప్రాంతం సరిహద్దుకు ఒక ఫర్లాంగు దూరం నుండి మాత్రమే నడవటం ప్రారంభించారు. సుభాను చంద్రుడు అఫ్ఘనిస్థాన్ చేరటానికి ఎన్నుకున్న మార్గం చాలా దగ్గర మార్గమే కాని, అతికష్టమైనది. అది యాత్రీకులు సాంప్రదాయబద్ధంగా వాడే మార్గం కాదు. అంతకు పూర్వం విప్లవకారులు ఎంచుకున్న మార్గం కూడా అది కాదు. కాగా సుభాను, ఆయన మిత్రులు నిలువుగా వున్న పర్వతాలను ఎక్కవలసి వచ్చింది. మంచుతో కప్పబడిన పర్వత ప్రాంతాలను దాటవలసి వచ్చింది.

ఆ మార్గంలో అలాగే ముందడుగు వేస్తూ, అఫ్ఘనిస్తాన్‌లో ప్రవేశించక ముందు, ఆ యాత్రీకులు ముగ్గురూ చిన్న చిన్న గ్రామాలలో రెండు

రాత్రిళ్ళు విశ్రాంతి తీసుకున్నారు. తరువాత, జనవరి 28న, అర్ధరాత్రి దాటిన తరువాత వారు మొదట అఫ్ఘన్ గ్రామంలో ప్రవేశించారు. సుభాను చేత మిగిలిన ప్రయాణాన్ని అలసట లేకుండా పూర్తిచేయించటానికి అయనకు ఒక కంచర గాడిద యిచ్చారు. కాని ఒక పల్లంలోకి దిగుతూ ఉండగా, మంచుతో కప్పబడిన రాతినేల మీద ఆ కంచర గాడిద జారిపడింది. సుభాను చంద్రుడు కూడా పడ్డాడు. తరువాత రెండు రోజుల పాటు, ఆ వల్లెటూళ్ళ కాలి నడకల వెంట కొంత దూరం నడిచి, వాళ్ళు గార్డి అనే గ్రామం చేరారు. అది పేషావరు-కాబూల్ రహదారిలో వుంది. వాళ్ళు కాబూలులో ప్రవేశించిన తరువాత వాళ్ళ మార్గదర్శకుడు వెనక్కి వెళ్ళిపోయాడు.

అప్పుడు సుభానువెంట భగత్ రామ్ ఒక్కడే వున్నాడు. వాళ్ళకు ఒక తేయాకు పెట్టెల బండి కన్పించింది. ఇద్దరూ ఆ బండిలో ఎక్కి ఆగతుకుల రహదారి వెంట పైకి వెళ్ళి, ఆ రాత్రి 10 గంటలకు జలాలాబాద్ చేరారు. అక్కడ ఒక ముఖ్యమైన రాజకీయ కార్యకర్తతో సంబంధం ఏర్పరచుకున్నారు. ఆ కార్యకర్త పేరు హాజి మహమ్మద్ అమీన్.

1941 జనవరి 30వ తేదీన వాళ్ళిద్దరూ ఒక టాంగా ఎక్కి కాబూలుకు బయల్దేరారు. దారిలో ఒక లారీ ఎక్కి, మరుసటి ఉదయం బడ్ఖాక్ అనే పేరుగల చెక్‌పోస్టుకు చేరారు. అక్కడ నుండి టాంగాలో బయల్దేరి ఆ ఉదయం, అనగా జనవరి 31 ఉదయం పదకొండు గంటలకు కాబూలు చేరారు.

కాబూలుకు వాళ్ళిద్దరూ అపరిచితులే. ఏదైనా సత్రం దొరుకుతుందేమోనని ఆలోచించారు. అన్వేషించగా లాహోరిగేటు దగ్గర ఒకటి దొరికింది. అయితే అది మనుషులు ఉండదగినది కాదు. కాని మరొక ప్రత్యామ్నాయం లేదు. తియ్యని తేనీరులో ముంచిన రొట్టె ముక్కలు మినహా వాళ్ళకు తినటానికి మరేమీ దొరకలేదు.

సుభాను చంద్రుడు బ్రిటిష్ పోలీసుల బారి నుండి తప్పించుకున్నంత మాత్రాన ఆయన కష్టాలు అంతం కాలేదు. నిజానికి ఆయన కష్టాలు అప్పుడే ప్రారంభమయ్యాయని సుభాసు గ్రహించాడు. తరువాత 45 రోజులపాటు సుభాసు చంద్రుడు ఎంతో అలసటకు గురయ్యాడు. నివాసయోగ్యము కాని పరిసరాలు, బ్రిటిష్ ఏజంట్లో, పోలీసులో ఏదో

ఒక నిమిషంలో తనను గుర్తు పట్టేస్తారని భయం. సుభాను చంద్రుని గమ్యం ఐరోపా మధ్య ప్రాంతం. ఆయన ఉన్నది కాబూలులో. కాగా, ఆయనకూ, ఆయన గమ్యానికీ మధ్య సోవియట్ రష్యా వుంది. అప్పటికే మాస్కోలో వున్న పంజాబు కిజికిస్తాన్ పార్టీ ప్రతినిధుల ద్వారా సోవియట్ రష్యాతో సంబంధాలు ఏర్పరచుకోవటానికి సుభాసు చంద్రుడు ప్రయత్నించాడు. కనీసం సోవియట్ ప్రభుత్వంతో ఒక తాత్కాలిక ఏర్పాటును చేసుకోవాలని కాంక్షించాడు. కాని ఏమీ వాస్తవ రూపం దాల్చలేదు. అసలు ఏం జరిగిందీ ఇప్పటికీ బయటపడని రహస్యమే. కాగా సుభానుచంద్రుని ప్రయత్నాలు మళ్ళీ మొదటికి వచ్చాయి. సాధ్యమైనంత త్వరగా కాబూలు నుండి బయటపడి, బ్రిటిష్ ఏజంట్లకు దొరకకుండా ఆయన తప్పించుకు పోవలసిన అవసరం వచ్చింది.

# 27

కాబూలులో సుభాను చంద్రుడు లాహోరిగేటు సత్రంలో ఉన్నన్ని రోజులూ చెవిటి-మూగ అన్న నాటకం ఆడాడు. కాని ఒక అఫ్ఘన్ పోలీసు జవానుకు ఎందుకో అనుమానం కల్గింది, తరచుగా ఆ సత్రానికి రావటం ప్రారంభించాడు. సుభాను తన బంగారం చేతి గడియారాన్ని అతనికి యిచ్చిన తరువాత కూడా అతను యింకా ఆ సత్రానికి వస్తూనే ఉన్నాడు. ఒకనాడు ఆ క్రొత్త వాళ్ళిద్దరూ పోలీసు స్టేషన్‌కు రావటం అవసరం అన్నాడు. రష్యాతో సంబంధాలు పెట్టుకోవటానికి భగత్‌రామ్ చేసిన ప్రయత్నాలు ఏమీ ఫలించలేదు. చివరికి ఫిబ్రవరి 6వ తేదీన సుభాను చంద్రుడు జర్మనీ ప్రభుత్వం ప్రతినిధి ఇంట్లోకి అనుమతి లేకుండా, అనాహూతుడుగా, ప్రవేశించి, ఒక జర్మనీ మంత్రిని కలిశాడు. ఆ జర్మనీ మంత్రి స్నేహపూర్వకంగానే మాట్లాడాడు. కాని ఆయన తనంతట తానుగా ఏ నిర్ణయము తీసుకోలేక, బెర్లిన్ నుండి ఆదేశాలు వచ్చేవరకు ఆగమని సుభానుకు సలహా యిచ్చాడు. సీమెన్స్ కంపెనీ ప్రతినిధి ఒకరు సుభాను చంద్రునికి ఆ జర్మనీ ప్రతినిధి ఇంటికి మధ్య అటూ, ఇటూ, సమాచారం అందించే ఏర్పాటు జరిగింది.

సుభాను, భగత్‌రాం, ఇద్దరూ ఆ సత్రంలో యింకా ఉండటం అపాయకరమని భావించారు. కాగా భగత్‌రాం పెషావర్‌లో తన పూర్వ పరిచయస్తుడైన ఉత్తంచంద్ మల్‌హోత్రా జాడ తెలుసుకున్నాడు. ఉత్తంచంద్ కాబూల్‌లో వ్యాపారం చేస్తున్నాడు. ఫిబ్రవరి మధ్యలో సుభాను తన మకాంను ఉత్తంచంద్ ఇంటికి మార్చాడు. వెంటనే సుభాను ఉత్తం చంద్ ఇంట్లో ఒక గదిలో రహస్యంగా దాక్కున్నాడు. ఆ ఇంట్లో ఆయనకు స్నేహపూర్వకమైన వాతావరణం లభించింది. ఆ ఇల్లు ఆయనకు సౌఖ్యంగా వుంది. కాని కాబూలులో యింకా, యింకా ఉండటం ఆయనకు విసుగు కల్గించింది. ఒక్కొక్కప్పుడు నిస్పృహతో, సోవియట్ సరిహద్దును తనంతట తనే (పెషావరు నుండి పారిపోయివచ్చి అఫ్ఘన్-రష్యా సరిహద్దున

ఉంటున్న ఒక మనిషి సహాయంతో) దాటి సోవియట్ భూభాగంలోకి ప్రవేశించాలనుకొనేవాడు.

ఆయన ఆ విధంగా తనలోతాను చర్చించుకుంటూ ఉండగా ఒకనాడు సీమెన్స్ కార్యాలయం నుండి ఒక సందేశం వచ్చింది. అది 1941 ఫిబ్రవరి 23వ తేదీ. తనకు కావలసిన ఏర్పాట్లకోసం ఇటలీ మంత్రి అయిన ఆల్బరోట క్వారోనిని కలవమని ఆ సందేశం సారాంశం. సుభాను ఆ ఇటలీ మంత్రిని కలిశాడు. వారి సమావేశం ఒక రాత్రంతా జరిగింది. తన పోరాటపు భవిష్యత్తు స్వరూపం సుభానుకు స్పష్టంగా తెలుసు. కాగా స్వతంత్ర భారత ప్రభుత్వాల్ని ఐరోపాలో ఏర్పాటు చెయ్యాలనీ, జర్మనీ, ఇటలీలలో యుద్ధ ఖైదీలుగా వున్న భారత్ సైనికులతో భారత విముక్తి సైన్యం ఐరోపాలో ఏర్పాటు చెయ్యాలనీ సుభాను చంద్రుడు ఆ ఇటలీ మంత్రికి స్పష్టంగా చెప్పాడు. క్వారోని సుభానుకు అనుకూలమైన నివేదికనే రోమ్‌కు పంపించాడు. క్వారోని భార్య ఉత్తమ్‌చంద్ దుకాణానికి అప్పుడప్పుడు వచ్చి సమాచారం అటూ, ఇటూ, అందించే ఏర్పాటు జరిగింది.

సుభాను చంద్రుని (సోవియట్ రష్యా ద్వారా కూడా) ఐరోపాకు రప్పించటాన్ని గురించి జర్మనీ, ఇటలీ ప్రభుత్వాలు సోవియట్ ప్రభుత్వంతో సంప్రదింపులు ప్రారంభించాయి. మాస్కోలో రహస్య మంతనాలు సాగుతూ ఉండగా, సుభాను తనకు లభించిన వ్యవధిని ఆఫ్ఘనిస్థాన్‌లో పరిచయాలను పెంచుకోవటానికి ఉపయోగించుకున్నాడు. ఇండియా స్వాతంత్ర్యంకోసం ఆఫ్ఘనిస్థాన్‌లోకూడా భవిష్యత్తులో కొంతకృషి జరగాలని సుభాను ఆలోచన. సోవియట్ యూనియన్ నుండి నిర్ధీతమైన సమాధానం రావటానికి నాలుగు వారాలు పట్టింది. ఆ మూడు ప్రభుత్వాలు ఒక పథకాన్ని ఆమోదించాయి. దాని ప్రకారం సుభాను చంద్రుడు ఇటలీ దౌత్య సంబంధమైన పాస్‌పోర్టుతో కాబూలులో వున్న ఒకానొక ఇటలీ దౌత్యాధికారి అయిన ఆర్లాండో మజోటా పేరుతో సోవియట్ భూభాగంలో ప్రవేశించి, మాస్కో చేరాలి. సుభాను మాస్కోకు బయల్దేరటానికి ఒకవారం ముందు క్వారోని భార్య ఉత్తం చంద్ దుకాణానికి వచ్చి, సుభానుకు అవసరమైన సందేశాన్ని అందించింది. ఆర్లాండో మజోటా ప్యాస్‌పోర్టులో మజోటా ఫొటో స్థానంలో సుభాను ఫొటోను అతికించారు. సుభానుకు

కావలసిన దుస్తులు కుట్టించటానికి ఏర్పాట్లు జరిగాయి. చెవిటి-మూగ పఠాన్ ఇటలీ దౌత్యాధికారిగా మారటానికి సిద్ధమయ్యాడు. అది 1941 మార్చి నెల 17వ తేదీ. సుభానుచంద్రుడు ఒక ఇటలీ దౌత్యాధికారి అద్దె ఇంట్లోకి మారాడు. మరునాటి ఉదయం ఒక కారులో బయల్దేరి, ముగ్గురు జర్మనీ మనుమలు వెంటరాగా, సోవియట్ సరిహద్దు వైపుకు బయలుదేరాడు. దారిలో సుభాను హిందూ కుష్ పర్వతాల ఎత్తైన కనుమల ద్వారా కొంతదూరం ప్రయాణం చేశాడు, విశాలమైన ఆఫ్ఘన్ పచ్చిక మైదానాలను దాటాడు. దారిలో రెండు రాత్రిళ్ళు జర్మనీ వాళ్ళ ఇళ్ళల్లో ఉన్నాడు. ఆఫ్ఘనిస్థాన్ రష్యాల సరిహద్దులో వున్న ఆక్సస్ నదిని దాటారు. ఆ నది అవతలి గట్టు వెంట అదే కారులో సమర్ఖండ్ చేరుకున్నారు. సమర్ఖండ్ నుండి రైలుబండిలో మాస్కో చేరారు. మాస్కో నుండి విమానంలో బెర్లిన్ వెళ్ళారు. అప్పటికి 1941 ఏప్రిల్ నెల ప్రారంభమైంది.

సుభాను చంద్రుడు యీ విధంగా బెర్లిన్ చేరగా, సుభానును క్షేమంగా ఆఫ్ఘనిస్థాన్ చేర్చిన భగత్ రామ్ తల్వార్ అంతకు రెండు మూడు రోజులు ముందుగా, అనగా 1941 మార్చి 31న కలకత్తాలో శరత్ చంద్రుని ఇంటికి చేరాడు. (శరత్ చంద్రుని ఇల్లు ఉడ్ బర్న్ పార్క్‌లో వుంది.) భగత్ రామ్ వెంటనే శిశిర్‌ను కలిశాడు. శిశిర్ వెంటనే తనతండ్రిని తీసుకొని వచ్చాడు.

భగత్ రామ్ దగ్గర మూడు పత్రాలున్నాయి. ఒకటి శరత్ చంద్రునికి సుభాను బెంగాలీలో రాసిన వ్యక్తిగతమైన ఉత్తరం, ఒకటి రాజకీయ సిద్ధాంతవ్యాసం, మరొకటి "నా దేశస్థులకొక సందేశం" దీనిని 1941 మార్చి నెల 22న రాసినట్లు, "ఐరోపాలో ఒకానొక చోట" రాసినట్లు యిందులో వుంది. సుభాను చంద్రుడు యీ మూడు పత్రాలను తను తప్పనిసరిగా కాబూలులో మకాం వేసి ఉన్నప్పుడు రాశాడు.

మరునాటి ఉదయం భగత్‌రామ్ విక్టోరియా మెమోరియల్ గార్డెన్ దగ్గర శరత్ చంద్రుని కలిసి, పెషావరు నుండి రష్యా సరిహద్దు వరకు తను, సుభాను కలిసి ఎలా ప్రయాణం చేసింది వివరంగా చెప్పాడు. శరత్ చంద్రుడు వెంటనే భగత్ రామ్‌కు సత్య రంజన్ బక్షి అనే చిరకాలానుభవం గల కాంగ్రెసు వాదిని పరిచయం చేశాడు. సత్యరంజన్ విప్లవకారుడు, ఇండియాలో సుభాను చంద్రుని కృషిని కొనసాగించటానికి

ఎంచుకోబడిన సుభాసు ముఖ్యానుచరుడు. ఆయన సుభాసుకు మంచి నమ్మకస్థుడు. 1941 నవంబరు వరకు బోసు సోదరులు ఒకరికొకరు నిస్తంత్రి (వైర్‌లెస్) సందేశాలను పంపుకున్నారు. ఇందుకు కలకత్తాలో వున్న జపాను రాయబారి కార్యాలయం అధిపతి రహస్యంగా సహాయం చేశాడు. ఆ సందేశాలు అటూ, ఇటూ, టోక్యోద్వారా నడిచేవి.

బెర్లిన్ వెళ్ళుతూ దారిలో మాస్కోలో సుభాసుమకాం వేసినప్పుడు సుభాసు చంద్రునికీ, సోవియట్ ప్రభుత్వానికి మధ్య ఏం నడిచింది ఇప్పటికీ రహస్యంగానే ఉండిపోయింది. ఆయన తన కాబూలు సిద్ధాంత వ్యాసంలో సోవియట్ యూనియన్‌ను అతిగొప్ప విప్లవశక్తిగా వర్ణించాడు. అంతకు పూర్వం భారత స్వాతంత్ర్య ఉద్యమానికి సోవియట్ సహాయాన్ని అర్థించాడు. ఆ సహాయం క్రియాశీలంగా ఉండాలని కోరాడు. అది ఇండియా వ్యవహారాలలో జోక్యం పెట్టుకోవటం వంటిదైనా ఫర్వా లేదన్నాడు.

సుభాసు చంద్రుని ఐరోపా, తూర్పు ఆసియా చైతన్యాన్ని, కదలికలను అర్థం చేసుకోవటానికి ముఖ్యంగా మూడు మౌలికమైన అంశాలను గుర్తుంచుకోవాలి. ఒకటి ఆయన సైద్ధాంతిక నిబద్ధత, రెండవది ఆ నిబద్ధత దృష్ట్యా ఆయన యుద్ధ నీతికి అనుకూలంగా ఎంచుకున్న లక్ష్యం, మూడవది నాటి అంతర్జాతీయ పరిస్థితులలో ఆయన ఎంచుకున్న లక్ష్యానికి ఆయనను చేర్చగల వ్యూహం.

సుభాసుచంద్రుని సైద్ధాంతిక నిబద్ధతలో రెండు అంశాలున్నాయి. ఒకటి సంపూర్ణ జాతీయ స్వాతంత్ర్యం, రెండవది భారతదేశంలో పూర్తిగా ఆధునికమైన సోషలిస్టు వ్యవస్థను స్థాపించటానికి అవసరమైన రాజీలేని సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటం. ఆయన సమర లక్ష్యం ఆనాడు, అనగా రెండవ ప్రపంచ యుద్ధం కాలంలో, భారత స్వాతంత్ర్యోద్యమం, బ్రిటిష్ సామ్రాజ్యవాదాల బలాబలాల శాస్త్రీయమైన, తులనాత్మక పరిశీలన మీద ఆధారపడి వుంది. ఇండియా విప్లవ పోరాటానికి సిద్ధంగా ఉండగా, మితవాదులు, అతివాదులు, కలిసివున్న ఇండియా జాతీయ నాయకత్వం, బ్రిటన్‌తో పోరాడటానికి ఆనాడు సిద్ధంగా లేదని సుభాసుచంద్రుని నమ్మకం. ఆ పరిస్థితులలో బ్రిటిష్ పాలనను ఇండియాలో కాపాడుతున్న ప్రధానశక్తి బ్రిటిష్ ఇండియా కిరాయి సైన్యానికి బ్రిటన్ యెడలకల విధేయత అని

గ్రహించాడు. నాటి అంతర్జాతీయ పరిస్థితులను అవకాశంగా తీసికొని, ఆ విధేయతను రూపుమాపటం, దాని స్థానంలో ఇండియా స్వాతంత్ర్యం యెడల విధేయతను కల్గించటం ఆయన సైనిక లక్ష్యం. అందుకు బ్రిటన్ శత్రువుల అధీనంలో వున్న భూభాగాలను, ఆ శత్రువులు యివ్వజూపే సౌకర్యాలను ఒక విప్లవకరమైన ఇండియా విముక్తి సైన్యాన్ని సమకూర్చటం కోసం వినియోగించుకోవాలని ఆయన ఆలోచన. ఆ సైన్యం ఏ విధంగానైనా అడ్డంకుల అధిగమించి, ఇండియాలోకి చొచ్చుకు పోవాలని ఆయన కోరిక.

సుభాసు చంద్రుడు జర్మనీలో ఒకవారం వున్న తరువాత జర్మనీ ప్రభుత్వానికి ఒక సమగ్రమైన మెమొరాండం యిచ్చాడు. అది నాటి ఇండియా, ఇండియా స్వాతంత్ర్యోద్యమం, రెండవ యుద్ధకాలంలో ఇండియా, జర్మనీలు సహకరించుకొనవలసిన విధానాన్ని వివరించింది. మొట్టమొదట స్వతంత్ర భారత ప్రభుత్వాన్ని ఐరోపాలో ఏర్పాటు చేయాలనీ, రెండవ ప్రపంచ యుద్ధంలో జర్మనీ, ఇటలీలు విజయం పొందితే ఇండియాకు స్వాతంత్ర్యం లభించుతుందనే హామీతో కూడిన ఒప్పందం ఒకటి.

ఆ స్వతంత్ర భారత ప్రభుత్వం, ఆ రెండు ఐరోపా దేశాల (జర్మనీ, ఇటలీ) మధ్య జరగాలనీ, సుభాసు చంద్రుడు ఆ పత్రంలో చెప్పాడు. ఇంకా ఆఫ్ఘనిస్థాన్‌లోను, ఇండియాలోను, యీ రెండు దేశాలకు మధ్యగల గిరిజన ప్రాంతాలలోను ఎటువంటి రాజకీయ కార్యకలాపాలను నిర్వహించాలో కూడా సుభాసు వివరించాడు. ఆ కార్యక్రమాల నిర్వహణకు అవసరమయ్యే ఆర్థిక వనరులను గురించి ప్రస్తావించుతూ, అవసరం మేరకు పరాయి దేశాలు యివ్వజూపే ఆర్థిక సహాయాన్ని ఇండియా అప్పుగా ఆమోదించుతుందనీ, యుద్ధానంతరం స్వతంత్ర భారత ప్రభుత్వం ఆ రుణాన్ని తీర్చివేస్తుందనీ తెలియజేశాడు.

ఒక సాయుధ బలాన్ని సమకూర్చాలని కూడ సుభాసు ప్రతిపాదించాడు. ఆ సాయుధబలం బ్రిటిష్ ఇండియా సైన్యాన్ని బ్రిటన్ మీద ఎదురు తిరగటానికి సమాయత్తం చేస్తుందనీ, తగిన కీలక సమయంలో ఇండియా ప్రజలు బ్రిటిష్ ప్రభుత్వం మీద మూకుమ్మడిగా తిరుగుబాటును లేవదీయటానికి సహాయపడుతుందనీ చెప్పాడు. ఇండియాను గురించి,

దానిని ఉద్దేశించి రేడియో ప్రసారాలను చేయటానికి సౌకర్యాలు కావాలని సుభాను ఆ పత్రంలో అడిగాడు.

ఆ పత్రం సమర్పించిన తరువాత మూడు వారాలకు ఒక అనుబంధాన్ని యిచ్చాడు. ఇండియా స్వాతంత్ర్యాన్ని గురించి జర్మనీ ప్రభుత్వం బహిరంగంగా ఒక ప్రకటనను చేస్తే, ఆ ప్రకటన ఎంత ప్రాముఖ్యాన్ని సంతరించుకుంటుందో సుభాను ఆ అనుబంధంలో వివరించాడు. కాని సుభాను యిచ్చిన మెమొరాండంకు జర్మనీ విదేశాంగశాఖ కార్యాలయం త్వరగాగాని, అనుకూలంగా గాని స్పందించలేదు. కాగా ఆయన జర్మనీలోను, తదితర ఐరోపా దేశాలలోను బహిష్కృతులుగా ఉంటున్న వారి నుండి, ఇండియా విద్యార్థుల నుండి కొందరిని ఎంచి, వారిని ఒక నూటికి నూరుపాళ్ళు చేవగల, భారత స్వాతంత్ర్య సమరపిపాసుల బృందంగా తయారు చేయుటానికి తన కాలాన్ని ఉపయోగించాడు. అదే కాలంలో ఆయన ఇటలీ, ఫ్రాన్సు, ఆస్ట్రియావంటి ఇతర ఐరోపా దేశాలలో పర్యటించాడు. ఆ పర్యటనలో స్నేహపూర్వకమైన పరిచయాలను పెంచుకోవటానికీ, గట్టి అనుచరులను సంపాదించుకోవటానికీ, సుభానుచంద్రుడు ప్రయత్నించాడు.

# 28

సుభాసు చంద్రుని బెర్లిన్ ప్రవేశం జర్మనీ ప్రభుత్వ వర్గాలలోగాని, నాజీ పార్టీ ఉన్నత శ్రేణులలోగాని తగినంత ఉత్సాహాన్ని రేకెత్తించకపోయినా, జర్మనీ విదేశాంగ శాఖ కార్యాలయంలో కొత్తగా ఏర్పాటు చేయబడిన సమాచార శాఖ సభ్యుల స్పందన వేరుగా వుంది. ఈ శాఖలో జీవనోపాధి కోసం ఉద్యోగులైన వారికి తోడుగా ఎందరో నిపుణులు ఉండేవారు. వారు బ్రిటన్, బ్రిటిష్ సామ్రాజ్యం, ఆసియా ఆగ్నేయప్రాంతం, అమెరికా సంయుక్త రాష్ట్రాల చరిత్రలను ప్రత్యేకంగా అధ్యయనం చేసినవారు. ఆ శాఖకు అధిపతి ఆదామ్‌వాన్ ట్రాట్. ఆయన ఆక్స్‌ఫర్డ్ విద్యార్థి. ఆయనకు ఇండియాను గురించి బాగా తెలుసు. ఆయన డెప్యూటీ (రెండవ హోదాలో వున్న అధికారి) అలెగ్జాండర్ వెర్త్. ఆయన ఇంగ్లండులో బారిస్టర్ పరీక్షలో ఉత్తీర్ణుడయ్యాడు. ఆయనకు భారతదేశం విషయాలలో సానుభూతితో కూడిన ఆసక్తి వుంది. ఈ సమాచార శాఖ నిపుణులిద్దరూ సుభాసు చంద్రునికి స్నేహితులయ్యారు, ఆయన ఆకాంక్షల యెడల పూర్తి సానుభూతిని ప్రకటించారు, ఆయన ఆశయానికి ఏ విధంగా సాధ్యమైతే ఆ విధంగానే మద్దతు యివ్వటానికి వారి శాయశక్తులా ప్రయత్నించారు. ఇండియా స్వాతంత్ర్య సమరాన్ని గురించి జర్మనీ ప్రభుత్వ ఉన్నతాధికారులకు వివరించటం వాళ్ళ కర్తవ్యం అయింది. అందుకు వారు సుభాసు సహాయాన్ని స్వీకరించారు. ఆ ఉన్నతాధికారులలో చాలామంది చాటుమాటుగా ఆసియా ప్రజల యెడల జాతి పక్షపాతాన్ని కలిగి ఉండేవారు. కాగా ఆ ప్రచారశాఖ అధికారులు సుభాసుకు నాజీ పార్టీ సభ్యులకు మధ్య అప్రియమైన సంబంధాలు ఏర్పడకుండా నేర్పుతో వ్యవహరించారు. సుభాసు చంద్రునికి ఇండియాలో ఆయన వ్యక్తిత్వం, ప్రతిష్ఠ, స్థాయి, యివ్వగల హోదా, స్థానాలను, సుభాసుకు జర్మనీలో లభించేటట్లు చెయ్యటం వాళ్ళ కర్తవ్యం అయింది.

1941 మధ్యనుండి ఒక కొత్త అంశం పరిస్థితిని సుభాసు చంద్రునికి

అనుకూలంగా మార్చింది. హెచ్చు సంఖ్యలో బహిష్కృతులైన భారతీయులు జర్మనీలో ప్రవేశించటం ప్రారంభించారు. మరొక వంక ఉత్తరాఫ్రికా యుద్ధరంగంలో చిక్కిన యుద్ధ ఖైదీలలో ఎక్కువమందిగా వున్న భారతీయులను జర్మనీ తన దేశానికి తీసికొని రావటం ప్రారంభించింది. ఈ భారతీయులందరూ, మౌలికంగా బ్రిటిష్ వ్యతిరేక వైఖరిని కలిగి ఉన్నారని జర్మనీ ప్రభుత్వం తెలుసుకుంది. ఐనా జర్మనీవాళ్ళు తమంతటతామే యీ అంశాన్ని తమకు అనుకూలంగా ఉపయోగించుకోవటానికి ప్రయత్నించలేదు. ఈ పరిస్థితిలో సుభాసు చంద్రుని జర్మనీ ప్రవేశం జర్మనీకి ప్రయోజనకారి అయింది.

ఆయన జర్మనీ రావటం, జర్మనీ విదేశాంగ శాఖ కార్యాలయంలో వున్న సమాచార శాఖ ఉద్యోగుల ప్రోద్బలం, జర్మనీ సైనిక నాయకులలో, జర్మనీ విదేశాంగ శాఖ ఉద్యోగులలోను ఒక నూతన అభిజ్ఞను కల్గించింది. తత్ఫలితంగా ఆ నూతన అంశం ఏ విధంగా వారికి ఉపయోగపడుతుందో వారికి బోధపడటం ప్రారంభమైంది. త్వరలో, అదే శాఖలో 'ఇండియా అధ్యయన బృందం' పేరుతో ఒక ఉపశాఖ ఏర్పడింది. ఆ బృందమే చివరకు 'ప్రత్యేక ఇండియా అధ్యయన బృందం' అయింది. వాన్‌ట్రాట్ మరియు వెర్త్‌లు దాని అధిపతులు. క్రమంగా ఆ ప్రభుత్వ శాఖలోను, జర్మనీ సైనికాధికారులలోను సుభాసు చంద్రుని స్నేహితుల సంఖ్య పెరిగింది. ఆయన సంకల్పబలం అసాధారణమైనదనీ, ఆయన చాలా విశ్వాసపాత్రుడు, చిత్త శుద్ధి కలవాడూ అనీ, వాళ్ళు గ్రహించారు. ఇంకా ఆయన జర్మనీ నాజీ పార్టీ అధినేతలమని భావించేవారి వెర్రి ఆలోచనలను ఎప్పుడూ ఆమోదించడనీ, భారతదేశం స్వాతంత్ర్యం విషయంలో ఆయన వాళ్ళకు ఎప్పుడూ లొంగడనీ, వాళ్ళతో ఎటువంటి బేరసారాలకు అంగీకరించడనీ వాళ్ళు గ్రహించారు.

ఆయన వైఖరి అంత గట్టిది. కాగా 1941 జూన్ నెలలో జర్మనీ సోవియట్ యూనియన్ మీద దండెత్తిన వెంటనే, ఇండియా దృష్టిలో జర్మనీ దురాక్రమణదారులనీ, ఇండియా దృష్టిలో సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తియైన సోవియట్ యూనియన్‌కే ఇండియా సానుభూతి లభించుతుందనీ, సుభాసు చంద్రుడు జర్మనీ విదేశాంగ శాఖకు చెప్పాడు. అప్పుడు ఆయన రోమ్ నగరంలో ఉన్నాడు.

ఆయన జర్మనీ ప్రభుత్వానికి ఒక విజ్ఞప్తిని సమర్పించుతూ, భారతదేశం స్వాతంత్ర్యం కోసం తను వేసిన పథకాలు సఫలం కావాలంటే సోవియట్ రష్యా పరోక్ష సహాయం అభిలషణీయం అని కూడ సుభాను జర్మనీకి తెలియజేశాడు.

అంతకుపూర్వం జర్మనీ, సోవియట్ యూనియన్‌లు యధాపూర్వ స్థితిలో, అనగా ఒకదానిమీద ఒకటి దండెత్తకుండా ఉంటాయనే ఊహతో, సుభాను ఇండియా సైనిక బలాన్ని సైనికంగానే దెబ్బ కొట్టటానికి కొన్ని పథకాలు వేసుకున్నాడు. అయినప్పటికీ, అప్పుడు ఏర్పడిన అననుకూల పరిస్థితిని కూడ ఉపయోగించుకొని, ఎత్తుగడల దృష్ట్యా తను తన గమ్యానికి కొంత దగ్గరగా వెళ్ళాలని అనుకున్నాడు. 1941 చివర బెర్లిన్ నగరంలో తనొక స్వతంత్ర భారత కేంద్రాన్ని ఏర్పాటు చేయగల స్థితికి చేరాడు. సమర్థులు, అంకిత భావం కలవాళ్ళు అయిన ఎ.సి.సి. నంబియార్, యన్.జి. గాన్‌పూలే, అబిద్ హసన్, యన్.జి. స్వామి, యం.ఆర్.వ్యాస్, గిరిజా ముఖర్జీవంటి వారు కొందరు ఆయన సహచర బృందంలో ఉన్నారు.

స్వతంత్ర భారతకేంద్రానికి రాయబార కార్యాలయం హోదా లభించింది. అందులో పనిచేసేవారికి సదృశమైన విశేషాధికారాలు లభించాయి. ఆ కేంద్ర కార్యకలాపాల విభజన యీ క్రింది పద్ధతిలో జరిగింది:

(i) 'అజాద్ హింద్ రేడియో', 'నేషనల్ కాంగ్రెసు రేడియో', ఇంకా 'అజాద్ ముస్లిం హింద్'ల పేర రేడియో ప్రసారాలను చేయటం;

(ii) 'అజాద్ హింద్' ద్విభాషిక పత్రికకు సంపాదకత్వం వహించి, జర్మన్, ఇంగ్లీషు భాషలలో ప్రచురించటం, దానిని ఐరోపా అంతటా పంపిణీ చేయటం; అందులో భారత రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక, తాత్విక, కళా రంగాలకు చెందిన సాధ్యమైనన్ని అంశాలమీద వ్యాసాలు ఉండేవి;

(iii) జర్మనీలో వున్న భారతీయులను సంఘటితపర్చటం, వారి యోగ క్షేమాలను గురించి పట్టించుకోవటం;

(iv) ఐరోపా దేశాలన్నింటిలోను గల స్వతంత్ర భారత కేంద్రాలన్నింటి కార్యకలాపాలను సమన్వయపర్చటం;

(v) ఉత్తర ఆఫ్రికాలో పట్టుబడిన మాజీ భారతీయ యుద్ధ ఖైదీలతో

ఏర్పాటైన స్వతంత్ర భారత సైన్యంతో సంబంధాలను నెలకొల్పి, వాటిని దృఢతరం చెయ్యటం; ఇంకా,

(vi) అక్కడ ఆగ్నేయ ఆసియా, ఇండియా స్వాతంత్ర్య సమితిని ఆధారం చేసుకొని, ఒక సమన్వయ కేంద్రాన్ని ఏర్పరచటం. 1942 ఫిబ్రవరి మధ్యలో సింగపూరు పతనం తరువాత, ఆ సమితికి ప్రత్యేకమైన ప్రాముఖ్యత లభించింది.

భారతదేశానికి స్వాతంత్ర్యం లభించిన తరువాత దానిని సాంఘికంగా, ఆర్థికంగా పునర్నిర్మించే నిమిత్తం ఆ స్వతంత్ర భారతకేంద్రం ఒక ప్రణాళికా సంఘాన్ని ఏర్పాటు చేసింది. ఆ కేంద్రం తనకోసం అంటూ ఒక చిహ్నాన్ని ఏర్పాటు చేసుకుంది. ఆ చిహ్నంలో కాంగ్రెసు త్రివర్ణ పతాకం వుంది, దానిపైన ముందుకు దూకుతున్న పులిబొమ్మ వుంది. ఆ కేంద్రం రవీంద్రుని "జనగణ మన" పాటను తన జాతీయ గీతంగా ఎంచుకుంది. అంతేకాదు, ఆధునిక భారత చరిత్రలో మొట్టమొదటిసారిగా ఆ కేంద్రం ఒక సార్వత్రికమైన సమిష్టి అభివాద పదరూపాన్ని వాడుకలో పెట్టింది. అదే 'జైహింద్!' అప్పటి నుండి సుభాను చంద్రునికి 'నేతాజీ' అనే బిరుదు సార్థకమైంది. ఈ మాటలో అనురాగం, ఆదరం, రెండూ మిళితమై వున్నాయి.

1942 ఫిబ్రవరిలో సింగపూరు పతనం అయిన వెంటనే, నేతాజీ ఇండియాకు రేడియో ప్రసారాలు చెయ్యటం ప్రారంభించాడు. ఆయన తన తొలి ప్రసారంలో తన దేశీయులను ఉద్దేశించి ఇలా అన్నాడు: "భారతదేశం విముక్తి ఘడియ ఆసన్నమైంది. తనను చాలాకాలం బంధించిన బానిసత్వపు సంకెళ్ళను ఇప్పుడు ఇండియా తిరగబడి, ఛేదించుతుంది. ఇండియా విముక్తి ద్వారా ఆసియా తరువాత ప్రపంచం అంతా మానవాళి మొత్తానికీ ముక్తి అనే మహా గొప్ప గమ్యంవైపు నడుస్తాయి."

ఇండియా సైన్యం కేవలం సేవాదళ సభ్యులతో కూడిన సైన్యం, కిరాయి సైన్యం కాదు. దేశభక్తి కల్గించిన ఉత్తేజం, భారతీయ యుద్ధ ఖైదీలకు తరగతులు నిర్వహించి, సుభాను చెప్పిన పాఠాల ప్రభావం, వారిని ఆ సైన్యంలోకి తీసుకొని వచ్చాయి. అన్ని మతాలవారు, హిందువులు, సిక్కులు, మహమ్మదీయులు, పంజాబీలు, మరాఠావారు, బెంగాలీలు, యింకా ఇతరులు ఎందరో ఆ సైన్యంలో చక్కని సమైక్యతగల

బృందాలుగా కలిసిపోయారు, వర్గ విభేదాలను, వర్ణ విభేదాలను, మత విభేదాలను మరచిపోయారు.

జర్మనీలో సంఘటితమైన ఇండియాసైన్యం ఇండియా వాయువ్య సరిహద్దు ప్రాంతంలో విప్లవాత్మకమైన పాత్రను నిర్వహించే అవకాశాన్ని సోవియట్-జర్మన్ యుద్ధం నాశనం చేసింది. అయినప్పటికి ఆ సైన్యం 1944లో ఫ్రాన్సు యుద్ధ రంగంలో ఆంగ్లో-అమెరికన్ బలాలను ఎదుర్కొని వీరోచితంగా పోరాడింది.

దూర ప్రాచ్యంలో యుద్ధం ప్రారంభమైందని ఇదివరకే చెప్పుకున్నాం. 1941 డిసెంబరులో ప్రారంభమైన యీ యుద్ధంలో జపాను సైనిక విభాగాలు అతివేగంగా, అద్భుతంగా పురోగమించాయి. తత్ఫలితంగా 1942 ఫిబ్రవరిలోనే సింగపూరు పతనమైంది. సింగపూరు పతనం తరువాత భారత స్వాతంత్ర్య సమర క్షితిజంలో ఒక నూతన ఆశారేఖ కన్పించింది. కాగా త్వరలో ప్రాచ్య దేశాలకు వచ్చి, సాయుధ బలాలతో తూర్పు నుండి ఇండియాలో ప్రవేశించటాన్ని గురించి సుభాసు ఆలోచించటం ప్రారంభించాడు. జపాను సైన్యాలు ఇండియాకు తూర్పు ద్వారం ముందున్న బర్మాలో తిష్ఠవేసి వున్నప్పుడు, 1942 మే నెలలో జర్మనీ విదేశాంగ శాఖ మంత్రికి సుభాసు చంద్రుడు యీ క్రింది మాటల్లో ఒక సందేశం పంపించాడు: "ఇండియా రాజకీయ విముక్తిని సాధించటానికి తుది దెబ్బ కొట్టవలసిన ముహూర్తం ఆసన్నమైంది. ఇందు నిమిత్తం నేను తప్పనిసరిగా ప్రాచ్య ప్రపంచంలో ఉండాలి."

జర్మనీలో సుభాసు ఆలోచనలు, కృషి ఇలా ఉండగా, 1942 ఏప్రిల్-మేలో ఇండియాకు స్వాతంత్ర్యం యివ్వటాన్ని గురించి ఏమీ తేల్చకుండా, యుద్ధ కాలపు రాజీ ప్రతిపాదనలు అంటూ క్రిప్స్‌దొర తీసుకొని వచ్చిన బ్రిటిష్ ప్రభుత్వపు ప్రతిపాదనలను మహోత్కృష్ణని స్ఫూర్తితో కాంగ్రెసు నిరాకరించింది. దీనికి తోడు, బ్రిటిష్ వాళ్ళతో అంతిమ పోరాటానికి గాంధీ ముందడుగు వేస్తున్నాడు. ఆనాడు కాంగ్రెసు ఆమోదించిన తీర్మానం మూలపు ముసాయిదాలో గాంధీజీ యీ విధంగా చెప్పాడు: "ఇండియా ప్రభుత్వపు సైన్యం సంఘం నుండి వేరుపడిన జన సమూహం. అది భారత ప్రజలకు ప్రాతినిధ్యం వహించదు. కాగా అది భారత ప్రజల సైన్యం కాదు. జపానుకు ఇండియా ప్రజలతో వైరం లేదు. ఇండియాకు

స్వాతంత్ర్యం లభించిన పిదప బహుశా జపానుతో రాయబారాలు నడవటమే స్వతంత్ర భారత ప్రభుత్వపు తొలిచర్య అవుతుంది." ఆ విధంగా భారత జాతీయ ఉద్యమంలోని రెండు ప్రధాన స్రవంతులు క్రమేణా ఒకదానికి ఒకటి చేరువై, చివరికి 1942 ఆగస్టులో ఒక బ్రహ్మాండమైన తిరుగుబాటుగా ఏకమై, 1944లో అజాద్ హింద్ ఫౌజ్ బ్రిటిష్ ఇండియా మీద చేసిన వీరోచితమైన ముట్టడిగా పరిణమించింది. కఠోరమైన చరిత్రగతిని మార్చటం మానవాతీతమైన పని.

అడాల్ఫ్ హిట్లర్‌ను మొదటిసారి, తుదిసారి కూడా 1942 మే నెల చివరలో సుభాసు చంద్రుడు కలిశాడు. ఆ సమావేశం సుభాసుకు అంత సంతృప్తి కల్గించలేదు. కాని సుభాసు ప్రాచ్య ప్రపంచానికి వెళ్ళటానికి అవసరమైన ఏర్పాట్లు చేయటానికి హిట్లర్ అంగీకరించాడు. ఆ అంగీకారమే సుభాసుకు ఆ సమావేశం వలన వాస్తవంగా కలిగిన లాభం.

సుభాసు మరొక అపాయకరమైన ప్రయాణం చేయటానికి ఒక లోప రహితమైన పథకరచనలో జర్మనీ, జపాను, నిపుణులు నిమగ్నమయ్యారు. జర్మనీ, జపాను సైనిక నిపుణుల మధ్య దీర్ఘకాలిక, అతి రహస్యమైన మంతనాలు జరిగాయి. చివరికి సుభాసు చంద్రుడు జర్మనీనుండి జపానుకు ఒక జలాంతర్గామిలో ప్రయాణం చెయ్యాలని నిర్ణయం జరిగింది.

# 29

బెర్లిన్‌లో 1943 జనవరి 26న భారత స్వాతంత్ర్య దినోత్సవం చాలా భారీ ఎత్తున జరిగింది. ఆ సభలో ప్రధానవక్త నేతాజీ. రెండు రోజుల తరువాత ఆయన ఇండియా సైన్యాన్ని ఉద్దేశించి ఉపన్యసించాడు. అదే ఆ సైన్యాన్ని ఉద్దేశించి ఆయన చేసిన ఆఖరి ఉపన్యాసం. తరువాత ఆయన ఐరోపాలో కన్పించనే లేదు. 1943 ఫిబ్రవరి 8న అబిద్ హసన్‌తో కలిసి ఆయన ఉత్తర జర్మనీ రేవు పట్టణమైన కీల్ చేరాడు. అక్కడ జర్మనీ విదేశాంగ శాఖ ఉన్నతోద్యోగి అయిన కెప్లర్, ఆయనకు ఇది వరకే తెలిసిన నంబియార్, వెర్త్‌లు సుభాసును ఆహ్వానించారు.

నేతాజీ మరొక సాహసకృత్యం చెయ్య బోతున్నాడు. ఈసారి ఆయన తనకు తెలియని ప్రపంచంలోని వెళ్ళబోతున్నాడు. ఆ సమయంలో ఆయన సోదరుడైన శరత్‌కు బెంగాలీలో ఒక హృదయ విదారకమైన ఉత్తరాన్ని రాశాడు. తనొక అతి ప్రమాదకరమైన నౌకాయానం చెయ్యబోతున్నట్లు, ఆ ప్రయాణం సుఖాంతం కాకపోవుననీ, ఆయన తన అన్నకు చెప్పాడు.తరువాత తనను అంతవరకు ఎంత ప్రేమాభిమానాలతో చూశాడో, అంతే ప్రేమాభిమానాలతో తన భార్యను, కుమార్తెను చూడమని తన అన్నను కోరాడు. వారిద్దరినీ ఐరోపాలో విడిచిపెట్టి వెళ్ళుతున్నట్లు శరత్‌కు తెలియజేశాడు.

అది 1943 ఫిబ్రవరి 9వ తేదీ, ఇంకా చీకటిగానే వుంది. ఆ చీకటిలోనే నేతాజీ, హసన్ ఇద్దరిని ఒక జలాంతర్గామి కమాండర్, మ్యూసెంబర్గ్ ఆహ్వానించాడు. వారిద్దరూ దానిలో ప్రవేశించగానే, దాని తలుపులు మూసుకుపోయాయి. వెంటనే అది సముద్ర జలాల క్రింద అదృశ్యమైపోయింది.

అది నమూనా IX రకానికి చెందిన చిన్న జలాంతర్గామి. లోపల ఊపిరి ఆడని వాతావరణం. లోపల ఎటు తిరిగినా డీజెల్ నూనె వాసనే. ఒక దారి పక్కన గల ఖాళీలో నేతాజీ పడక వుంది. తిండి కూడా డీజెల్

వానన కొడ్తూనే వుంది. అటువంటి వాతావరణంలో నేతాజీ మూడు నెలలు గడవ వలసి వచ్చింది. ఆ జలాంతర్గామి మొదట డెన్మార్క్ జలాలలో ప్రవేశించింది. తరువాత నార్వే తీరం వెంట వెళ్ళి, ఉత్తర సముద్రం ద్వారా, అట్లాంటిక్ మహా సముద్రంలో ప్రవేశించింది. దాని ప్రయాణం తొలి దశలలో దానిని ఒక జలాంతర్గాముల దళం, ఒక మందు పాతరలను ఏరివేసే వడవ కాపాడాయి. కాని అది జర్మనీ అధీనంలోగల జలాలను దాటిన తరువాత, దానికి భద్రత లేకుండా పోయింది. ఏ నిమిషంలో ఏ శత్రు నావికాదళం లేదా వైమానిక దళం దానిని నాశనం చేస్తుందో తెలియని భయంకరమైన స్థితి ఏర్పడింది. అది ప్రతి రాత్రి నీటిపైకి వచ్చి, ఉపరితలం మీద ప్రయాణంచేసి తన బ్యాటరీలను విద్యుచ్ఛక్తితో నింపుకోవాలి. రాత్రిళ్ళు నిర్ణీత మార్గంలో నీటి క్రిందనే అది ప్రయాణం చెయ్యాలి. ఈ విషయం అంతా నేతాజీకి ముందే చెప్పబడింది. ఆయనను క్షేమంగా తీసికొని వెళ్ళటానికి ఎటువంటి హామీని ఎవ్వరూ యివ్వలేదు. పైగా, ఆయన ఆ షరతులనన్నింటినీ ఏ సంకోచం లేకుండా ఆమోదించాడు.

ఆ జలాంతర్గామిలో అప్పుడప్పుడు సుభాను చంద్రుడు అతి విచారకరమైన పరిస్థితులలో బ్రతకవలసి వచ్చింది. అప్పుడు కూడ ఆయన ఒక రోజైనా విశ్రాంతి తీసుకోలేదు. ఆ జలాంతర్గామిలో ప్రవేశించిన రోజు నుండీ ప్రాచ్య దేశాలలో తను నడపవలసిన పోరాటానికి కావలసిన సైన్యాలను ఏర్పాటు చెయ్యటానికి తన దగ్గరగల పథకాలను అధ్యయనం చేస్తూనే ఉన్నాడు. ఆయన అలవాటు ప్రకారం ప్రతిపథకాన్ని సమగ్రంగా, సవివరంగా, అధ్యయనం చేశాడు. ఒకనాడు ఆయన తనకు బాగా యిష్టమైన ఝాన్సీరాణి పటాలం నిర్మాణాన్ని గురించి ఆలోచించుతూ ఉండగా, ఒక శత్రువుల సరుకుల విమానం కన్పించింది. దాని మీద దాడి చెయ్యమని ఆజ్ఞ జారీ అయింది. ఆ జలాంతర్గామిని నడిపించే యంత్రాలదగ్గర వున్న మనిషి పొరపాటు వలన, ఆ జలాంతర్గామి ఉపరితలంపైకి వచ్చింది. దానిని చూచి, శత్రువుల విమానం తన మార్గాన్ని మళ్ళించి, ఆ జలాంతర్గామి మీద దండెత్తటానికి అతి వేగంగా క్రిందికి దిగింది. ఆ జలాంతర్గామిని నీటి క్రిందకు దింపమని దాని కెప్టెన్ అరిచాడు. కాని అతని ఆజ్ఞను వెంటనే శిరసావహించటం సాధ్యం కాలేదు. ఆ జలాంతర్గామి

పూర్తిగా నాశనం కావటానికి మరికొన్ని క్షణాల కాలం చాలు. ఆ జలాంతర్గామిలో సహజంగా ప్రతివ్యక్తి భయపడ్డాడు. కాని ఒకాయన నిర్భయంగా ఉన్నాడు. చాలామంది ముఖాలలో చావు కన్పించింది. హాసన్ హృదయం క్రుంగిపోయింది. కాని నేతాజీ మరో ప్రపంచంలో ఉన్నాడు. హాసన్ నిర్లక్ష్యానికి అసమ్మతి తెలియజేస్తున్నట్లు అరుస్తూ "హాసన్! నేను ఒకే అంశాన్ని రెండుసార్లు చెప్పాను. కాని నువ్వు దానిని రాసుకోవటం లేదు," అన్నాడు సుభాసు చంద్రుడు. ఈలోగా శత్రువు విమానం ఆ జలాంతర్గామిపైన గర్జించుతూ వెళ్ళింది. అయితే ఆ జలాంతర్గామి అప్పుడే నీటిలోకి వెళ్ళింది. అయినా అది నీటిలోకి వెళ్ళేముందు ఆ విమానం దానిని ఒక కుదుపు కుదిపింది. తరువాత తన సిబ్బందిని ఉద్దేశించి మాట్లాడుతూ, ఆ ప్రసిద్ధ భారతీయ అతిథి నుండి ఆయన సహాయకుని నుండి వాళ్ళు గుణపాఠం నేర్చుకోవలసి ఉందని ఆ జలాంతర్గామి కెప్టెన్ అన్నాడు. ఏ క్షణంలోనైనా చావును కల్గించగల క్లిష్ట పరిస్థితిని ఎదుర్కొనటంలో సుభాసు చంద్రుడు ఆయన సహాయకుడు కన్పరచిన హృదయ గాంభీర్యాన్ని ఆయన మెచ్చుకున్నాడు.

శత్రువుల ఓడలను, విమానాలను ధిక్కరించుతూ, ఆ జలాంతర్గామి అట్లాంటిక్ మహా సముద్రం దాటి, గుడ్‌హోప్ అగ్రం దాటి, ఆ ఏప్రిల్ నెల మధ్యలో హిందూ మహా సముద్రంలో ప్రవేశించింది. మడగాస్కర్‌కు నైరుతివైపున సముద్ర సంబంధమైన నాలుగువందల మైళ్ళ దూరానగల మొజాంబిక్ ఛానల్‌లో ఆ జర్మనీ జలాంతర్గామి ఒక జపాను జలాంతర్గామిని కలవాలి. ఐ-29 అనే ఆ జపాను జలాంతర్గామి రావలసిన సమయానికి ఒకపూట ముందుగానే పెనాంగ్ నుండి అక్కడికి చేరింది. జ్యూచి ఇజూ దాని అధిపతి. కొన్ని గంటలసేపు ఆ ప్రాంతం అంతా తిరిగి-తిరిగి, చివరికి చీకటి పడేముందు అది ఒక చిన్న జర్మనీ జలాంతర్గామిని గుర్తుపట్టింది. ఆ రెండు జలాంతర్గాములు మరునాడు సూర్యోదయం అయ్యే వరకు వేచి యుండవలసి వచ్చింది. మరునాడు సూర్యోదయ మైనప్పుడు, సముద్రం కల్లోలంగా వుంది. ఆ పరిస్థితిలో ఆ రెండు జలాంతర్గాములు ఒకదాని దగ్గరకు మరొకటి రావటం అసాధ్యం అనిపించింది. రేడియో సంభాషణ ప్రమాదకరం. ఆ నిరాశాపూర్వక పరిస్థితిలో జర్మనీ జలాంతర్గామి నుండి ఇద్దరు పురుషులు సముద్రంలోకి

దూకి జపాను జలాంతర్గామి వైపుకు యీదారు. ఆ రెండు పడవల మధ్య చేతుల ద్వారానే సంజ్ఞలు జరిగాయి. సముద్రం శాంతించలేదు. చివరికి సముద్రంలో దూకిన ఆ జర్మనీ నావికులు యిద్దరూ ఒక రబ్బరు తెప్ప మీద ఎక్కి, ఒక జనపనార తాడు సహాయంతో వాళ్ళ జలాంతర్గామి దగ్గరకు చేరారు. ఆ తాడును గట్టిగా పట్టుకొని, ఆ రబ్బరు తెప్పమీద కూర్చుని, సుభాను చంద్రుడు, హాసన్‌లు ఎగిరిపడుతున్న సముద్రపు అలలను, పొంచి వున్న షార్క్‌లను తప్పించుకొని, ప్రతి అంగుళాన్ని అతి కష్టంతో జయించుతూ, జపాన్ జలాంతర్గామిలో ప్రవేశించారు. ఆ బదిలీ 1943లో ఏప్రిల్ 24న జరిగింది. తక్షణం బెర్లిన్‌కు ఒక రేడియో సందేశం ప్రసారం ద్వారా ఆ బదిలీ వార్త చేరింది.

అదొక చరిత్రాత్మకమైన బదిలీ. రెండవ ప్రపంచ యుద్ధం చరిత్ర పుటలన్నింటిలోనూ శత్రువుల నావికా దళాలు, వైమానిక దళాలు తిరిగే చోట, ఒక జలాంతర్గామి నుండి మరొక జలాంతర్గామిలోకి ప్రయాణీకులను బదిలీ చేసిన సంఘటన ఇదొక్కటే. బ్రిటిష్ గస్తీ దళాలు తిరుగుతున్న ప్రాంతం నుండి జపాను జలాంతర్గామి వెళ్ళిపోయిన తరువాత, ఆ ప్రయాణీకులను, సుమత్రా సముద్ర తీరానికి దూరంగా, ఒంటరిగా వున్న సబాంగ్ ద్వీపంలో దించాలని ఆజ్ఞ జారీ అయింది. ఆరోగ్య సూత్రాల ప్రకారం సబాంగ్ దీవిలో సుభాస్, హాసన్‌లను నిర్బంధంగా కొన్ని రోజులు ఉంచారు. తరువాత వారిద్దరూ విమానంలో ప్రయాణం చేసి 1943 మే నెల 13వ తేదీన టోక్యో చేరారు. వారికి ప్రఖ్యాతి చెందిన ఇంపీరియల్ హోటల్‌లో బస ఏర్పాటు చెయ్యబడింది.

తన దీర్ఘకాలిక జలాంతర్గామి ప్రయాణ కాలంలో ప్రప్రథమంగా జపాను నాయకులతో సమావేశమైనప్పుడు తను ఏం మాట్లాడాలి, ఎలా మాట్లాడాలి అనే విషయాలను గురించి సుభాను చంద్రుడు పథకాలు పూర్తి చేసుకున్నాడు. తరువాత తూర్పు ఆసియాలో వున్న, ఒక పేరూ, ఊరూ అంటూ లేని, విభిన్నమైన ఇండియా జనంనుండి సమరశీలురైన, క్రమశిక్షణగల సైనికుల సంఘటనను, బ్రిటన్‌తో ఢీ అంటే ఢీ అనగల సైన్యాన్ని నిర్మించటానికి కావలసిన పథకాలను పూర్తి చేసుకున్నాడు.

జపాను ప్రధాని టోజోను కలవటానికి ముందు నేతాజీ పూర్తిగా ఒక నెల రోజులు అందుకు కావలసిన ఆలోచనలను, సన్నాహాలను చేస్తూనే

ఉన్నాడు. ఆ సన్నాహాలలో భాగంగా, ఆయన జపాను సైనిక దళాలకు, రాజకీయ పక్షాలకు, దౌత్య వర్గాలకు, మేధావుల వర్గాలకు, చెందిన ప్రముఖులను కలిశాడు, ప్రఖ్యాతిగల ప్రజా ప్రతినిధులను కలిశాడు. పరిశ్రమలను, వ్యవసాయక క్షేత్రాలను, పాఠశాలలను, వ్యాపార కేంద్రాలను, దర్శించాడు. సుభాను చంద్రుడు 1943 జూన్ నెలలో టోజోను మొదటిసారిగా కలిశాడు. బోసు అకర్షణ టోజో మీద కూడా బాగా పనిచేసిందనటానికి నిదర్శనంగా, నేతాజీ కోర్కెలలో దాదాపు అన్నింటినీ టోజో ఆమోదించాడు. వారు రెండు సార్లు సమావేశమైన తరువాత, సుభానును టోజో జపాను పార్లమెంటుకు ఆహ్వానించి, ఆయన సమక్షంలోనే ఇండియా స్వాతంత్ర్య సమరాన్ని, ఇండియా అకాంక్షలను జపాను పూర్తిగా, బేషరుతుగా, సమర్థించుతూ వుందని రూఢి చేశాడు. ఒక విదేశీ ప్రభుత్వాధినేత రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో చేసిన ఇటువంటి ప్రకటన మరొకటి లేదు. హిట్లర్ జర్మనీ నుండి సుభాను ఇటువంటి ప్రకటనను సంపాదించలేక పోయాడు. ఆ యుద్ధ కాలంలో గాంధీగాని, ఆయన అనుచరులుగాని ఇటువంటి ప్రకటనను బ్రిటన్‌నుండిగాని, దాని మిత్ర రాజ్యాలనుండిగాని సంపాదించలేక పోయారు.

జపానులో, అడుగుపెట్టిన తరువాత, ప్రథమదశలోనే విజయం సాధించిన సుభాను తను జపానులో ఉన్నట్లు ప్రపంచానికి బయటపెట్టాడు. ఆ వార్త భారతీయులందరిలోను కుతూహలపు అలలను సృష్టించగా, శత్రు శిబిరంలో దిగ్భ్రాంతిని కల్గించింది. ఇండియా స్వాతంత్ర్యం కోసం రానున్న పోరాటానికి సంపూర్ణ, సక్రియాత్మకమైన మద్దతును అందించమని తూర్పు ఆసియాలో ఉన్న భారతీయులందరికీ ఒక ఉద్రేకపూరితమైన విజ్ఞప్తిని ఆయన రేడియోద్వారా ప్రసారం చేశాడు. ఆ సందర్భంలో ఆయన అన్న మాటలివి:

"మన దేశస్థులు, మన అక్క చెల్లెళ్ళు, సోదరులు, యీ పరిస్థితులలో వారు చేయగల్గినంత వారు చేస్తున్నారు. కాని మన శత్రువు నిర్దాక్షిణ్యమైనవాడు, నిస్పృహ చెందినవాడు, పూర్తిగా సాయుధుడు. అటువంటి క్రూరమైన శత్రువుతో పోట్లాటకు దిగినప్పుడు శాసనోల్లంఘనం ఏస్థాయిలో చేసినా; ఏ స్థాయిలో విధ్వంసకాండ చెలరేగినా లేదా విప్లవకర ఉగ్రవాదం ఎంత ప్రబలినా ప్రయోజనం ఉండదు. శత్రువు ఇప్పటికే

తన కత్తిని దూశాడు. కాగా వాడిని కత్తితోనే ఎదుర్కోవాలి. వాడితో కత్తితోనే పోరాడాలి. కాని మన దేశస్థులకు అక్కడ సాయుధ విప్లవాన్ని లేవతీయటం సాధ్యం కాదు. మన దేశాన్ని ఆక్రమించిన బ్రిటిష్ సైన్యంతో వాళ్ళకున్న ఆధునిక ఆయుధాలతో పోరాడటం మన వాళ్ళకు ఇండియాలో సాధ్యం కాదు. కాగా ఇది విదేశాలలో ఉంటున్న భారతీయులు ముఖ్యంగా తూర్పు ఆసియా భారతీయులు ఆమోదించవలసిన కర్తవ్యం..."

"ఆ ఘడియ ఆసన్నమైంది. ప్రతిదేశభక్తి గల భారతీయుడూ యుద్ధరంగంవైపు పురోగమించాలి. స్వాతంత్ర్య పిపాసులైన భారతీయుల రక్తం ప్రవహించటం ప్రారంభమైనప్పుడే, ఇండియాకు స్వాతంత్ర్యం లభిస్తుంది."

చిరకాలానుభవంగల రాస్ బిహారి బోసును వెంటబెట్టుకొని, 1943 జూలై 3వ తేదీన సుభాను సింగపూరు చేరాడు. అక్కడ వున్న ఇండియన్ జాతీయ సైన్యం ఆఫీసర్లు, ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ నాయకులు ఆయనకు బ్రహ్మాండమైన స్వాగతాన్ని ఏర్పాటు చేశారు.

# 30

నేతాజీ తూర్పు ఆసియా రావటానికి ముందు సంవత్సరం అక్కడ వున్న దేశ భక్తులైన భారతీయులు భారత స్వాతంత్ర్య ఉద్యమాన్ని నిర్మించటానికి చాలా గొప్ప ప్రయత్నాలు చేశారు. మోహన్‌సింగ్ అనే ఆయన చొరవతో ఇండియన్ నేషనల్ ఆర్మీ (I.N.A.) కూడా రూపొందింది. ఆయనకు ఇవైచి ఫ్యూజివారా శక్తివంతంగా సహాయం చేశాడు. ఫ్యూజివారా జపాను ఉన్నతోద్యోగి, ముందుకు దూసుకుపోయే శక్తిగల యువకుడు. ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్‌కు రాస్ బిహారి బోసు నాయకత్వం వహించగా ఐ.యన్.ఏ. (I.N.A.) కు మోహన్ సింగ్ నాయకత్వం వహించాడు. అయినప్పటికీ, పటిష్టమైన నాయకత్వం లేనందున ఆ నాయకులకు అంతర్జాతీయ వ్యవహారాలలో అనుభవం లేనందున, ఆ స్వాతంత్ర్యోద్యమం విఫలమైంది. కాగా నేతాజీ ఆ ప్రాంతంలో ప్రవేశించినప్పుడు, ఆ ఉద్యమం అవ్యవస్థకు లోనై వుంది. ఇండియన్ నేషనల్ ఆర్మీ (ఐ.ఎన్.ఏ.) ఉత్సాహం స్తబ్ధమైన స్థితిలో వుంది. అయినా నేతాజీ ఇండియన్ నేషనల్ ఆర్మీ (ఐ.యన్.ఏ.)ని పూర్తిగా పునర్నిర్మించటానికి, తూర్పు ఆసియాలో నిర్మాణమౌతున్న భారత స్వాతంత్ర్యోద్యమాన్ని పునర్నిర్మించి, సంఘటిత పర్చటానికి వెంటనే ముందడుగు వేశాడు. నిరంతరమైన, విసుగు విరామం ఎరుగని, వెలుగు చూపించే ప్రచారం చేశాడు. ఐ.యన్.ఏ. హిందీ/ఉర్దూ రూపమే అజాద్ హింద్ ఫౌజ్.

సింగపూర్‌లో 1943 జూలై 4న ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ సాధారణ సభ్యుల సమావేశం జరిగింది. తూర్పు ఆసియా అన్ని ప్రాంతాల నుండి ఆ లీగ్ ప్రతినిధులు ఆ సమావేశానికి హాజరయ్యారు. తన సద్భావాన్ని, స్నేహభావాన్ని, మాతృభూమి యెడల తనకు గల భక్తిని దివ్యమైన పద్ధతిలో ప్రదర్శిస్తూ, మంచి రాజనీతిజ్ఞునివలె, రాస్ బిహారిబోసు ఆ ఉద్యమం మొత్తం నాయకత్వాన్ని సుభాను చంద్రునికి అప్పగించి

వేశాడు.

ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ నూతన అధ్యక్షుడుగా ఉపన్యసిస్తూ, నేతాజీ భారతదేశంలో జరుగుతున్న వీరోచితమైన స్వాతంత్ర్యోద్యమాన్ని గురించి చెప్పాడు. ఇంకా తూర్పు ఆసియాలో వారి కర్తవ్యాలను వివరించాడు. ఆ సందర్భంలో నేతాజీ చెప్పిన కొన్ని మాటలు: "భారతదేశం స్వాతంత్ర్య సమర చరిత్రలో 1942 ఆగస్టు నెల మరువురాని మహత్తర విషయంగా మిగిలి ఉంటుంది. అప్పటివరకు సాత్వికంగా వున్న భారత ప్రజానీకం క్రియాశీలక ప్రతిఘటనకు పూనుకుంది. అదొక గొప్ప మానసిక పరివర్తన. కాగా ఇప్పుడు మన ఉద్యమం మరొక అడుగు ముందుకు వేయవలసిన సమయం ఆసన్నమైంది. ఇప్పుడు యీ సంస్థ (ఇండియా ఇండిపెండెన్స్ లీగ్) గమ్యం, లక్ష్యం కూడా బ్రిటిష్ సామ్రాజ్యవాదం మీద కత్తిగట్టటమే." నేతాజీ మాటలు, వాగ్ధాటి, ఆయన శ్రోతలనందరినీ మంత్రముగ్ధులను చేశాయి. ఆయన స్పష్టంగా, సూటిగా వారి హృదయాలను, మనస్సులను సంబోధించి మాట్లాడాడు. మామూలు మాటల్లోనే ఆయన తన విప్లవ కార్యక్రమాల అనుభవ సారాన్ని వెల్లడించాడు. ఒక విముక్తి సైన్యం, ఆ సైన్యాన్ని నడిపించవలసిన తాత్కాలిక ప్రభుత్వం లేకపోవటం భారత స్వాతంత్ర్య సమరంలో తుది పోరాటాన్ని జరపటానికి వీలు కుదరటం లేదన్నాడు. తూర్పు ఆసియాలో వున్న భారతీయులు ఆయన మాటలకు పూర్తిగా స్పందించారు. బ్రిటిష్ సామ్రాజ్యవాదులు 1942లో తమ కాళ్ళ క్రింద పడవేసి, త్రొక్కి, అవమాన పరచిన భారత జాతీయ త్రివర్ణ పతాకాన్ని తూర్పు ఆసియా భారతీయులు ఎగరవేశారు. అక్కడ భారత స్వాతంత్ర్య సమరం మళ్ళీ ప్రారంభమైంది.

ఆ పోరాటాన్ని విజయవంతం చేసేందుకు, అక్కడ వున్న భారతీయుల అర్థబలాన్ని అంగబలాన్ని, వస్తు సముదాయాన్ని, మొత్తం సమీకరించాలని నేతాజీ పిలుపు యిచ్చాడు. 1857 తరువాత ఎవ్వరూ, ఎప్పుడూ స్పందించనంత ఉదారంగా తూర్పు ఆసియా భారతీయులు సుభాసుని విజ్ఞప్తికి స్పందించారు. తరువాత జరిగిన సంఘటనలు, వలస వెళ్ళిన భారతీయుల వీరోచిత గాథకు కథా వస్తువులు. స్త్రీలు, పురుషులు; పిల్లలు, పెద్దలు; సైనికుడు, కార్మికుడు, రైతు, వ్యాపారి, ఇంకా వివిధ వృత్తులకు సంబంధించిన వారిలో ప్రతివారూ, తమ వ్యక్తిత్వాన్ని తమ

మాతృభూమి వ్యక్తిత్వంలో భాగంగా పరిగణించి, తమ మాతృభూమి విముక్తి కోసం సర్వం త్యాగం చేశారు.

1943 జూలై 5న సింగపూరు టౌన్‌హాల్‌కు ఎదురుగా వున్న విశాలమైన మైదానంలో యుద్ధ వ్యూహానికి అనుగుణంగా బారులు తీరి నిలబడిన సైనికుల విశ్వాసాన్ని సుభాను చంద్రుడు అధికారికంగా తనిఖీ చేసి, పులకించి పోయాడు. అది తను తన జీవితంలోనే "అతి గొప్పగా గర్వించదగిన రోజు" అన్నాడు. ఆ సైన్యాన్ని సంబోధించి మాట్లాడుతూ నేతాజీ చెప్పిన యీ క్రింది మాటలు ఆయన ఆలోచనకు దర్పణం పడతాయి.

'.మీ రక్తాన్ని ధారపోసి, ఆయుధాల బలంతో, మీరు స్వాతంత్ర్యాన్ని సంపాదించాలి. తరువాత, ఇండియా స్వాతంత్ర్యం సంపాదించినప్పుడు, మన స్వాతంత్ర్యాన్ని ఎల్లకాలం రక్షించగల ఒక శాశ్వత సైన్యాన్ని మీరు నిర్మించాలి. మనం మళ్ళీ ఎప్పుడూ స్వాతంత్ర్యాన్ని పోగొట్టుకోవలసిన దుస్థితిని మనకు తెచ్చిపెట్టకుండా, నిశ్చలంగా నిలబడగల, జాతీయ రక్షణ సైన్యాన్ని మనం నిర్మించుకోవాలి."

"మన రాజకీయ బానిసత్వం వలన, మనను ఉత్సాహ పరచగల, ముక్డెన్, పోర్ట్ ఆర్థర్, సెడాన్‌ల వీరగాధల వంటి గాథలు మనకు లేవు. కాగా మీ సైనిక శ్రేణులనుండే భావి భారత సర్వసైన్యాధిపతి పుట్టుకు వస్తాడు."

"అంధకారంలోనూ, వెల్తురులోనూ, దుఃఖ సమయంలోనూ ఆనంద ఘడియల్లోనూ, మీకు విజయం కల్గినప్పుడూ బాధలు ఎదురైనప్పుడు కూడా నేను మీతో ఉంటాను. నేను ఆకలి, దప్పిక, లేమి, బలవంతపు కవాతులు, మరణం తప్ప నేను మీకు యివ్వ జూప గలది ఏదీ లేదు. కాని మీరు జీవించటంలోనూ, మరణించటంలోనూ, నన్ను అనుసరించితే, నేను మిమ్ములను విజయం, స్వాతంత్ర్యాల వైపుకు నడిపించగలను."

"నా సైనిక సోదరులారా! 'ఢిల్లీకి పోదాం!', 'ఢిల్లీకి పోదాం!' అనే దానిని మీ యుద్ధ నినాదం కానివ్వండి! ఈ స్వాతంత్ర్య సమరం తరువాత మనలో ఎందరం సజీవంగా మిగులుతామో నేను చెప్పలేను. కాని మనం చివరికి గెలుస్తామని, మనలో మిగిలే సమర వీరులు బ్రిటిష్

సామ్రాజ్యానికి మరో సమాధి కానున్న లాల్‌కిల్లా లేదా పురాతన ఢిల్లీలో వున్న ఎర్రకోట దగ్గర కవాతు చేసే వరకు మన బాధ్యత పూర్తిగా నెరవేరదని నాకు తెలుసు."

తరువాత మూడు నెలలూ నేతాజీ నిరంతరం కృషి చేస్తూ, తూర్పు ఆసియా అంతటా అక్కడక్కడ స్థిరపడిన భారతీయులను మేల్కొలపటానికి విస్తృతంగా పర్యటించాడు. భారతీయులు ఎక్కడ ఉన్నా ఒకే జాతికి చెందిన వారనే భావం వారిలో కల్గించటానికి, వారికొక నూతన గుర్తింపును సంపాదించి పెట్టటానికి, తూర్పు ఆసియాలో నడుస్తున్న భారత స్వాతంత్ర్య ఉద్యమాన్ని నిర్వహించే బాధ్యతను స్వీకరించటానికి తగిన ఒక క్రమశిక్షణగల సంస్థను నెలకొల్పటానికి, నేతాజీ ఆ కాలంలో కృషి చేశాడు. ఆ సంస్థ ప్రధాన కార్యాలయం సింగపూరులో ఉండాలని ఆయన భావించాడు.

1943 అక్టోబరు 21న సింగపూరులో ఒక చారిత్రక సమావేశం జరిగింది. ఆ సమావేశంలో నేతాజీ అజాద్‌హింద్ తాత్కాలిక ప్రభుత్వం ఏర్పాటైనట్లు ప్రకటించాడు. ఆ ప్రభుత్వాన్ని తొమ్మిది రాజ్యాలు గుర్తించాయి. వాటిల్లో జపాను, జర్మనీ, ఇటలీలు కూడా ఉన్నాయి. ఇవి ఆనాటి ప్రపంచంలో ప్రముఖ రాజ్యాలు. ఆ విధంగా, రెండు శతాబ్దాలలో, మొట్టమొదటిసారిగా, భారత స్వాతంత్ర్య సమరయోధులు స్వతంత్ర రాజ్యపు హోదాను రుచి చూశారు. ఆ తాత్కాలిక ప్రభుత్వం తన మొదటి అధికార చర్యద్వారా బ్రిటన్, అమెరికాల మీద యుద్ధం ప్రకటించింది. ఇండియా భూభాగంలో ఆనాడు జరుగుతున్న యుద్ధంలో బ్రిటన్‌కు అన్ని విధాలా సహాయపడుతున్న రాజ్యం అమెరికా. అంతేగాని, ఆ తాత్కాలిక ప్రభుత్వం తన విదేశాంగ విధానాన్ని రూపొందించుకోవటంలో ఏమీ తొందర పడలేదు. అక్షరాజ్యాల యుద్ధానంతరపు విధానాలను ఆమోదించటానికి అది ఎటువంటి వాగ్దానాలను చేయలేదు. అంతేకాకుండా. స్వతంత్ర భారత శాశ్వత ప్రభుత్వం యుద్ధానంతరం భారత ప్రజల అభిలాష ప్రకారం ఏర్పాటు చేయబడుతుందని ఆ ప్రభుత్వం గంభీరంగా ప్రకటించింది. అజాద్ హింద్ ప్రభుత్వం చేసిన యీ ప్రకటన భారత స్వాతంత్ర్య సమర చరిత్రలో ఒక మరుపురాని పత్రం. దానిని ఒకే ఒక రాత్రంతా కూర్చుని, మధ్య మధ్య కాఫీ త్రాగుతూ, నేతాజీయే రాశాడు. ఆ ప్రభుత్వం ఏర్పడినట్లు

ప్రకటించిన తరువాత, ఆ రాజ్యాధిపతిగా, ప్రధాన మంత్రిగా కూడ నేతాజీ ప్రమాణస్వీకారం చేశాడు. ఆ క్షణం ఎంత ఉద్రేకపూరితమైనదంటే, అప్పుడు నేతాజీ నోటివెంట మాట పెగలలేదు, ఆయన కన్నీటి బిందువులు ఆయన చెంపల వెంట క్రిందికి జారాయి.

1943 అక్టోబరు 22న లాంఛనప్రాయంగా 'అజాద్ హింద్ ఫౌజ్'లో ఒక విభాగమైన ఝాన్సీ రాణీ దళాన్ని ప్రారంభించాడు. ఇది మహిళా సైనిక దళం. పురుషులతోపాటు స్త్రీలకు కూడా అన్ని రంగాలలోనూ రాణించటానికి అవకాశాలు యివ్వాలని బోసు విశ్వాసం. ఈ మహిళా సైనిక దళ నిర్మాణం ఆయన విశ్వాసానికి యదార్థ రూపం.

1943 నవంబరులో నేతాజీ విశాల తూర్పు ఆసియా జాతుల ప్రతినిధుల సభకు హాజరయ్యాడు. ఆ సభ టోక్యోలో జరిగింది. అదొక అంతర్జాతీయ సభ. ఇండియా అప్పటికి ఇంకా స్వాతంత్ర్యాన్ని సంపాదించలేదు. పైగా ఆ సభలో పాల్గొనే దేశాలు ముఖ్యంగా జపాను, దాని మిత్ర దేశాలు. అవన్నీ ఒకరినొకరు సహాయపడుతూ, ముందుకు వెళ్ళాలనే ఆలోచనలో ఉన్నాయి. ఆ ఆలోచనలు గల ప్రతినిధుల సభలో మాట్లాడి, తదుపరి రానున్న స్వతంత్ర భారత ప్రభుత్వం తరఫున, తూర్పు ఆసియా దేశాల యుద్ధానంతరపు పథకాల అమలు విషయంలో వాగ్దానాలు చేయటం నేతాజీకి ఇష్టం లేదు. అందువలన ఆయన ఆ సభకు కేవలం ఒక పరిశీలకుడుగా హాజరయ్యాడు.

అయినప్పటికి తన వ్యక్తిత్వం బలం వలన, స్వతంత్రంగా ఆలోచించే శక్తి వలన, నిజాయితీ, వాక్పటిమల వలన, నేతాజీ ఆ సభలో ఆ ప్రతినిధులనందరికంటె ప్రముఖుడుగా రాణించాడు. ఆ సభలో ఆయన చేసిన ఉపన్యాసం చరిత్రాత్మకమైనది. పాలితులైన జాతుల దృష్ట్యా నాటి అంతర్జాతీయ పరిస్థితులను సమీక్షించాడు. న్యాయం, జాతీయ సార్వభౌమత్వం, అంతర్జాతీయ సంబంధాలలో పరస్పరం యిచ్చిపుచ్చుకొనే పద్ధతి, పరస్పర సహకార విధానాల మీద ఆధారపడే ఒక నూతన ప్రపంచ వ్యవస్థకోసం పిలుపు యిచ్చాడు. ఆ సభ ముగిసే ముందు, భారత స్వాతంత్ర్య సమరానికి సానుభూతి, సహాయాలను అందించటానికి అంగీకరిస్తూ తీర్మానించింది. ఆ తీర్మానాన్ని ప్రతిపాదించినది బర్మా ప్రతినిధియైన బామా. చివరికి జపాను ప్రధాని టోజో ఒక ప్రకటన

చేస్తూ, అప్పటి వరకు జపాను ఆక్రమణలో వున్న అండమాన్, నికోబార్ దీవుల పాలనను తాత్కాలిక అజాద్ హింద్ ప్రభుత్వానికి జపాను బదిలీ చేస్తుందని ప్రకటించాడు.

టోక్యో నుండి సింగపూరు తిరిగి వచ్చే ముందు నేతాజీ చైనా, ఫిలిప్పైన్ దీవులు, ఇండోనేషియాలలో పర్యటించాడు. ప్రతిచోటా ఓ ప్రభుత్వం అధినేతకు లభించవలసిన గౌరవం నేతాజీకి లభించింది. చైనాలో సన్‌యెట్‌సేన్ సమాధిని సందర్శించాడు. అది నాన్‌కింగ్ దగ్గర వుంది. సన్‌యెట్ సేన్ చైనా విప్లవానికి తండ్రి. సుభాసు చంద్రుడు ఆయనకు శ్రద్ధాంజలి ఘటించాడు.

# 31

1943 డిసెంబరు 29న తాత్కాలిక అజాద్ హింద్ ప్రభుత్వపు మొదటి భూభాగమైన అండమాన్ దీవులపైన లాంఛనంగా అధికారాన్ని స్వీకరించటానికి నేతాజీ అండమాన్ దీవులకు వెళ్ళాడు. ఆయన రాక సందర్భంలో అక్కడ జింఖానా మైదానంలో గొప్ప బహిరంగ సభ జరిగింది. వేలాది మంది హాజరైన ఆ సభలో ప్రభుత్వ అధినేతగా నేతాజీ మన జాతీయ త్రివర్ణ పతాకాన్ని ఆవిష్కరించాడు. అండమాన్ దీవుల విముక్తిని ఫ్రెంచి విప్లవకాలంలో సంభవించిన బాస్టిలికోట (పారిస్) పతనానికి పోల్చాడు. వందలాది భారత స్వాతంత్ర్య సమరయోధులను నిర్బంధించి, అపఖ్యాతిపాలైన సెల్యులర్ జైలును దర్శించాడు. నేతాజీ, ఆయన బృందం ఆ దీవులలో ఉన్న రోజులలో రాస్ ద్వీపంలోగల ఒక ప్రఖ్యాత భవనంలో మకాం చేశారు. ఆ భవనం అంతకు ముందు బ్రిటిష్ చీఫ్ కమిషనర్ ఇల్లు. ఆ భవనం మీద మన త్రివర్ణ పతాకం అతి గర్వంగా రెపరెపలాడింది. అండమాన్ దీవులను షాహిద్ దీవులు, నికోబార్ దీవులను స్వరాజ్ దీవులుగా నేతాజీ పేర్లు మార్చాడు.

అజాద్ హింద్ ఫౌజ్ చేత ఇండియా సరిహద్దువైపు ముందడుగు వేయించే నిమిత్తం నేతాజీ 1944 జనవరి మొదటివారంలో తన ప్రధాన కార్యాలయాన్ని సింగపూరునుండి రంగూన్‌కు మార్చాడు. 1944 ఫిబ్రవరిలో ఆ సైన్యం మొదటిసారిగా అరకాన్ యుద్ధ రంగంలో తుపాకిని పేల్చింది. చిటగాంగ్ పట్టణం వైపుకు పురోగమించటానికి అరకాన్ రంగంలో జరిపిన పోరాటాల్లో ఆ సైన్యం తన ఆధిక్యతను రుజువు చేసుకుంది. ఇది నేతాజీకి, ఆయన సైనిక సోదరులకు ఎంతో ప్రోత్సాహాన్ని కలుగజేసింది. ఐ.యన్.ఏ. పోరాట పటిమను గురించి జపాన్ సైనికాధికారులకు విశ్వాసం కలిగింది.

ఐ.యన్.ఏ. 1944 మార్చిలో ఇంఫాల్ మీద దాడి చేసింది. తూర్పు ఆసియా యుద్ధంలో శత్రువు మీద తల పడటానికి మనవాళ్ళు వేసిన

ఆఖరి ముందడుగు ఇదే. ఈ చర్యలో యం.జడ్. కియాని ఆధిపత్యంలో ఐ.యన్.ఏ. ప్రధమ విభాగం, బర్మాలో మకాం వేసి వున్న మూడు జపాను సైనిక విభాగాలు పాల్గొన్నాయి. ఆ సైనిక చర్య బర్మాలో తమ స్థావరాలను రక్షించుకునేందుకు జపాను విభాగాలు వేసిన ముందడుగు కాగా, అది భావిభారత విముక్తి యుద్ధ నిర్వహణ నిమిత్తం ఒక స్థావరాన్ని ఏర్పరచుకోవటానికీ, బ్రహ్మపుత్ర లోయకు తూర్పు ద్వారాన్ని ఏర్పాటు చెయ్యటానికీ, నేతాజీ, అజాద్‌హింద్ ఫౌజులు నిర్వహించిన విప్లవాత్మక స్వగృహ ప్రవేశం. నేతాజీ 1944 మార్చి 21న తన సైన్యాగ్రస్థానంలో పత్రికా విలేకరులను ఆహ్వానించి, అజాద్ హింద్ ఫౌజ్ జపాను సైన్యంతో భుజం, భుజం కలిపి, పోరాడుతూ, ఇండియా హద్దుల లోపలికి మార్చి 18న ప్రవేశించినట్లూ, ఇండియా భూభాగంలో యుద్ధం జరుగుతున్నట్లూ ప్రకటించాడు.

అజాద్ హింద్ - జపాను సైన్యాలు వేగంగా ఇండియా లోపలికి చొచ్చుకుపోయాయి. అది చాలా విశాలమైన రణరంగం. అందులో ముందుకుపోతూ, ఏప్రిల్ మొదటి వారంలో ఆ సైన్యాలు ఉత్తరాన గల కోహిమాలో ప్రవేశించాయి. ఆ నెల ఆఖరి వారంలో ఇంఫాల్‌కు 10 మైళ్ళ దగ్గర శత్రు సైన్యాలను చుట్టు ముట్టారు. ఆ ప్రాంతం దుర్గమంగా వుంది. అయినా అజాద్ హింద్ సైనికులు పురోగమిస్తూనే వున్నారు. అప్పుడొక రోజున ఆనాటి కార్యక్రమంలో భాగంగా నేతాజీ అజాద్ హింద్ ఫౌజుకు జారీ చేసిన ఆజ్ఞ ఆ ఇండియా ఈశాన్యపు కొండల్లో, లోయల్లో ప్రతిధ్వనించింది. అందులో ఇలా ఉంది:

"అదిగో! అదిగో ఆ నది అవతల, ఆ కొండల చాటున మనకు ఆనందం కల్గించే మన మాతృ భూమి ఉంది. అక్కడే మనం జన్మించాం. అక్కడికే మనం ఇప్పుడు తిరిగి వెళ్ళుతాం. ధర్మ రక్షణార్ధం రక్తాన్ని ప్రవహించనివ్వండి! పైపైకి పదండి! కాలం వృధా చెయ్యటానికి మనకు అవకాశం లేదు. లేవండి! ఆయుధాలను ధరించండి! అదిగో! మీ మార్గదర్శకులు నిర్మించిన మార్గం మీ ముందే వుంది! మనం ఆ మార్గాన్నే ముందడుగు వేద్దాం. శత్రు సైన్యాల శ్రేణుల గుండా మనం మన మార్గాన్ని వేసుకుందాం. లేదా దైవం అనుగ్రహిస్తే, మన ప్రాణాలను సమర్పించి స్వాతంత్ర్య సమరయోధులం, వీరులం, అవుదాం. మన ఆఖరి మజిలీలో

మనకు ఢిల్లీకి తీసికొనిపోయే మార్గాన్ని ముద్దు పెట్టుకుందాం! ఢిల్లీ మార్గమే స్వాతంత్ర్యానికి మార్గం! ఢిల్లీ పదండి! ఛలో ఢిల్లీ!"

ఏప్రిల్ మొదటివారంలో నేతాజీ తన మంత్రివర్గంలో సభ్యుడైన ఏ.సి. ఛటర్జీని, విముక్తి పొందిన ప్రాంతాలకు గవర్నరుగా నియమించాడు. అదే సమయంలో అజాద్ హింద్ దళం (తాత్కాలిక ప్రభుత్వం పరిపాలనా విభాగం) సైనికులతో పాటు ముందుకు వెళ్ళి, విముక్తి పొందిన ప్రాంతాల పరిపాలనా బాధ్యతలను స్వీకరించటానికి సిద్ధంగా వుంది. తమ సైనిక దళాలు వశం చేసుకున్న ఇండియా ప్రాంతాలను నేతాజీ అధిపత్యంలో వున్న తాత్కాలిక ప్రభుత్వానికి జపాను బదిలీ చేస్తుందని అప్పటికే జపాను ప్రధాన మంత్రి ప్రకటించి ఉన్నాడు.

కాని అప్పుడు రావలసిన సమయం కంటె ముందే వర్ష ఋతువు ప్రారంభమైంది. అజాద్-హింద్, జపాను దళాలకు వైమానిక దళాల దాడుల నుండి రక్షణ మృగ్యమైంది. వారికి ఆహార పదార్థాలు చాలా దూరం నుండి రావలసిన పరిస్థితి ఏర్పడింది. ఆహార పదార్థాల రవాణా మార్గాలకు రక్షణ కరువైంది. ఆంగ్లో-అమెరికన్ వైమానిక దళాలకు గగన పథంలో ఆటంకం లేకుండా పోయింది. కాగా ఆంగ్లో-అమెరికన్ సైన్యం ఇంఫాల్ రక్షణ కోసం చివరి యుద్ధం చెయ్యటానికి అదనపు బలాలను దింపింది. అయినా, అజాద్-హింద్, జపాను దళాలు సాధ్యమైనంత కాలం తమ స్థావరాలను రక్షించుకున్నాయి. కాని చివరికి అవి తిరోగమించటం తప్పనిసరి అయింది. చింద్విన్, ఇరావ్వే నదులవెంట తిరోగమిస్తూ ఆ దళాలు ఎన్నో నష్టాలకు గురైయ్యాయి. ఎందరో సైనికులను పోగొట్టుకున్నాయి. ఆంగ్లో-అమెరికన్ దళాలు బర్మాను తిరిగి ఆక్రమించుకోవటానికి ఎదురుదాడులు చెయ్యటం ప్రారంభించాయి. తత్ఫలితంగా అజాద్హింద్, జపాను దళాల ఢిల్లీ యుద్ధ యాత్రకు ఆటంకం కల్గింది.

అప్పుడు తిరోగమించిన అజాద్ హింద్, జపాను దళాలు, తమ తిరోగమన దశలో ఎక్కువ నష్టాలు పొందకుండా ఉండేందుకు, తమ వెనుక భాగాల, రక్షణ పోరాటాలలో వీరోచితంగా పోరాడాయి. ఆ యుద్ధ రంగంలో వున్న సైనికులతో నేతాజీ దగ్గర సంబంధాలను పెట్టుకొని ఉన్నాడు. అసలు ఆయన కూడ దిగ్బంధానికి గురియై పోవటమో లేక

యుద్ధంలో చనిపోవటమో జరగవచ్చునని భయపడిన సమయాలు కూడా ఉన్నాయి.

ఆ పరిస్థితులలో 1944 జూలై 6వ తేదీన నేతాజీ రంగూన్ రేడియో ద్వారా మహాత్మునికి ఒక విజ్ఞప్తి చేశాడు. నేతాజీ ఆ ప్రసారంలో సమకాలిక భారత స్వాతంత్ర్య సమర చరిత్ర పుట్టు పూర్వోత్తరాలను గురించి చెప్పుతూ, అందులో మహాత్ముని పాత్రను గురించి నొక్కి చెప్పాడు. తరువాత నాటి అంతర్జాతీయ పరిస్థితులను విశ్లేషించుతూ, ఆ పరిస్థితులలో బ్రిటిష్ సామ్రాజ్యవాదులు ఇండియా విషయంలో అవలంబించదలచిన విధానాలను గురించి తన అభిప్రాయాలను తెలియచేస్తూ గాంధీజీతో "స్వాతంత్ర్యం కావాలనే ఇండియా కోరికను బ్రిటిష్ ప్రభుత్వం ఎప్పటికీ గుర్తించదని నేను నిజంగా నమ్ముతున్నాను" అన్నాడు. పైగా, ప్రపంచానికి ఆధిపత్యం వహించాలనీ, అమెరికా శతాబ్దాన్ని సృష్టించటానికీ, అమెరికా యుద్ధంలో చేరిందని చెప్పాడు. కాబట్టి, "మనం నిజంగా స్వాతంత్ర్యం కావాలనుకుంటే, మనం రక్తపుమడుగుల ద్వారా ముందడుగు వెయ్యటానికి సిద్ధపడాలి" అని ఉద్ఘాటించాడు.

తరువాత, తను 1940లో ఇండియా నుండి తప్పించుకొని వెళ్ళిన రోజునుండి తను చేసిన పనులను తార్కికంగా సమర్థించుకున్నాడు. "మన జీవితకాలంలో స్వాతంత్ర్యం సంపాదించటానికి మరొక అవకాశం వస్తుందనే ఆశ నాకు ఉండి ఉంటే, బహుశా నేను ఇంటి నుండి బయటకు వెళ్ళి ఉండే వాడిని కాదు." అని మహాత్మునికి వివరించాడు. ఇంకా "నేను ఏం చేసినా, అది నాదేశం ప్రయోజనం కోసం, ప్రపంచంలో ఇండియా ప్రతిష్ఠను పెంపొందించటం కోసం, ఇండియా స్వాతంత్ర్య సమర పోరాటాన్ని ముందుకు తీసుకొని పోవటం కోసం చేశాను" అని ఘంటాపథంగా చెప్పాడు. నేతాజీ తన సందేశాన్ని ముగించుతూ, మహాత్ముణ్ణి యీ క్రింది విధంగా ప్రార్థించాడు: "భారతదేశపు తుది స్వాతంత్ర్య సమరం ప్రారంభమైంది. అజాద్ హింద్ ఫౌజ్ సైనికులు ఇప్పుడు భారత భూభాగంమీద ధైర్యంగా పోరాడుతున్నారు. ఆఖరి బ్రిటిష్‌వాడు ఇండియా నుండి తరిమివేయబడే వరకూ, న్యూఢిల్లీలోని వైస్‌రాయ్ భవనం మీద మన జాతీయ త్రివర్ణ పతాకం రెప, రెపలాడే వరకూ, యీ సాయుధ సమరం కొనసాగుతూనే ఉంటుంది... జాతి పిత

అయిన మహాత్మాగాంధీజీ! భారతదేశం విముక్తి కోసం జరుగుతున్న యీ పవిత్ర యుద్ధంలో ఇండియా జయించాలని మీరు, ఆశీర్వదించండి! ఈ స్వాతంత్ర్య సమర వీరులకు మీ శుభాకాంక్షలను తెలియజేయండి!"

తన ప్రభుత్వంలో మార్పులు జరిగిన పిదప, 1944 అక్టోబరులో టోక్యో సంప్రదింపుల నిమిత్తం నేతాజీని ఆహ్వానించింది. జపాను ప్రభుత్వం తమ దేశం విదేశపు ఉన్నతాధికారులకు సాంప్రదాయకంగా యిచ్చే పతకాలలో అత్యుత్తమ పతకాన్ని నేతాజీకి యివ్వజూపింది. ఇండియాకు విముక్తి లభించేవరకు ఎటువంటి పతకాలను ఆమోదించ జాలనని అంటూ, నేతాజీ ఆ పతకాన్ని స్వీకరించటానికి నిరాకరించాడు. ఆ సమయంలో నేతాజీ టోక్యోలోని సోవియట్ రాయబారికి ఒక ఉత్తరం పంపాడు. కాని ఉత్తరంగల కవరు తెరవబడకుండానే తిరిగివచ్చింది. అప్పుడు ఇండియా-జపానుల మధ్య అప్పు ఒడంబడిక ఒకటి జరిగింది. దాంట్లో ఇండియాకు అననుకూలమైన నిబంధనలు ఏమీ లేవు. ఇండియా అప్పును తిరిగి పూర్తిగా తీర్చుతుందనే హామీ మాత్రం వుంది. బెర్లిన్‌లో స్వతంత్ర భారత కేంద్రం నిర్వహణ నిమిత్తం చేసిన అప్పును ఒకే మొత్తంగా సుభాసు చంద్రుడు తూర్పు ఆసియా నుండి జర్మనీకి పంపించాడన్న విషయం యీ సందర్భంలో గమనార్హం. అజాద్ హింద్ ఫౌజ్ సైనికులకు కొన్ని సౌకర్యాలు కల్గించినందుకు నేతాజీ థాయిలాండ్ ప్రభుత్వానికి భూరి విరాళాన్ని యిచ్చిన విషయం కూడ యిక్కడ చెప్పాలి.

1944 నవంబరులో నేతాజీ తిరిగి రంగూన్ వచ్చేటప్పటికి యుద్ధ పరిస్థితి నేతాజీకి అననుకూలంగా పరిణమించటం ప్రారంభమైంది. శత్రు విమానాలు నిర్విరామంగా బాంబుల వర్షాన్ని కురిపిస్తున్నాయి. అన్ని యుద్ధ రంగాలలోనూ బ్రిటిష్ పదాతి దళాలు ముందుకు చొచ్చుకు వస్తున్నాయి.

అయినా రంగూన్‌లో భారతీయులు 1945 జనవరిలో సుభాసు చంద్రుని జన్మ దినోత్సవాన్ని ఘనంగా జరిపారు. ఆయనయందు వారికి గల విశ్వాసాన్ని పునరుద్ఘాటించటానికి బ్రహ్మాండమైన సభను ఏర్పాటుచేసి, ఆ సభలో నేతాజీకి బంగారపు ముద్దలను, ఆభరణాలు, భారత స్వాతంత్ర్య సమరాన్ని కొనసాగించేందుకు విరాళాలుగా యిచ్చారు. తరువాత వెంటనే నేతాజీ యుద్ధరంగానికి వెళ్ళాడు. ఇరాడ్వేనది దగ్గర కియాని ఆధిపత్యంలో

వున్న ఐ.యన్.ఏ. మొదటి డివిజన్ ప్రమాదంలో యిరుక్కుందని తెలుసుకున్నాడు. సైనికులను, వాళ్ళకోసం చేసిన సౌకర్యాలను తనిఖీచేస్తూ, నేతాజీ రోజుకి 20 గంటల కాలం పని చెయ్యటం ప్రారంభించాడు. కాని అలసిపోయిన ఆయన సహాయకులు అదే కాలంలో ముగ్గురు మారేవారు. కొందరు ఐ.యన్.ఏ. ఆఫీసర్లు, సైనికులు యుద్ధ రంగాన్ని వదిలి వెళ్ళిపోయినట్లు విన్న వెంటనే, నేతాజీ వాళ్ళ హోదాలతో నిమిత్తం లేకుండా, వాళ్ళను కాల్చి వేయమని ఆజ్ఞాపించాడు.

బ్రిటిష్ సైన్యం తాకిడికి తట్టుకొనలేక, రంగూన్ పట్టణాన్ని ఖాళీ చెయ్యటం తప్పనిసరిగా కన్పించినప్పుడు, రంగూన్‌ను ఖాళీ చేయటంలో తమతో సహాకరించమని జపాను సైనిక నాయకత్వం సుభాసును కోరింది. ఝాన్సీరాణి మహిళా సైనిక దళం రంగూన్ నుండి వెళ్ళిపోయే వరకు మరొక సైనిక దళం ఏదీ రంగూన్ నుండి వెళ్ళకూడదని నేతాజీ పట్టుబట్టాడు. జపాను అధికారులు నేతాజీ మాటను గౌరవించారు.

తరువాత నేతాజీ తన వ్యక్తిగత సిబ్బంది ఝాన్సీరాణి మహిళా సైనిక దళం వెంటరాగా, రంగూన్‌ను వదిలి బ్యాంకాక్‌వైపుకు వెళ్ళాడు. ఆ మార్గం చాలా ఇబ్బందికరంగా వుంది, రోడ్లు వానలవలన, వరదల వలన పూర్తిగా చెడిపోయాయి. ఆ దారిలో ఎక్కడబడితే అక్కడ యుద్ధ రంగంనుండి పారిపోయిన సైనికులు, గెరిల్లాలు, కన్పించేవారు. నేతాజీ వెంటవున్న రక్షక దళం వాహనాలు ఒకదాని తరువాత ఒకటి చెడిపోవటం ప్రారంభించాయి. కాగా ఆయన మహిళా సైనికులను, తన వ్యక్తిగత సిబ్బందిని వెంటబెట్టుకొని ఎన్నోమైళ్ళ దూరం కాలి నడకను పోవలసి వచ్చేది. ఆయన రంగూన్-బ్యాంకాక్ యాత్ర ఎంతో చరిత్రాత్మకమైనది. మొక్కవోని ధైర్యంతో నేతాజీ ఆ యాత్రను నిర్వహించటం చూచినవారు, దారుణమైన విపత్కర పరిస్థితులలో కూడా ఆయన ప్రదర్శించిన సహనశక్తికి, లొంగుబాటుతనం ఎరుగని ధైర్యానికి, నాయకత్వపు లక్షణాలకు అతిగాఢంగా ప్రభావితులయ్యారు.

# 32

రంగూన్‌నుండి తిరిగి వెళ్ళిపోతున్న నేతాజీ సైనికుల శ్రేణి (ఝాన్సీ రాణీ మహిళా సైనికులు, ఆయన సిబ్బంది) ఒక నెలలో బ్యాంకాక్ చేరింది. బర్మా భారతీయులకు యిచ్చిన వీడ్కోలు సందేశంలో నేతాజీ యిట్లా చెప్పాడు:

"మన స్వాతంత్ర్య సమరంలో మొదటి పోరాటంలో మనం ఓడిపోయాం. మనం యింకా ఎన్నో పర్యాయాలు పోరాడవలసి వుంది.

భారత స్వాతంత్ర్య సమర చరిత్ర తుది పోరాట భాగంలో బర్మా భారతీయులకు గౌరవనీయమైన స్థానం లభిస్తుంది."

"ఇండియా విముక్తికోసం పోరాటాన్ని కొనసాగించటానికే నేను బర్మాను విడిచి వెళ్ళుతున్నాను. ఇండియాకు త్వరలో విముక్తి లభించుతుందనే విషయంలో నాకు గల విశ్వాసం అచంచలమైనది."

అదే రోజున నేతాజీ జారీ చేసిన సైనిక ఆజ్ఞలో ఆయన యిలా చెప్పాడు: "ఈ క్లిష్ట సమయంలో నేను చెప్పేది ఒకే ఒక మాట. మీరు తాత్కాలికంగా ఒరిగిపోవలసి వస్తే, మన జాతీయ త్రివర్ణ పతాకాన్ని రెపరెపలాడిస్తూ ఒరిగి పొండి! స్వాతంత్ర్య సమరవీరులుగా ఒరిగిపొండి! అత్యంత ప్రశంసనీయమైన గౌరవం, క్రమ శిక్షణ నియమావళిని కాపాడుతూ ఒరిగిపొండి! మీ బ్రహ్మాండమైన త్యాగాల ఫలితంగా, బానిసలుగా కాక స్వాతంత్ర్య పౌరులుగా జన్మించే భావిభారత తరాల పౌరులు, మీ పేర్లను గుర్తుంచుకుంటారు. ఆశీర్వదిస్తారు, ఇంతేకాదు. వాళ్ళ తాతలు, ముత్తాతలు అయిన మీరు, మణిపూర్, అస్సాం, బర్మా యుద్ధ రంగాలలో ఎన్నో కష్టనష్టాలకు లోనై, పరాజయాలు పొంది, తాత్కాలికంగా ఓడిపోయి, అంతిమ విజయానికి, ఘనతకు మార్గాన్ని నిర్మించారని వాళ్ళు సగర్వంగా నగారా మ్రోగించి మరీ ప్రకటిస్తారు."

మరో పర్యాయం తూర్పు ఆసియాలో బ్రిటిష్ సైన్యాలను ఢీకొనాలనే ఆలోచన నేతాజీకి ఉంది. కాగా ఆయన సింగపూరులో వున్న తన పాత ప్రధాన కార్యాలయానికి చేరగానే, చెల్లాచెదురైన తన

సైనికులను తిరిగి సంఘటితపరచటం, సాధారణ పౌరులకు ధైర్యం చెప్పటం, మలయా ద్వీపకల్పంలో మరో యుద్ధానికి తన పరిపాలక, సైనిక విభాగాలను రెండింటినీ సమాయత్తం చెయ్యటం ప్రారంభించాడు. అదే సమయంలో నేతాజీ భారత దేశ పౌరులను, నాయకులను సంబోధించి ఎన్నో రేడియో ప్రసారాలు చేశాడు. బ్రిటన్‌తో రాజీ పడవద్దని, వేవెల్ మైత్రి భాషణలకు లొంగవద్దని, ఇండియాను ముక్కలు చెయ్యాలనే జిన్నా ప్రతిపాదనను అంగీకరించవద్దని ఆ ప్రసారాలలో నేతాజీ భారత జాతీయ నాయకులను కోరాడు. ఇండియాను విభజించటానికి ఆధారం కోసం, సంభాషణల సమయంలో బ్రిటిష్‌వాళ్ళు సాంఘిక దురభిమానాలు, మతతత్వ శక్తులను రంగంలో దింపుతారని, ఆ శక్తులను గురించి అప్రమత్తంగా ఉండమని, ఆ నాయకులను హెచ్చరించాడు.

1945 ఆగస్టు 9వ తేదీన జపానుకు వ్యతిరేకంగా సోవియట్ యూనియన్ యుద్ధంలో ప్రవేశించింది. వెంటనే సోవియట్ సైన్యాలు మంచూరియాను, ఉత్తర జపాను దీవులను ఆక్రమించాయి. మరునటి వారంలో జపాను నగరాలైన హిరోషిమా, నాగసాకిలమీద అమెరికా అణుబాంబులను వేసింది. ఆ రెండు నగరాలు సర్వనాశనం అయిపోయాయి. ప్రాణ నష్టానికి అంతులేదు. ఆనాటి నష్టం మానవ చరిత్రలో, యుద్ధాల చరిత్రలో, అపూర్వం. జపాను విధి నిర్దేశింపబడింది. కాగా జపాను ఆగస్టు 14వ తేదీన మిత్ర పక్షాలకు బేషరతుగా లొంగిపోయింది.

నేతాజీ ఝాన్సీ రాణి దళం యిస్తున్న సాంస్కృతిక ప్రదర్శనను చూస్తూ ఉండగా, జపాను లొంగుబాటు వార్త ఆయనకు చేరింది. అయినా మామూలుగానే ఆ ప్రదర్శన పూర్తి అయ్యే వరకు ఉండి, తరువాత తన కార్యాలయానికి వెళ్ళి తన మంత్రి వర్గపు అత్యవసర సమావేశాన్ని జరిపాడు. తరువాత రెండు రోజులలోను తన ప్రభుత్వపు పరిపాలక సిబ్బందిని, సింగపూరులోను, సింగపూరు వెలుపల వున్న ఐ.యన్.ఏ. సైనికులను పద్ధతి ప్రకారం విడుదల చేశాడు. 1945 ఆగస్టు, 15న ఆయన జారీ చేసిన ఆజ్ఞలో యిలా చెప్పాడు:

"మన మాతృభూమి విముక్తి పోరాటంలో నిమగ్నమై వున్న మనను ఇప్పుడు, కలలో కూడ ఊహించని విధంగా క్లిష్ట పరిస్థితులు ముంచెత్తుతున్నాయి. ఇదొక కఠినమైన పరీక్షా సమయం. ఇప్పుడు మీరు

ఒక విప్లవాత్మక సైన్యం సభ్యులవలె, హుందాగా క్రమశిక్షణగల సైనికులవలె మెలగాలి. ఇండియా గమ్యం గురించి మీరు ఒక్క క్షణంకూడ ఊగిసలాడకూడదు. ఢిల్లీకి ఎన్నో మార్గాలున్నాయి. ఢిల్లీ యింకా మన గమ్యమే. ఇండియాకు త్వరలో విముక్తి లభించి తీరుతుంది."

అదే రోజున తూర్పు ఆసియా భారతీయులకొక సందేశాన్ని పంపించుతూ ఆయన ఇలా అన్నారు: "భారతదేశం స్వాతంత్ర్యం కోసం జరిగిన పోరాటంలో ఒక మహత్తరమైన అధ్యాయం ముగిసింది. ఈ అధ్యాయంలో తూర్పు ఆసియా భారతీయుల కుమారులకు, కుమార్తెలకు చెరగని స్థానం ఉంటుంది. ఇది మన తాత్కాలిక ఓటమి మాత్రమే. నిరాశ పడకండి! ఇండియాను ఎల్లకాలం బానిసత్వంలో ఉంచగల శక్తి యీ భూమిమీద లేదు."

బర్మా పతనమైన నాటి నుండి ఇండియా స్వాతంత్ర్య సమరాన్ని కొనసాగించే నిమిత్తం సోవియట్ యూనియన్‌కు వెళ్ళాలని నేతాజీ అనుకున్నట్లు అభిజ్ఞవర్గాలలో వినికిడి. జపాను సర్వ సైనికాధికార వర్గం యీ ప్రతిపాదనకు అంత అనుకూలంగా లేకపోయినా, దక్షిణప్రాంతం సర్వ సైన్యాధ్యక్షుడైన టెరౌచితో సహా కొందరు జపాను ఉన్నత సైన్యాధికారులు సుభాసు చంద్రునికి అటువంటి భవిష్యత్తు పథకాలను అమలు పర్చటంలో సహాయపడాలని అనుకున్నారు. అజాద్ హింద్ తాత్కాలిక ప్రభుత్వపు మంత్రివర్గ సమావేశం జరిగింది. హబీబ్-ఉర్-రహ్మాన్, ఎస్.ఏ. అయ్యర్, అబిద్ హసన్, దేవ్‌నాధ్ దానులను మరికొందరిని వెంటబెట్టుకొని, నేతాజీ 1945 ఆగస్టు 15న టోక్యో వెళ్ళటానికి బయల్దేరాలని నిర్ణయం అయింది. వారి విమానం టోక్యోకు బయల్దేరింది. దారిలో అది బ్యాంకాక్, సైగాన్‌లలో ఆగింది.

సైగాన్‌లో నేతాజీకి మరొక విమానంలో సీటు ఏర్పాటు చేశారు. అదొక భారీ బాంబరు విమానం. అది జపాను వైమానిక దళానికి చెందినది. అందులో ప్రధానంగా టోక్యో వెళ్ళుతున్న జపాను సైన్యాధికారులు ఉన్నారు. అందులో మరొక సీటు కూడా ఖాళీగా వుంది. కాగా నేతాజీ హబీబ్-ఉర్-రహ్మానును కూడా తన వెంట తీసుకొని వెళ్ళారు. మిగతావారిని తన వెనక టోక్యోకు రమ్మన్నారు.

సైగాన్‌నుండి బయల్దేరిన తరువాత వారొక రాత్రి టురైన్ (ఉత్తర

ఇండో-చైనా)లో గడిపారు. అదే విమానంలో వారు ఆగస్టు 18వ తేదీన తైవాన్, మంచూరియాల మీదగా టోక్యో వెళ్ళేందుకు, తైవాన్‌కు బయల్దేరారు.

ఆగస్టు 23న ఒక రేడియో ప్రకటన వెలువడింది. టాయ్ హోకూ విమానాశ్రయంలో పైకిలేస్తూ, ఆ విమానం కూలిపోయిందని టోక్యో ఆ ప్రకటన ద్వారా ప్రపంచానికి తెలియజేసింది. ఆ దుర్ఘటనలో జపాను సైన్యాధిపతి షిడే, ఆ విమానాన్ని నడిపిన పైలట్లూ, మరికొందరూ మరణించినట్లూ, నేతాజీ తీవ్రంగా గాయపడినట్లూ, ఆయన ఒళ్ళంతా చాలాభాగం కాలినట్లూ ఆ ప్రకటన తెలియజేసింది. ఇంకా నేతాజీ అదే రాత్రి టాయ్‌హోకూ సైనిక వైద్యాలయంలో మరణించినట్లు కూడా ఆ ప్రకటన తెలిపింది. హబీబ్-ఉర్-రహ్మాన్ కథనం ప్రకారం నేతాజీ భౌతిక అవశేషాలకు టాయ్ హోకూలో దహన క్రియలు జరిగాయి. ఆయన చితాభస్మాన్ని ఆ సెప్టెంబరు మధ్యలో జపానుకు పంపించారు. దానిని తరువాత టోక్యో పరిసరాలలో వున్న రెంకోజి దేవాలయంలో భద్రపరిచారు. అయితే నేతాజీ మరణించాడు అన్న వార్తను ప్రామాణికమైన వార్తగా పరిగణించని ఇండియావారు ఇంకా ఎందరో యిప్పటికీ ఉన్నారు.

బర్మా యుద్ధకాలంలో, ముఖ్యంగా రంగూన్ పతనం తరువాత, అజాద్ హింద్ ఫౌజ్ సాహసకృత్యాలను గురించి వార్తలు కొద్దికొద్దిగా ఇండియాకు చేరటం ప్రారంభమైంది. ఐ.యన్.ఏ. ఖైదీలను బాధించుతున్నట్లూ, కొందరిని ఉరి తీసినట్లూ వదంతులు వ్యాపించగా, "ఐ.యన్.ఏ. ఖైదీలను శిక్షించటాన్ని, భారతీయులను, మొత్తం భారతీయులనే శిక్షించినట్లుగా పరిగణిస్తాం" అని జవహర్‌లాల్ ఉద్ఘాటించాడు. ఆ సెప్టెంబరులో జైలునుండి విడుదల అయిన వెంటనే "ఐ.యన్.ఏ. ఆఫీసర్ల, సైనికుల వెంట్రుకలను అంటుకున్నా సహించేది లేదు అని సూటిగా బ్రిటిష్ ప్రభుత్వాన్ని హెచ్చరించాడు. నేతాజీ, ఐ.యన్.ఏ.ల విషయంలో నాటి భారతదేశం ఏ విధంగా, ఏ స్థాయిలో స్పందించిందీ యీ ప్రకటనలు తెలియజేస్తాయి."

1945 ఆగస్టులో రెండవ ప్రపంచయుద్ధం ముగిసింది. ఆనాడు భారత స్వాతంత్ర్యోద్యమం క్షీణాతిక్షీణ దశలో వుంది. 1942 ఆగస్టు తిరుగుబాటు, తరువాత అజాద్ హింద్ ధర్మ యుద్ధం ఓడిపోయిన ఫలితంగా

భారత జాతీయ శక్తులను నిరాశ, అధైర్యం, ఆవహించాయి. భారత జాతీయ శక్తులు ఆ దిగ్భ్రమలో చిక్కుపడి ఉన్నప్పుడు, భారత రంగస్థలం మీద దైవము పంపిన దివ్యశక్తి వలె ఐ.యన్.ఏ. దిగింది. ఒక మనిషి ప్రతిబింబం భారత రాజకీయ రంగాన్ని శాసించటం ప్రారంభించింది. తూర్పు ఆసియా నుండి తిరిగివచ్చిన ఐ.యన్.ఏ. ఖైదీలు, స్వదేశానికి తిప్పి పంపివేయగా తిరిగి వచ్చిన భారతీయులు నాటి భారతదేశంలో పూర్తిగా విప్లవాత్మకమైన ఒక నూతన వాతావరణాన్ని సృష్టించారు. ఐ.యన్.ఏ. దాని నాయకుడైన నేతాజీల సాహసకృత్యాలను బయటకు పొక్కనివ్వకుండా ఉంచటానికి, వాటిపైన బ్రిటిష్ ప్రభుత్వం వేసిన ముసుగు చిరిగింది. అజాద్ హింద్ వీరోచితకృత్యాలు, ఆ సాహసకృత్యాల వర్ణనాత్మక చిత్రాలు మొత్తం భారత జాతిని బ్రహ్మాండంగా ఉత్తేజపర్చాయి. భారతదేశం విప్లవాత్మకంగా ఊగిపోయింది. భారతీయులు తమ రాజకీయ, కుల, మత, విభేదాలను ఒక్కసారి మరచిపోయారు. చిన్నా పెద్దా, ఆడా మొగా తేడాలు లేకుండా అందరూ ఒక్కసారి మూకుమ్మడిగా ముందుకు ఉరికారు. కాగా దేశభక్తితో కూడిన వారి కార్యక్రమం నూతన శిఖరాలను అధిరోహించింది. ఐ.యన్.ఏ. ఆఫీసర్లైన షానవాజ్, సహగల్, థిల్లాన్‌లను కోర్టులో ఆదుకోవటానికి భారత జాతీయ కాంగ్రెసు ఐ.యన్.ఏ. రక్షణ కమిటీని నియమించింది. ప్రముఖ భారత న్యాయవాదియైన భూలాభాయి దేశాయి ఆ కమిటీ నాయకుడు. ఐ.యన్.ఏ. ఆఫీసర్లు, సైనికులు తెల్లవారేటప్పటికి భారత జాతి వీరులయ్యారు. "జైహింద్" జాతీయ నినాదమైంది. బ్రిటిష్ ఇండియా సైన్యంలో, యీ నూతన పరిణామాలను అత్యధికంగా చర్చించటం ప్రారంభమైంది. ఆ సైన్యంలో తీవ్రమైన సంక్షోభం ఏర్పడింది. బ్రిటిష్ ఇండియా వైమానిక దళంలోనూ, నావికాదళంలోనూ బహిరంగంగానే తిరుగుబాట్లు జరిగాయి.

ఆ విధంగా 1946 ఆరంభంలో, నేతాజీ కోర్కెల ప్రకారం, యుద్ధానంతరం ఉప్పొంగిన భావోద్రేకత భారతజాతిని స్వాతంత్ర్యం గుమ్మందగ్గరకు తెచ్చింది. బ్రిటిష్ ఇండియా సైనికదళాలకు బ్రిటిష్ కిరీటం యెడలగల విధేయతను అంతం చేసి, దాని స్థానంలో ఇండియాకు, ఇండియా స్వాతంత్ర్యానికి విధేయతను ఏర్పాటు చెయ్యటం నేతాజీ ఆశయం. బ్రిటిష్ వాళ్ళు నెలకొల్పిన సాంప్రదాయం ప్రకారం ఇండియాను తూర్పు

ఆసియాను కూడా వశపరుచుకొనటానికి బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి ఉపయోగపడటమే బ్రిటిష్ ఇండియనా సైన్యం కర్తవ్యం. ఈ సాంప్రదాయాన్ని నేతాజీ అంతంచేసి, భారతదేశానికి కావలసిన పై సంప్రదాయాన్ని, ఒక నూతన సాంప్రదాయాన్ని సృష్టించాడు.

# ఉపసంహారం

ఇండియా స్వాతంత్ర్య సమర చరిత్రలో నేతాజీ సుభాసు చంద్రుడు బహు విలక్షణ వ్యక్తి. ఆకృతిలో, ఆలోచనా విధానంలో, జీవిత సరళిలో, సిద్ధాంతంలో, ఆచరణలో ఆయన ఒక అద్వితీయమైన, అసాధారణమైన వ్యక్తి. ఆచరణలో ఆయన చూపించిన ధైర్యం, సాధించిన విజయాలు ఇరవయ్యవ శతాబ్దపు ఇండియా ఆయననొక అపూర్వవ్యక్తిగా చూపిస్తాయి.

ఆయన జన్మించినప్పుడు, పైపైకి లేస్తున్న బెంగాలు పునరుజ్జీవ ఉద్యమ కెరటం అది లేవగలిగినంత ఎత్తుకు లేచింది. అప్పుడప్పుడే బయటకు కన్పించుతున్న నూతన జాతీయ చైతన్యం ఆయన చిన్నతనాన్ని బాగా ప్రభావితం చేసింది. ఆనాడు పరిణామం పొందుతున్న జాతీయ ఉద్యమంతో సమరసభావాన్ని పెంచుకుంటూ నేతాజీ పెరిగి పెద్దవాడయ్యాడు. నాటి జాతీయ ఉద్యమానికి క్రియాత్మకంగా స్పందించాడు. ఆంగ్లేయ మిషనరీల పాఠశాలలో తనకు సరిపడని వాతావరణంఉం దని గ్రహించి,సుభాను చంద్రుడు తన అంతరాంతరాలలో ఒక తిరుగుబాటుదారుడయ్యాడు. తరువాత ఆయన ఒక మానవతావాదిగా, వివేకానందుని వలె సాంఘిక విప్లవకారుడుగా, చివరికి మిక్కిలి కఠినమైన అనుభవాలు రూపుదిద్దిన రాజకీయ కార్యకర్తగా పరిణామం చెందాడు. అంత చిన్నతనంలో అంత సేవా భావాన్ని పెంపొందించుకున్న వ్యక్తిని సమకాలిక చరిత్రలో చూడటం కష్టం. 1921లో ఆయన ఇ.సి.యస్.కు రాజీనామా యివ్వటమే ఆయన భవిష్యత్తును నిర్ణయించి వేసింది. ఆ రోజునుండి ఆయన వెనుకకు తిరిగి చూడలేదు. ఏ శత్రువుకూ లొంగలేదు.

ఆయన 1920లో లాంఛనప్రాయంగా కాంగ్రెసులో చేరినప్పుడు, ఇంకా ఆయన కేంబ్రిడ్జి విద్యార్థి మాత్రమే. అయితే నూతన భారత దేశాన్ని నిర్మించటంలో కాంగ్రెసు ఎటువంటి పాత్ర వహించాలి అనే విషయంలో ఆయనకు స్పష్టమైన అవగాహన వుంది. ఆయన ఆలోచన శాస్త్రీయమైనది. ఆయన ఆలోచన ప్రకారం భారతదేశానికి స్వాతంత్ర్యాన్ని సంపాదించే

రాజకీయ పక్షమే, దీర్ఘకాలిక పరిశోధన, ప్రణాళికా బద్దమైన కార్యాచరణలను ఆధారంగా చేసుకొని, యుద్ధానంతరం దేశాన్ని పునర్నిర్మించటానికి తగిన సాధనంగా పనిచెయ్యాలి. ఆనాడే ఆయన ప్రతిశాఖలోను పరిశోధకులు, సుశిక్షితులైన ఉద్యోగులు కావలసిన అవసరాన్ని గమనించాడు. వారే స్వతంత్ర భారతదేశాన్ని ముందుకు తీసుకొని వెళ్ళటానికి నడుం కడతారని భావించాడు.

ఇండియా స్వాతంత్ర్య సమరంలో చివరిపాదం చాలా కీలకమైంది. ఆ పాదంలో నేతాజీ ప్రముఖ పాత్ర వహించాడు. అందుకోసం ఆయన ఇండియా పురాతన రాజ్య పరిపాలనా పద్ధతులను, ముఖ్యంగా ఇండియాను బ్రిటన్ జయించి, పరిపాలించటం ప్రారంభించిన నాటి నుండి నడిచిన చరిత్రను శాస్త్రీయంగాను, వస్తుగతంగాను అధ్యయనం చేశాడు. ఆయన అధ్యయనం ఫలితంగా ఆయన ఒక నిశ్చయానికి వచ్చాడు. వలస దేశంలో పాలితులుగా ఉంటున్న భారతీయుల మౌలిక ప్రయోజనాలు, బ్రిటిష్ సామ్రాజ్యవాదుల మౌలిక ప్రయాజనాలు పరస్పరం వ్యతిరేకమైనవి. కాగా బ్రిటిష్ సామ్రాజ్యవాదులకు, పాలితులైన భారతీయులకు మధ్య రాజీ అనేది పొసగని పని. సుభాసు చంద్రుని యీ నిశ్చయం పూర్తిగా శాస్త్రియమైన దైనందున, ఇది తిరుగులేనిది, మార్పులకు చోటు యివ్వనిది, సవరించుటకు సాధ్యం కానిది.

కాగా యీ రెండు శక్తుల మధ్య ఎటువంటి సర్దుబాటు లేదా రాజీ అసాధ్యమైంది. ఆయన సైద్ధాంతిక నిబద్ధతకూ విశ్వాసానికీ భిన్నం కాని విధంగా, ఆయన బ్రిటిష్ పాలనకు వ్యతిరేకంగా ఉద్దేశపూర్వకంగా, సచేతనంగా జాతీయ విముక్తికోసం రాజీలేని పోరాటం అనే విధానాన్ని ఎన్నుకున్నాడు.

ఇండియా దేశాభిమానం, బ్రిటిష్ సామ్రాజ్యవాదంల మధ్య ముఖాముఖి జరిగే అంతిమ పోరాటం తమ జీవితకాలంలోనే జరుగుతుందనీ, తన తరానికి చెందిన విప్లవకారులే ఆ పోరాటంలో ఇండియాకు విజయం చేకూర్చవలసిన బాధ్యతను వహించాలనీ, సుభాసు చంద్రుడు గట్టిగా విశ్వసించాడు. ఆ పోరాటాన్ని నడపటానికి తగిన ఉత్తమ సాధనం కాంగ్రెసు అని కూడ ఆయన నమ్మాడు. అందుకే ఆయన కాంగ్రెసును సామ్రాజ్యవాద వ్యతిరేక సంఘటనగా నిర్మించటానికి,

కాంగ్రెసు రాజీలేని బ్రిటిష్ సామ్రాజ్య వ్యతిరేక యుద్ధ రంగంలో నిలబెట్టడానికీ, ఎంతో పట్టు పట్టాడు. అందుకే ఆయన 1928 కలకత్తా కాంగ్రెసు మహా సభలో ఇండియాకు స్వాతంత్ర్యం కావాలనే తీర్మానాన్ని బలపర్చాడు. 1929 లాహోర్ కాంగ్రెసు సభలో సమానాంతర ప్రభుత్వ స్థాపనకు, బ్రిటిష్ వాళ్ళ వస్తు బహిష్కరణకు పిలుపు యిచ్చాడు. 1938 హరిపుర కాంగ్రెసు సభలో నేషనల్ ప్లానింగ్ కమిటీని ఏర్పాటు చేయాలనీ, కాంగ్రెసు కార్య నిర్వాహక వర్గాన్ని స్వతంత్ర భారత దేశం అత్యవసర ప్రభుత్వంగా పని చేయించాలనీ ప్రతిపాదించాడు. 1939 త్రిపురి కాంగ్రెసు సభలో 'ఇండియాను వదిలి వెళ్ళండి' అని బ్రిటిష్ వాళ్ళకు తుది హెచ్చరిక పంపాలన్నాడు. ఇండియాకు విముక్తి కల్గించాలి అనే విషయంలో ఆయన సైద్ధాంతిక నిబద్ధత భారత స్వాతంత్ర్య సమరంలో ఆయన చేరదలచిన గమ్యాల దృష్ట్యా ఆయన చేసిన పై ప్రతిపాదనలన్నింటినీ అర్థం చేసుకోవాలి.

1938లో కాంగ్రెసు అధ్యక్ష పదవిని స్వీకరించే ముందు ఆయన తన రాజకీయ చింతనను సంక్షిప్తంగా యీ క్రింది మాటల్లో చెప్పాడు: విశాలమైన సామ్రాజ్యవాద వ్యతిరేక యుద్ధ రంగంలో భారత జాతీయ కాంగ్రెసును సంఘటితం చెయ్యాలి. దాని ఆశయం ద్విగుణంగా ఉండాలి. అనగా కాంగ్రెసు కర్తవ్యం ఇండియాకు స్వాతంత్ర్యం సంపాదించటమేగాక, ఇండియాలో సోషలిస్టు రాజ్యాన్ని స్థాపించటం కూడా కావాలి." ప్రపంచంలో జరిగే సామ్రాజ్యవాద యుద్ధాలలో బ్రిటన్ ఇండియాను దోపిడి చేయటాన్ని సక్రియాత్మంగా వ్యతిరేకించే విధానానికి కాంగ్రెసు చాలా సంవత్సరాల నుండి కట్టుబడి వుంది. కాంగ్రెసు దృఢంగా అదే విధానానికి కట్టుబడి ఉండాలనీ, ఇండియాలో బ్రిటిష్ పరిపాలనను స్థంభింప చేయటానికి కాంగ్రెసు ప్రజా ఉద్యమాన్ని తీవ్రతరం చెయ్యాలనీ నేతాజీ సుభాను చంద్రుడు ఉద్ఘాటించాడు. కాని కాంగ్రెసు అగ్రనాయకత్వాన్ని చేజిక్కించుకున్న వర్గం బ్రిటిష్ సామ్రాజ్యవాదంలో పోరాడటానికి సుముఖంగా లేదు. కాంగ్రెసులో వున్న వామపక్షం ముక్కలు ముక్కలుగా విడిపోయి, సైద్ధాంతిక రంధ్రాన్వేషణలో తలమునకలై, ఆచరణలో ఎందుకూ పనికి రానిదై పోయింది. 1939 తరువాత, అనగా ఆకాశానికి అంటుతున్న యుద్ధ జ్వాలలకు ప్రపంచం ఆహుతై పోతున్నప్పుడు కూడ,

ఆ యుద్ధ జ్వాలలలో బ్రిటిష్ సామ్రాజ్యవాదం కూలిపోతున్నప్పుడు కూడ భారతదేశంలో రాజకీయ పక్షాల స్థితి, ఇదే రకమైన దుస్థితి నేతాజీకి పూర్తి నిరాశనూ, నిస్పృహనూ కల్గించింది.

అప్పుడు అంతర్జాతీయ అవగాహనగల సుభాను చంద్రుడు ఆ అంతర్జాతీయ యుద్ధంలో విప్లవాలు చెలరేగే అవకాశాలు గర్భితంగా వున్నాయని గ్రహించాడు. వెంటనే ఒక మహత్తరమైన నిర్ణయాన్ని తీసుకున్నాడు.అదిఆయన తన జీవితంలో తీసుకున్న నిర్ణయాలన్నింటిలోను అతి గొప్పది. దృఢ నిశ్చయంతో, సమరశీల, విప్లవాత్మక విధానాలను అవలంబించి ఇండియా స్వాతంత్ర్యంకోసం ప్రయత్నించాలనేదే ఆ నిర్ణయం.

భారతదేశం స్వాతంత్ర్యాన్ని సాధించటం కోసం రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో నేతాజీ తనకు తానుగా ఏర్పరచుకున్న గమ్యం. భారతదేశంలో బ్రిటిష్ వాళ్ళ బలాబలాల, అలాగే భారత జాతీయోద్యమం బలాబలాల అంచనాలపై ఆధారపడినది. ఇరుపక్షాల బలాబలాను అంచనా వెయ్యటంలో సుభాను చంద్రుడు శాస్త్రీయంగా ఆలోచించాడు. ఇండియా విప్లవానికి పరిపక్వమైందని విశ్వసించాడు. కాని జాతీయ నాయకత్వం మరొక విధంగా భావించింది.

కాగా మూకుమ్మడి సత్యాగ్రహం చేసి బ్రిటిష్ రక్షణ దుర్గాన్ని ఆహారం లేక అలమటించేటట్లు చేసి లొంగదియ్యాలి అనే ఆలోచనకు స్వస్తి చెప్పవలసి వచ్చింది. ఆ పరిస్థితులలో నేతాజీ ఇండియాలో బ్రిటిష్‌వాళ్ళ ఆయువుపట్టు ఏమిటో గ్రహించాడు. ఇండియాలో వున్న బ్రిటిష్ కిరాయి సైన్యం బ్రిటన్‌కు విధేయంగా ఉండటమే ఆ ఆయువుపట్టు అని ధృవీకరించుకున్నాడు. కాగా ఆ అంతర్జాతీయ యుద్ధం సృష్టించిన నాటి క్లిష్ట సమయంలో ఆ విధేయతను రూపుమాపి, దాని స్థానంలో భారత దేశానికి, భారత స్వాతంత్ర్యానికి ఆ సైన్యం విధేయతను ప్రదర్శించేటట్లు తన కర్తవ్యంగా నేతాజీ భావించాడు. సరిగ్గా, ఇదే నేతాజీ ఐరోపాలోను, తూర్పు ఆసియాలోను చేసిన మహత్తరమైన కార్యం. ఇందుకే ఆయన విప్లవకారుల సేవాదళాన్ని ఏర్పాటు చేశాడు. ఏ మార్గాన ఇండియాలో ప్రవేశించటం సాధ్యమైతే, ఆ మార్గం ద్వారా ఇండియాలో ప్రవేశించి, ఇండియా విముక్తికోసం, స్వాతంత్ర్య సమర జ్వాలలను రేకెత్తించటమే ఆ దళం ఏర్పాటు లక్ష్యం.

నాటికి భారత స్వాతంత్ర్యోద్యమం ప్రారంభమై ఒక శతాబ్దం పూర్తైంది. కాని ప్రతి విప్లవాత్మక పోరాటానికి తప్పని సరిగా కావలసిన సైనిక సాంప్రదాయం కాంగ్రెసుకు కొరవయింది. ఆ నూతన సైనిక సంప్రదాయం సామ్రాజ్యవాదానికి దాసోహం అనే పాత సైనిక సంప్రదాయాన్ని అంతమొందించింది. ఆ పాత సైనిక సాంప్రదాయం అంతమైనందున, బ్రిటిష్ సామ్రాజ్యవాదం ఇండియాను స్వాధీనంలో ఉంచుకునేందుకే కాకుండా, తూర్పు ఆసియాను కూడ తన స్వాధీనంలో ఉంచుకునేందుకు ఉపయోగించుకున్న బలమైన ఆయుధాన్ని పోగొట్టుకుంది.

నాలుగు దశాబ్దాల క్రితం రాజకీయ రంగం నుండి నేతాజీ అదృశ్యమైన తరువాత, ప్రపంచ రాజకీయ పరిస్థితి, జాతీయ రాజకీయ పరిస్థితి తీవ్రమైన మార్పులకు లోనయ్యాయి. అనేకమైన ఆసియా ప్రాంతాలలో బ్రిటిష్ సామ్రాజ్యవాదం ఓడిపోయింది. కాని యీ ప్రపంచంలో చాలా ప్రాంతాలలో సామ్రాజ్యవాదం నూతన రూపంలో అవతరించటానికి ప్రయత్నిస్తుంది. మనిషి స్వాతంత్ర్యం ఎప్పుడు దెబ్బతినిపోతుందో అనే భయం యింకా బ్రతికే వుంది. కాగా సామ్రాజ్యవాద వ్యతిరేకతకు అణచి ఉంచిన మానవాళి ఆశలకు, ఆకాంక్షలకు, శాశ్వత చిహ్నంగా నేతాజీ సుభాసు చంద్రబోసు ఉంటాడు. అలాగే గత రెండు శతాబ్దాల కాలంలో ప్రపంచంలో జరిగిన సాంఘిక ప్రయోగాల, సంస్కరణల సంశ్లేషణం మీద ఆధారపడిన ఒక నూతన సమసమాజం ఆవిర్భవించనున్నదనే ఇండియా ఆశకు, విశ్వాసానికి, సుభాసు చంద్రుడు మూలస్థానంగా ఉంటాడు.

మామూలు మనిషిగా కూడ, నేతాజీ ఒక నూతనతత్వ శాస్త్రం కోసం, నూతన నైతిక భావాలకోసం అన్వేషించటం ప్రారంభించాడు. సమకాలిక సమాజంలో ఆయన ఒక అరుదైన వ్యక్తి. గొప్పదైన ఇండియా ఆధ్యాత్మిక వారసత్వం వలన ఒక వంక ప్రభావితుడౌతూనే, ఆయన మరొక వంక ప్రపంచంలో పలుచోట్ల కన్పించిన, ఆధునిక, సాంఘిక, సాంకేతిక ప్రగతిని గమనిస్తూనే ఉన్నాడు. భారతదేశ స్వాతంత్ర్యంకోసం రాజీ, మినహాయింపులు లేని మహోద్యమాన్ని నడిపేందుకు ఏకైక దీక్షతో, అంకితభావంతో, ఎటువంటి శక్తినైనా ధిక్కరించగల ధైర్యంతో,

పర్యవసానాలను గురించి ఆలోచించకుండా త్యాగం చెయ్యగల సాహసంతో, తన దేశస్థులను ఉత్తేజపరచాలనుకున్నాడు. ఈ ప్రయత్నంలో సుభాను చంద్రుడు చాలా వరకు విజయం సంపాదించాడు. అందుకే ఆయన నాయకత్వం ఆదర్శప్రాయమైన నాయకత్వమైంది. అందుకే ఆయన సహజంగా మరణించవలసిన దానికంటె చాలా ముందుగా అస్తమించినా, ఆయన ఆలోచన, ఆచరణల వారసత్వం యీ తరానికి, రానున్న తరాలకు, ఉత్తేజకరంగా మిగిలివున్నాయి.

సుభాను చంద్రుడు, అటువంటి అరుదైన మహా నాయకుడు అని ఎవరికి తెలుసు? ఇండియా మరొకసారి నేతాజీ సుభాను చంద్రుని కనవచ్చును. ఇంకా ఆయన చెప్పినట్లే ఇండియా తరతరాల నుండి తన వారసత్వంగా కాపాడుకున్న సాంస్కృతిక వారసత్వాన్ని, ఆలోచనా ధోరణిని, "తన సందేశంగా ప్రపంచానికి యివ్వవచ్చును."

# ఇంకా చదవదగిన పుస్తకాలు


నేతాజీః సంకలిత గ్రంథం, సంపుటం 1, ద ఇండియన్ పిలిగ్రిమ్ అండ్ లెటర్స్, 1897-1921, నేతాజీ పరిశోధక మండలి, కలకత్తా, 1980.

నేతాజీః సంకలిత గ్రంథం, సంపుటం 2, ద ఇండియన్ స్ట్రగుల్, 1920-1942, నేతాజీ పరిశోధక మండలి, కలకత్తా, 1981.

నేతాజీః సంకలిత గ్రంథం, సంపుటం 3, ఉత్తర ప్రత్యుత్తరాలు, 1920-1926, నేతాజీ పరిశోధక మండలి, కలకత్తా, 1981.

నేతాజీః సంకలిత గ్రంథం, సంపుటం 4, ఉత్తర ప్రత్యుత్తరాలు, 1926-1932, నేతాజీ పరిశోధక మండలి, కలకత్తా, 1982.

నేతాజీః సంకలిత గ్రంథం, సంపుటం 5, ఉత్తర ప్రత్యుత్తరాలు, ఉపన్యాసాలు, అండ్ రచనలు, 1926-1929, నేతాజీ పరిశోధక మండలి, కలకత్తా 1985.

క్రాస్‌రోడ్స్ః సుభాను చంద్రబోసు సంకలిత గ్రంథం, 1938-1940, రెండవ ముద్రణ, నేతాజీ పరిశోధక మండలి, కలకత్తా, 1981.

నేతాజీ అండ్ ఇండియాస్ ఫ్రీడమ్ః ప్రథమ అంతర్జాతీయ నేతాజీ సదస్సు కార్యకలాపాలు, 1973, ఎడిః శిశిర్ కుమార్ బోస్, నేతాజీ పరిశోధక మండలి, కలకత్తా, 1975.

నేతాజీః బొమ్మల జీవిత చరిత్ర, ఎడిః శిశిర్ కుమార్ బోస్, బీరేంద్ర నాథ్ సిన్హా, ఆనంద్ పబ్లిషర్స్ ప్రైవేట్ లిమిటెడ్, కలకత్తా, 1979.

ఇండియా విప్లవం - మౌలిక ప్రశ్నలుః సుభాను చంద్రబోసు, నేతాజీ పరిశోధక మండలి, కలకత్తా, 1970.

ది గ్రేట్ ఎస్కేప్ః శిశిర్ కుమార్ బోస్, నేతాజీ పరిశోధక మండలి, కలకత్తా, మొదటి ముద్రణ, 1975.

ఎబీకన్ అక్రాస్ ఆసియాః సుభాను చంద్రుని జీవిత చరిత్ర, ఎడిటర్స్ః శిశిర్ కె. బోస్, ఎ. వెర్త్, అండ్ ఎస్.ఎ. అయ్యర్, ఓరియంట్ లాంగ్‌మెన్, న్యూఢిల్లీ, 1973.

ఐవార్న్డ్ మై కంట్రీ మెన్: శరత్ చంద్రబోస్ సంకలిత గ్రంథం, 1945-1950, నేతాజీ పరిశోధక మండలి, కలకత్తా, 1968.
ది వాయిస్ ఆఫ్ శరత్ చంద్ర బోస్: సెలెక్టెడ్ స్పీచ్చెస్, 1926-1941, నేతాజీ పరిశోధక మండలి, కలకత్తా, 1979.
ద ఓరకిల్: ఎ క్వార్టర్లీ రివ్యూ ఆఫ్ హిస్టరీ, కరంట్ అఫైర్స్ అండ్ ఇంటర్నేషనల్ రిలేషన్స్, నేతాజీ పరిశోధక మండలి, కలకత్తా, వాల్యూమ్ 1 నుండి 8 వరకు.

Lasertypeset at Crystal Hues, South Extension - I, New Delhi - 49
and Printed at Beauty Print, Paharganj, New Delhı - 35